

722
1139
42

# సంస్థానికత్రయము.

రచన. జె. గురునాథము.

63

# విజ్ఞాపన.

ఈ గ్రంథ మిదివరకే వెలువడసియుండినను, కొన్ని య
వారణ హేతువులచే యాలస్యమాయినది. కాన మా చందాదా
రుల క్షమింప వేడెదెము.

ఇట్లు

గుంటూరు
25—3—10

జే. గురునాధము,
సంపాదకుడు.

# పీఠిక.

ప్రజాసామాన్యము రాజకీయ విషయముల యదార్థమగు జ్ఞానము సంపాదింపవలయుననిన, లౌకిక, రాజకీయ వ్యవహారముల సాధారణముగ వాడబడు పదములయందలి యంతర్భావముల పృథక్కరించి జూచినగాని వీలులేదను యభిప్రాయముతో కొన్ని పదముల (స్వేచ్ఛ, స్వతంత్రము, హక్కు, శాసనము, ప్రభుత్వము, మొదలగునవి) గ్రహించి వానిలోని వేరువేరుభావముల నొకచోటగూర్చి వ్రాసినాడ. తరువాత యింగ్లీషుపదమునైనను తెలుగులో యిప్పుడు సర్వసాధారణముగ వాడబడు పదముల సంగ్రహింపవలెనని బుద్ధి పుట్టెను. వీనితో మార్గదర్శియను నొక గ్రంధమును భాషాసేవక సమాజము తరఫున ప్రచురింపదలచినాడగాని, తుదకాయభిప్రాయము మారి యునైటెడ్ స్టేట్సు, ఇంగ్లండు, ఇండియా రాజ్యప్రకృతులను క్లుప్తముగ వ్రాసి చదువరులు తమంతటతాము రాజకవిషయముల నెట్లు నభ్యసింపవలెనో, పదముల యందలి యంతర్భావముల నెట్లు పరిక్షించుటకు వీలుగలదో యా మార్గమును సూచింపుటకుగాను కొన్ని సాంకేతికపదముల పృథక్కరించి (Analyse) మాదిరికొరకు జూపితిని మరియు షుమారు నూరుప్రశ్నలను సయితము జేర్చితిని. ఒక అధ్యాయము చదువుట ముగిసినతోడనే చదువరులు దానిపై చివరపేజీలలోగల ప్రశ్నలనుచదివి ప్రత్యుత్తరములను గ్రహింపవలయును.

ఈ కాలమున రాజకీయగ్రంథముల వ్రాయబూనుట సంతసకరమైన సంగతికాదు. లేఖరులకు, వ్రాయునప్పుడు మనసులతట్టకనే కొన్నికొన్ని తీవ్రమగు వాక్యములు వ్రాయబడవచ్చును. ఇంగ్లీషున వాడబడు రాజకీయ పదములకు సరిసమానములగు పదములను దెల్పునిఘంటువు లేవియులేవు. మన పండితులును యింగ్లీషునేర్చిన విద్యార్థులును రాజకీయ విషయములపై వ్రాయు నలవాటు కలిగియుండరైరి మరియు యింగ్లీషు భాషయందలి రెండు

మూడు పదములకు తెలుగున యొకటేపదము వాడబడుచుండుటయు తట స్థించుచున్నది; Absolute, despotic, tyrannic, అను మూడుపద ములకు తెలుగున 'నిరంకుశమైన', అనుపదమును యుపయోగింపవలసి వచ్చి నప్పుడు యింగ్లీషు పదములందలిగల యభిప్రాయ భేదములను జూపుటకు వీలులేదు. Absolute rule అను పదద్వయమునకు తెలుగు నిరంకుశ ప్రభు త్వము అని జెప్పవలెను; Tyrannic rule అనుదానికి సయితము నిరంకుశ ప్రభుత్వమని వ్రాయవలయును. 'దీనినే నిరంకుశపాలన యందురు' అను వా క్యమును యింగ్లీషులో రెండువిధముల వ్రాయవచ్చును: (1) this is called absolute Government; (2) this is called tyrannic Government; యీ రెండవ యింగ్లీషు వాక్యము మొదటిదానికంటె తీవ్ర ముగను రాజద్రోహమును సూచింపునేమోయను సంకోశముగలుగ జేయునది గనుయున్నది. అయినను వ్రాయునపుడు లేఖరిమనసున రాజద్రోహపు చింత యంతమాత్రము లేకపోవచ్చును. దీనికికారణము, తెలుగుభాషయందు రాజ కీయగ్రంధములుగాని, పదములుగాని వలయునంత లేకపోవుటయని జెప్ప వలెను.

ఈ గ్రంధము వ్రాయుటలో ముఖ్యముగా నాకు తోడ్పడిన ఇంగ్లీషు గ్రంధములు కొన్నిగలవు: Buyce's American Commonwealth; The Indian constitution by Rangaswamy Iyengar మొదలుగునవి.

ప్రభుత్వమందలి విశ్వాసము, శాసనగౌరవము, యివిలేకుండ యభివృ ద్ధియే ప్రజలకుసమకూడదు. కనుక గ్రంధకర్తలు తాము వ్రాయుగ్రంధము లలో పైవానికి కొరతరాకుండ జాగ్రతపడవలయును. కొద్దిపొరబాటు లెచ్చ టేనియున్నను పాలకులువాని కొండంతజేయరాదు.

గ్రంధ లేఖరి.

# విషయసూచిక.







# శుద్ధపత్రిక

| సంఖ్య. | పం_క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| పీఠిక | 6 | పదములై నను | పదముస్సై నను |
| డిటో 2 | 17 | Buyce's | Bryce's |
| 3 | 10 | Sub-Consionce | Sub-Consciousness. |
| | 13 | పునస్థాపితములగు | పునర్థ్సాపితములగు |
| 75 | 19 | యిూష్టిండియా | యీస్టిండియా |
| 76 | 3 | కార్యదర్శులు | కార్యదర్సులు |
| 79 | 2 | యింగ్లండు | యింగ్లండున |
| | 23 | ముప్పదియైదు | ముప్పదియైదులో |
| 82 | 12 | సర్కారు | సర్కారుచే |
| 83 | 15 | మించియుండ | తగ్గియుండ |
| | 21 | నాశ సేయు నా | సేనానాయకుడు |
| 87 | 5 | తర్వాతి దినము | తర్వాత దినము |
| | 8 | పదహారవ | పదియారవ |
| 89 | 8 | బొందియుండనప్పుడు | అందియుండనప్పుడు |
| 95 | 19 | సర్వకళాపాలలోని | సర్వకళాశాలలోని |
| 96 | 18 | ఆర్దిక | ఆర్థి |
| | 21 | అర్ధి | ఆర్ధి |
| 98 | 23 | మతపీఠస్తుల | మతపీఠస్థుల |

| | | | |
|---|---|---|---|
| 107 | 5 | ఏనను | అయినను |
| 113 | 2 | క్రొత్తపనులేవియు | క్రొత్తపన్నులేవియు |
| | 4 | శాశ్వతముగా | శాశ్వితముగా |
| | 13 | బడదు | బడ్జటు |
| | 16 | ఎనిమిదవ | తొమ్మిదవ |
| 117 | 12 | పరిణామమును | పరిణామము |
| 118 | 1 | ఆయధేయుని | ఆయవిధేయుని |
| 121 | 16 | దండన, | దండన; |
| 122 | 18 | Tatus. | Status. |
| 140 | 9 | ప్రాత | ప్రాతి |
| 146 | 19 | ప్రాభము | ప్రాభవము |
| 148 | 13 | ఆర్ధక | ఆర్థిక |

---

N.B.—ఈ గ్రంథము ముద్రణలో నున్నప్పుడు నేను కార్యస్థానమున చిర కాలము లేకపోవుటచే అచ్చుతప్పులు హెచ్చు లుండుట తటస్థించినది; యిందుముఖ్యముగా నెన్నదగునది యొకటికలదు. "రాజక చైతన్యము" అనునది మొదటి యధ్యాయములోని విషయమైనను, 1-79 పుటల వరకు ప్రతిరెండవ పేజిపై గ్రంథవిషయముగా సంస్థానికత్రయమనుట కుమారుగా వ్రాయబడినది.

సంపాదకుడు.

---



# రాజకచైతన్యము

మన జనబాహుళ్యమునకు సాధారణముగ రాజకప్రసంగములందును, రాజకపోరాటములందును యభిరుచి యంతగలేదు; కాంగ్రెసు, రాజ్యతంత్రము, విభజన, బహిష్కారము, అను పదముల వినునప్పుడు, వాని యంతర్భావముల చక్కగ గ్రహించి క్రియించువారి సంఖ్య మనసంఘమున నతిస్వల్పమని జెప్పవచ్చును. ప్రజావిషయములయం దాసక్తి యిప్పు డంతకంతకు హెచ్చుచున్నది; అయినను చాలామంది యీరాజకప్రసంగముల నేమి యుద్యమముల నేమి వృధాయనినమ్ముట జూచుచున్నారము. "వినినంతసేపు బాగానేయుండును. తుదకు ఫలితముమాత్రము సున్న; యివియన్నియు నొక పెద్దతమాషా" అను వాక్యముల తరుచుగవినుచుందుము. కనుక నీయధ్యాయమున రాజకచైతన్యమనగ నేమియో కొంతవరకు విచారించవలసియుండును.

దేశము,సంఘము,అనుయభిప్రాయము లందరకు గోచరములైయున్నవని జెప్పవచ్చును; వానిలోపములు, వాంఛనీయాంశముల ప్రజలు దెలిసికొని, యెట్లు సవరణజేయుటకు వీలుగలదో ఆయామార్గముల కూడబల్కుకొని యాచరణలోనికిదీసికొనిరావలయును. ఏపనికైన ప్రథమమున దలంపుగలుగును. తలంపు గోరికనుత్పత్తిజేయును. కోరికమనోనిశ్చయమునకుకారణమగును. నిశ్చయము దృఢమగునపుడు కార్యప్రయత్నముజరుగును. తలంపులేకుండ కార్యముజరుగ

జాలదు. దేశమునకేని, సంఘమునకేని కొన్నిలోపములు, కొన్ని వాంఛనీయ ములుగలవని ప్రథమమున ప్రజలకు గోచరము కావలయును. అప్పుడే వానినివ రణకొరకు కోరికబుట్టుట సాధ్యమగును. గట్టికోరికలులేకుండ కార్యాచరణ గలుగజాలదు. జ్వరపీడితుడగువానికి యాకలుండదు; ఆకలిలేకుండ యన్న ముపై కోరికెట్లుజనించును? ప్రథమమున యాకలిగలిగినగాని, యాహారము భుజించి యాకలిదీర్పవలయునను కోరికపొడముటకువీలులేదు. ఆకోరిక బల పడుకొలదిని, అన్నముసంపాదింపవలెననుప్రయత్న ముత్సాహమునొందును. తరువాత భోజనకార్యముజరుగగలదు.

మనకీలోపములుగలవు; యీశక్తిసామర్థ్యములుగలవు; దేశముయొక్క స్థితిగతులిట్లున్నవి; దానియభివృద్ధి యీస్థితినున్నది; వాంఛనీయాంశములిట్లు న్నవి; కావలసినపదార్థమిది; యిదిమనకక్కరలేదు; వీనినేపొందవలయును; లేనియెడల సుఖముండదని ప్రజలు ప్రథమముననాలోచింపవలయును. ఒకప్పు డు నిజముగయాకలియగుచున్నను, జబ్బుచేయాకలున్నట్లుదెలియదు. శోష వచ్చి పడిపోయినప్పుడు రోగి తనకేమికావలయునో, యేమియక్కరలేదో జెప్పలేడు. కాని కొంచెముధారకముపోసినయెడల తెప్పిరిలును. అలాగే యొకప్పుడుప్రజలు తమలోపాలోపములేవియో, తమకుగావలయునంశము లెవ్వియో, తమకు శక్తిసామర్థ్యములెంతవరకుగలవో గ్రహింపలేనంత దుస్థితి యందుందురు. అప్పుడు వారిసంగతిదెలిసినవారు కొంచెము జ్ఞానధారకమును బోసిన దెప్పిరిల్లి, స్వంతప్రయత్నమునకుప్రారంభింతురు. కనుక యీరాజక యుపన్యాసములయొక్కయు, పోరాటములయొక్కయు, వార్తాపత్రికలయొ క్కయు ఫలితము ప్రజలు తమదేశములోని లోపాలోపములను, సుఖాసుఖ ములనుగ్రహించి కూడికజెంది యొండొరులకుసహాయముజేసికొని వ్యక్తిసమి ష్టులకు రెంటియుపయోగముకొరకు పెనగునట్లు దారిజూపుట అయియున్నది.

మనుజుడెప్పుడేపనిజేయుచున్న, నెంతతొందరలోనున్నను, దేహమున యాకలిసంజ్ఞకలిగినతోడనే తనకాకలియగుచున్నదని వెంటనే వానిమనసున

దట్టును. ఒకప్పుడు కార్యపుత్తొందరచే వెంటనే భోజనమునకు వెళ్ళకపోయి
నను, కార్యముచేయుచున్నంతకాలము క్షుద్జ్ఞానము వానిమనసునతప్పకయుం
డును. పనిముగిసినతక్షణము భోజనమునకుబోవలయుననుతలంపుబుట్టును. మ
నము దారిననడుచునప్పుడు, కుడికాలితరువాత నెడమకాలువేయవలెనని
ప్రతిక్షణముదలంచుచు, నిశ్చయించుచు, ముందంజవేయుము; యేది తలంచుచు
న్నను యథాక్రమముగనడచిపోవుదుము. నడచుచున్నామనుసంగతి ప్రత్యక్ష
ముగ మనమనసులనుండనేయుండదు. కాని దారిలో నడ్డమే దేనివచ్చినయెడల
నెంతపరాకుగనుండినను, తప్పనదానిదాటి తిరిగియథాప్రకారము నడచిపోదు
ము. ఒకయడుగుతర్వాత నొకయడుగు వేయవలెనను బుద్ధిని 'అనుద్బుద్ధి'
(Subconscionce) యనిజెప్పుదురు; యీజ్ఞానము ప్రత్యక్షముగ నుండక
పోయినను, సదామనసులోయణగియుండి, అవసరముగునపుడు బయటకొచ్చు
ను. ఇతరతలంపులచే నావిర్భూతమైనను అసలుచెడిపోక సజీవమైయుండును.

ఆలాగుననే దేశవిషయములపై ప్రజలు చైతన్యులైయుండవలెను. లో
పాలోపములు, సుఖాసుఖములు, వాంఛనీయాంశములు, తమ శక్తిసామర్థ్య
ములపై వారిజ్ఞానాభిలాషలు కొన్నికొన్నిసమయముల యవసరముగలిగినప్పు
డు ప్రసరించుటయేగాక, అన్నిసమయములందును, యవసరముబట్టినప్పుడును,
లేనప్పుడును రాజకచైతన్య మితరచైతన్యములచే నావిర్భూతమై, సదాజాగ్ర
దావస్థలోనుండవలెను. మనుజుడు దేహకార్యముల నెంత 'యనుద్బుద్ధి' గల్గి
యుండునో, దేశకార్యములయందు నయితమంత గలిగి యుండవలెను.

చైతన్యమనగ జ్ఞానము (చిత్ = తెలియుట); జ్ఞాన మనేకవిధములుం
డును. దేశము, రాష్ట్రములపైనుండుజ్ఞానము రాజకచైతన్యమ (Political
consciousness) నబడును. రాజకచైతన్యమన దేశస్థితిగతులపై జ్ఞానాభి
లాషలుగలిగియుంటయేగాక, సదా ప్రజలెక్కడేమిసంభవించినను దానివాస
న స్వభావసిద్ధముగగ్రహించవలెను. కాలులో నెంతచిన్నముల్లువిరిగినను, దేహ

మంతయు బాధజెందును. ముల్లుతీయువరకు మనసుస్వస్థతనుండదు. ఆలాగు ననే దేశమున నేమిసంభవించిన, నేమిసంభవించునట్లుదోచినను, ప్రజలందరకు దానివాసనపారవలయును. దానివలనిసుఖము, లేకబాధ వారందరుపొందవల యును. దేశ మొకదేహము, ప్రజలందరు దానిలోనిభాగములు; యేభాగమున కేమిసంభవించిన, నేమిసంభవింపనున్న నందరు దానిబాధ లేక సుఖ మనుభ వింపవలెను. మరియునీవిధముగ తమకు యనుభవముగలదనుజ్ఞానము ప్రజల కుండుటయే రాజకచైతన్యము లేక జ్ఞానమనబడును. దేశమంతయు నొకటి యనియు, వారొండొరులకుసహాయము జేసికొని, కూడిపనిచేయవలయుననియు, ముఖ్యముగనీయైక్యత, నీసహకార్యతనుబలపరచి, దేశముయొక్క యోగక్షే మముల భద్రముచేయుసాధనము ప్రభుత్వమనియు, యట్టి పాలనకార్యముపై తాము జాగ్రతపడవలయుననియు, ప్రజలుగ్రహించునపుడు వారికి రాజకచై తన్యముగలదని జెప్పనగును.

రాజకచైతన్యమన మరికొన్ని యభిప్రాయములుదోచగలవు. ప్రతిమను జుడును తనవ్యక్తిభావముపై గోచరజ్ఞానముగలిగియుండవలెను; అనగా తనకు నాత్మస్వాతంత్ర్యముగలదనియు, తనయభివృద్ధి, సుఖము, సంపదలు, సమిష్టి యొక్కయభివృద్ధి, సుఖము, సంపదలతో కేవలము ఐక్యములుగావనియు వేరువేరుగానుండుటమంచిదనియు వాడుగ్రహింపవలెను. రాజకచైతన్యమున వ్యక్తిసమిష్టులరెంటిపై జ్ఞానమవసరమైయున్నది. మానవహక్కులనుప్రతివారు నుగ్రహించి గౌరవించి పక్షపాతముంచినగాని ప్రజలరాజకీయజీవితముగట్టిపడ దు. వ్యక్తిహక్కులు, ధర్మములపైజ్ఞానమున్నా, వానికొఱకుపరిశ్రమజేయుట కుయిచ్ఛయు, సమర్థతయు, ప్రజలుగల్గియుండవలెను. ఏదేశముల మానవ హక్కులు ప్రజలచేప్రేమింపబడవో, యేదేశముల వ్యక్తిస్వాతంత్ర్య వ్యక్తిజీవ నములకు ప్రాముఖ్యతగలుగదో, ఆదేశములవారి రాజకజీవిత మధమదశయం దున్నదని జెప్పవలయును. స్వవృత్తి, స్వధర్మము, స్వాతంత్ర్యములే యభి వృద్ధిదాయకములనియు, వానియందే ప్రాజాజీవితప్రవాహము నిండిపారుటకు

వీలుగలదనియు నెవరుదెలిసికొనజాలరో వారి రాజకచైతన్యము వృద్ధిజెంది యుండలేదని చెప్పవచ్చును. మనోవాక్స్వాతంత్ర్యము, మతస్వేచ్ఛ, ప్రసంగ హక్కు, న్యాయవిచారణహక్కు, జ్యూరి, బెయిల్ హక్కులు, పత్రికాస్వాతంత్ర్యము మొదలగుహక్కులకుకొఱతయెచ్చటను, యెప్పుడును రాకుండ ప్రతివాడును భద్రపడవలయును.

ప్రజాబాహుళ్యమునకు వ్యక్తిజ్ఞానము సంపూర్ణముగనుండుటయేగాక, వారికి సభ్యతాశక్తియు నతిశయముగనుండవలయును. మానవకార్యములకును, శరీరాంగకార్యములకును పోలిక యనేకవిషయములగలదు. శరీరములోని భాగముల వేఱువేఱుసహజస్వభావముగలవియైనను, యన్నియుకలసి శరీరము సంతటిసుఖమునకు నారోగ్యమునకు ననుకూలపడునట్లు పనిచేయుచు నుండును. అవయవములన్నియు నుదరముయొక్కసుఖముకొఱకును, యుదరము యవయవములపోషణకొఱకును పాటుపడుననుసంగతి మనకుదెలిసినదియే. ప్రతియంగమును తనస్వయోగక్షేమముకొఱకును సమిష్టిశరీరసుఖముకొఱకును, యితరయంగములనన్నిటితో ననుకూలించి పనిజేయుచుండును. అటులనే సంఘదేహముననుండు వ్యక్తులన్నియు తమయొక్కయు, సమిష్టిసంఘముయొక్కయు సుఖముకొఱకు కూడిక జెందివ్యవహరింపవలెను. ఈకార్యమునే సభ్యతయని జెప్పవచ్చును. సభ్యతయనుపదము 'సభ' అనునామమునుండిబుట్టినది. మనుజులు సమిష్టివ్యవహారములనన్నిటిని పరస్పరానుకూలముగ వ్యవహరింపవలెనని న, సభారూపముననే యవిజరుగగలవు. ప్రజల సభ్యత్వగుణము పూర్ణముగ నుండవలయుననిన ముఖ్యముగ మూడులక్షణములద్వార బయలుపడవలయును:

(1) సంఘములోనిప్రతివాడును తనమనమును యితరులమనస్సులతో నెట్లు నేకీభావము నొందునట్లుజేయుటకు వీలుగలదో యామార్గముల సాధింపజూడవలయును. వాడు సమిష్టికార్యములయందు తన వ్యక్తిగుణమునే బురికొల్పి, యితరులుసహాయపడినను, లేకపోయినను తనపైననే వానియాచరణభారము

నిల్పుకొని, ఫలితమునంతయు తానేపొందవలయుననుభ్రమకులోనై యితరుల తనతోకూడనీయక, దంభము, లోభము, స్వలాభము, మొదలగుదుర్గుణములకు లోబడకూడదు; సమిష్టికార్యముల సమిష్టిగానే ప్రతివాడునాచరింపప్రయత్నింపవలయును. సమిష్టియను మూలధనసముదాయమునకుప్రతివాడు తన యాత్మధనమునుసమర్పించి, సమానధనరాశినివృద్ధిజేయప్రయత్నింపవలయును.

(2) సమిష్టికార్యములనాచరింపుటలో ప్రతివాడు వానిజయాపజయముల జవాబుదారీ కేవలము తనపైనయున్నటులేతలంచి, యితరులెవరు దానినాచరింపనట్లుగభావించి, వానిమంచిచెడుగులపైభారము తానె పొందవలయును. సమానయుద్యమమునుపురికొల్పుట తనప్రత్యేకవిధియని ప్రతివాడును, యందరుకూడియు భావింపవలెను.

(3) ఎప్పుడునెచటనుభేదము, విభజనలవలన సమిష్టికార్యములు సమకూడునని నెవరునుదలంపకూడదు; 'సంఘేబలే' యనువాక్యము వ్యర్థమెప్పుడునుగాదు; మానవశరీరములోని యంగములన్నిటికి భేదభావముగలదు; హస్తములున్నటుల పాదములుండవు; పాదములున్నట్లు శిరస్సుండదు; అయిననెంతభేదమున్నను శరీరాంగములన్నియుకలసి పనిచేయుచుండును? అట్లు కూడికతోపెనగుటవలననే శరీరము నారోగ్యస్థితియందుండగలదు.

ప్రజాసభ్యతకు నీమూడుగుణములవసరములు. ఒక యుదాహరణము దీసికొందము. నవీనసంస్థానికరాష్ట్రములన్నియు ప్రజలసభ్యతాగుణముపైనాధారపడియున్నవి. ఇంగ్లండులోని పార్లిమెంటుచరిత్రయు, యిండియాలోని కాంగ్రెసువిషయమును నాలోచింపుడు. పార్లిమెంటుసభ్యులలో నెన్నిపక్షములున్నను, నెందరు పరస్పరయభిప్రాయభేదములుగలిగియున్నను, వానిజయాపజయములకుగా నెంతపోరాడుచున్నను కొంతమితముదాటినతరువాత నందరు నేకీభావముగలిగియుండుట యవసరమని వారుగ్రహించిపనిజేయుదురు. ఒక

విషయముయొక్క యుపయుక్తాయుపయుక్తతలపై చర్చ సంపూర్ణముగజరిగి దానిపై సభ్యులలో విశేషాంశము నొకయభిప్రాయమును స్థిరపరిచినపుడు, యితరులు దానికియడ్డుపెట్టకబద్ధులగుదురు. మరియు సమానాభిప్రాయము గల విశేషాంశమువారు, ప్రతికూలాభిప్రాయులగు యల్పాంశమువారిని పార్లిమెంటుసభనుండి తొలగింపప్రయత్నింపరు. విశేషాంశమునకుగల జవాబుదారీ యల్పాంశములుసయితము తమతోనేకీభవించునట్లుజేయుటకు ప్రయత్నించుటవైయున్నదని వారికిదెలియును. పార్లిమెంటునుత్యజించి నెవరును రాజకపరిశ్రమజేయుటకునిష్టపడరు. మరియు పార్లిమెంటుసభ్యులలోప్రతివారును కార్యాచరణకుగాను, యొండొరులతో నెట్లుయేకీభవించి వ్యవహరించుటకు వీలగునాయని జూచుచుందురు. ప్రతిసభ్యుడును పార్లిమెంటు వ్యవహారములన్నిటికి తానె జవాబుదారియైనట్లుయెంచును; పార్లిమెంటులోనిల్చియే తాను మంచివియనుకార్యసాధనలకుగాను ప్రయత్నించును. ఇండియాలోని ప్రజాసభలస్థితియిట్లున్నదా? లేదనిజెప్పుటవలన దోషమంతలేదని తోచెడిని. కాంగ్రెసువిషయమునెత్తికొనుడు; సభ్యులలో నొకతెగవారు యితరతెగను వెడలగొట్టుటకు, ప్రయత్నింతురు. రెండుపిల్లులుపోరాడి తుదకు రొట్టెనంతయు కోతికిసమర్పించెనునట్లు కాంగ్రెసుపార్టీలచరిత్ర పరిణమించెను. సభ్యతగుణమున ముఖ్యముగ రెండుభావములుగలవు; (1)సహకార్యము (౨)ఐకమత్యము. వీనిని సభ్యులు దమ ప్రధానవర్తనాధర్మములుగ నేర్పరచుకొనవలయును.

రాజకచైతన్యమన మరొకగుణముదోచును. మానవశరీరమంతయు నొక ముద్దవలెనుండదు. దానియందంతటను యంగవిభజనగలదు. శరీరమునకువలయుకార్యములనన్నిటిని యొకటేయంగము నెరవేర్పదు. ఒక్కొకకార్యము నొక్కొకయంగము నెరవేర్పుటకు నిర్మితమయినది; మరియు నది యితరపనుల నేమియు జేయజాలదు. రాజక సాంఘికకార్యములసయితము వేరువేరుపనులు వేరువేరయంగములు నెరవేర్పునట్లు, రాష్ట్రము నిర్మాణము నొందవలయు

ను. ప్రజలును యొకచేపని నందరుజేయ ప్రయత్నింపక వేరువేరుపనులు వేరు వేరుగ చేయుటకు శక్తిసామర్థ్యములు గలిగియుండవలెను. ప్రజాకార్యములనా చరించుటకు జేయబడు ప్రయత్నములన్నిటియందును, అంగీకరణము (Organisation) నవలంబించి వానిసాధింపజూడవలెగాని, వేరొండురీతి బ్రయత్నించుటతగదు. ఈయంగీకరణశక్తి యెంతవరకు ప్రబలమగునో ప్రజలంత ప్రజాజీవితమునకు (Public life) యోగ్యతవహింతురు. నవీనరాజకజీవితము నకుగల ప్రధానచిహ్నము యంగీకరణమని నొక్కిజెప్పవచ్చును. గమ్యస్థానమం దరకునొకటియే; దానినందరును సమానముగ జేరవలసినదే; కాని దానిసాధిం చుటకు నెవరికియనుకూలపడునట్లుగ వారు వేరువేరుమార్గముల బ్రయత్నింప వలయును; మరియు పరస్పరకల్లోలములేకుండ నెవరికివారు తమతమ యథా విధులనొనర్చునట్లు ప్రజలకు శక్తియుండవలయును. ఒక సభయున్నదనుకొను డు. దానిలోనియధ్యక్షుడు యధ్యక్షుడుజేయదగుకార్యములనే సభాసమయ మున జేయవలెగాని, సభ్యులుజేయునట్లుప్రవర్తింపరాదు. కార్యదర్శి, నాయ కులు, సభ్యులు వీరంద రెవరిపనులు వారుజేయజూడవలయును.

మరియు రాజకచైతన్యమన నింకొకయభిప్రాయముగలదు. ప్రజలు తమసభ్యత, వ్యక్తిభావము, అంగీకరణము, మొదలగుశక్తులను ప్రభుత్వప్రతి ష్ఠాపనము పెద్రిప్పి యందలియంశములనుబరీక్షించి, నవరణమార్గములగని పెట్టి రాజకయంత్రము సుఖస్థితిబోవునట్లుజూడవలయును. రాజకీయోద్యోగులవలన గాని, సంఘములోనితరకారణములవలనగాని యుద్భవించులోపముల నెద్దాని నిప్రజలుయతిశాంతితో సహించునట్లు స్వభావమునుగలిగియుండకూడదు. ప్రజ లందరుగాకపోయినను, ప్రజాబాహుళ్యమయిన నిట్టిస్వభావము కలిగియుండ రాదు. ప్రజాలోపములనెవరునుసహింపక, నిర్భయముగ ఖండించి నేరస్థుల బయటికీడీసి, శిక్షించి, సవరణచేయప్రయత్నించు స్వభావములేనివారై యుం డరాదు. వారు తమస్వలాభములనయినత్యజించి యాత్మత్యాగులై పురుషా ర్థముసాధింపనిచ్ఛగలవారై యుండవలయును. కేవలమిచ్ఛజాలదు. సామ

ర్థ్యమునుండవలెను. కొందరుజనులు స్వాతంత్ర్యము పూర్తిగా నాసించియు దానిప్రాప్తికి వలయుసామర్థ్యమునుసంపాదించుటకు జేయవలసినకృషినిజేయ జాలకుందురు- ఇదియు నొకలోపమే- పట్టుదల, ధైర్యము, సహనము, సాహసము, ఆత్మత్యాగము మొదలగుక్రియాధర్మములవారు తమలో వృద్ధిజేసి కొనవలయును-

ఇప్పుడు రాజకశాస్త్రముచుపఠించి, ప్రజలు తమరాజకజీవితమును వృద్ధిజేసికొనగలమార్గములఁగొన్నిటిని జెప్పుదుము- రాజకజీవితము కొంతవరకు గ్రంథపఠన సహాయము వలనను, కొంతవరకు స్వాలోచనవలనను, మరికొంత స్వానుభవజ్ఞానసారమువలనను పెంపొందును- కాని పాండిత్యము లేకపోయినను, జనసామాన్యము రాజకవిషయముల యదార్థ జ్ఞానము కొంతవరకు నొంది, తమరాజకజీవితము వృద్ధిజేసికొని, దానిస్వరాష్ట్రపు వ్యవహారముల నిర్ణయముకొరకుపయోగింపవచ్చును-



## రెండవయధ్యాయము.

### అభ్యాసము-

మన తెలుగువారలకు రాజకజ్ఞానము యిప్పుడున్నదానికంటెయమితముగ కావలసియున్నది- దానికి సాధనములగుమార్గములలోనొకటి పశ్చిమదేశములనున్న రాజ్యప్రకృతులనబడువానిని పరీక్షించిజూచుటయనినాతాత్పర్యము కనుక యీగ్రంథమున యింగ్లండు, యునైటెడ్ స్టేట్సు, యిండియాదేశముల రాజ్యప్రకృతులసంగ్రహించి చెప్పుచున్నాను-

రాజ్యప్రకృతులు (Constitutions) తరుచుగ నయిదుభాగములతో నేర్పాటునొందును- రాజ్యప్రకృతియనగ ప్రభుత్వప్రతిష్ఠాపనముయొక్క-

వ్యవస్థ (అనగా పైయాకారము); పౌరులయెడల పాలనశాఖలకుగలవిధికృత్యములు, యధికారములనునిర్ణయించు నియమములులేక చట్టములయొక్క సముదాయము; యీచట్టములు కొన్ని దేశములలో నొకపత్రముపై లిఖింపబడి యొకశేపర్యాయము యమలులోనికి ప్రజాబాహుళ్యముయొక్క యనుజ్ఞవలన వచ్చును- కొన్ని దేశముల నేకసమయమున నిర్మాణము నొందక, వేలువేలుకాలములజేయబడుశాసనములు, తీర్పులు, నియమములపై నాధారపడును- కాని సంస్థానిక (Constitutional) దేశములన్నిచోట్లను పాలకపాలితసంబంధము కొన్నినియమములపై నేర్పాటగును- ప్రపంచముననున్న రాజ్యప్రకృతులన్నిటికి అయిదుభాగములుగలవని పైనజెప్పియుంటిమి- (1) రాష్ట్రముయొక్క యదార్థములగు హద్దులనిర్ణయము; (2) ప్రజా (పాలితుల) హక్కులప్రకటన (Declaration of rights) వీనిలో ప్రభుత్వము మార్పలేనట్టియు, ప్రజలకు శాశ్వతముగనుండునట్టియు, సంస్థానికహక్కులు గలవు; (3) పాలనాంగముయొక్కనిర్మాణవిధానము; అనగా శాసననిర్మాణ, ప్రయోగ, నిర్ణయాంగములయధికారములును, విధులును, యుద్యోగులపేర్లును, వారినియమములును, ప్రతిఫలములును, పార్లిమెంటుయొక్క యుద్యోగకాలమును ఎన్నిక మొదలగువానిని దెలియజేయును; (4) పాలనకార్యము, శాసనము, వీనిగూర్చినవివిధాంశముల వివరము; అనగా దీనియందుప్రజావిద్య, సేనలు, రాజస్వము, శిస్తు, రాజ్యఋణము, స్థానికప్రభుత్వము, రాజ్యములోనిచెఱసాలలు, వైద్యశాలలు, వ్యవసాయము, కృషి, కర్మవిద్యలు, శిక్ష, రాజ్యప్రకృతిని సవరణజేయువిధము మొదలగుయంశములనువివరింపును; (5) ప్రజాంగీకారమునకుగాను యీపైజెప్పిన రాజ్యప్రకృతినియమములను వారియెదుటబెట్టుటకుగల చర్యావిధానము-

రాజ్యప్రకృతులకుగాని, సంస్థానికరాష్ట్రములకుగాని మూడు యంతర్లక్షణములు గలవు. (1) స్వతంత్రము (2) పార్లిమెంటుసంబంధమయిన పాలన (3) వ్యక్తిభావము. ఈమూడులక్షణములబట్టియే ప్రభుత్వములు సంస్థాని

కములయినది కానిది నిశ్చయించుటకును వీలుగలదు. రాష్ట్రము ఆధేయరాష్ట్రమగుచో దాని ప్రభుత్వకార్యము కొన్ని స్థాపితములగు నియమములకు, పద్ధతులకు, చట్టములకు లోబడి జరుగుచున్నను, దాని సంస్థానికరాజ్యమనరు; మరియు సంస్థానికరాజ్యములన్నియు నేదోవిధమగు పార్లిమెంటుప్రభుత్వ ముండవలయును; పార్లిమెంటుప్రభుత్వమనగ శాసనకార్యము ముఖ్యముగ ప్రజాప్రతినిధులస్వాధీనములోనుండుట; శాసనప్రయోగకర్తలు (the executive) శాసననిర్మాణకులకు ద్వితీయులై యుండుట.

చదువరులు యికమీదవ్రాయబోవు మూడుయధ్యాయములను చక్కగ పరిశీలించి, యింగ్లండు, యునైటెడ్ స్టేట్సు, యిండియా రాజ్యప్రకృతులకు గల పరస్పరతారతమ్యములను, వానివలన ప్రభుత్వకార్యమున సంభవించు లాభాలాభములను బాగుగ గుర్తెరుగవలయును. ఈపరస్పరభేదముల నెట్లు గ్రహించుటకు వీలుగలదో, యామార్గములుకొన్ని యిచ్చట జెప్పబడును. యీవిధమగు యభ్యాసమువలన చదువరులకు పశ్చిమదేశములలో రాజకవ్యవహారము లెట్లు జరుగునో, యేయేపద్ధతులు, ప్రతిష్ఠాపనము లెట్లు యుత్పత్తి జెంది, పరిణామమునకు వచ్చెనో దెలియగలదు.

(1) రాజప్రకృతులు కొన్ని వ్రాయబడును. అనగా కొన్ని కల్పింపబడును. (invented) కొన్ని కల్పనజెందక వృద్ధినొంది క్రమముగా పెరుగును యునైటెడ్ స్టేట్సురాజ్యప్రకృతి చాలవరకు కల్పితమని జెప్పవచ్చును; యింగ్లీషు రాజ్యప్రకృతి చాలవరకు పెరిగినదని జెప్పవచ్చును.

శాస్త్రీయముగ జూచినయెడల యిండియారాజ్యప్రకృతి సంస్థానికము కాదని చెప్పవచ్చును; అయినను శాసననిర్మాణచరిత్ర చాలవరకు యింగ్లీషు పద్ధతిని బోలియుండును.

(2) యింగ్లీషురాజక ప్రతిష్ఠాపనికమార్పులు ముఖ్యముగ నాలుగులక్షణములు గలిగియుండును; అనగా యింగ్లీషురాజకజీవితముఆలక్షణముల ననుస

రించి బోవుచుండును. (1) తీవ్రమయినట్టిగాని, సమూలకమయినట్టిగాని రాజకీయమార్పులయందలి ద్వేషము; అనగా విప్లవముల గర్హించుట; (2) భవిష్యత్తునుగూర్చిన స్వప్నతుల్యములగు భావములకు లోనుగాక, ముందు రాబోవు యవసరములను, సాధ్యములగూర్చి వ్యసనపడక, వర్తమానకాలమునయున్న యవసరముల నవరణకొరకు పెనగుట; అనగాసమయస్ఫూర్తి; (3) మరియు శాసనమే చివరయధికారిగ్నైయుంట; అనగా రాజకప్రతిష్ఠాపనములు శాసనిక రూపమును కలిగియుండును; శాసనికనవరణలు, న్యాయనిర్ణయాంగముల యధికారము యేర్పాటు జెందియుండును. (4) రాజకక్రియాపద్ధతి సదా సాధకమును సాధించుటకు వీలుగల సాధనములను వినియోగించుటనై యున్నది. కార్యవాదమే ముఖ్యముగ యింగ్లీషు రాజకజీవితధర్మముగ కనబడెడిని.

(1) యునైటెడ్ స్టేట్సు, యింగ్లండు, యిండియారాష్ట్రముల రాజ్యప్రకృతుల నభ్యసింపునపుడు ముఖ్యముగా జూడదగినయంశము ప్రజాస్వాతంత్ర్యముల స్థితిగ్నైయున్నది. అమెరికాలో ప్రజలకును, యింగ్లీషువారికిని గల మానవహక్కులను యిండియనులకుగల హక్కులతో సరిపోల్చిచూడవలయును ఇంగ్లీషు అమెరికను రాజ్యప్రకృతులలో ప్రజాస్వాతంత్ర్యముల వివరణ యొక ముఖ్యభాగముగ నున్నది; యిండియను రాజ్యప్రకృతిలేదు.

(2) శాసననిర్మాణాంగములస్థితి యెట్లున్నదో గ్రహింపవలెను; ఎందుకన దేశముయొక్క యోగక్షేమములన్నియు శాసనకార్యముయెట్లు, యెవరివలనయుత్పత్తిజెంది, వ్యవహరింపబడునో, దానిపైన యాధారపడియున్నవి. శాసననిర్మాణపుశక్తి నాధారముజేసికొనియే, నిరంకుశప్రభుత్వము, నాంకుశప్రభుత్వము, ప్రజాప్రభుత్వము, ధనికరాజ్యము మొదలగు రాజ్యవ్యవస్థలు యేర్పాటగును. మరియు శాసనకార్యమున ప్రజలకు సంపూర్ణపరమాధికారము గలదో, లేక సలహాహక్కుమాత్ర మున్నదో, యదియునులేదో, లేక యేతరగతులకు గలదో, వేనికిలేదో; యెన్నికహక్కు యెవరెవరికిగలదో, యెట్లువాడబడుచున్నదో; శాసననిర్మాణము యెన్నివిధములు, యెన్నిరూపములజరుగునో,

యీగ్రంథమునజూపినమూడు రాజ్యప్రకృతులగల భేదమేదియో జదువరులు గ్రహింపవలెను.

(3) శాసనప్రయోగాంగములస్థితికిని, యధికారములకును యీ మూడు రాజ్యప్రకృతులగల భేదములను, చరిత్రలను యుత్పత్తివిధములను, లాభాలాభములను గ్రహింపవలెను. అమెరికాలో ప్రెసిడెంటు, మంత్రులు గలరు; యింగ్లండులో రాజు, క్యాబినెటుమంత్రులు గలరు; యిండియాపై రాష్ట్రపు కార్యదర్శి, యిండియాకౌన్సిలు, వైస్రాయి, ఆయనకార్యనిర్వాహకసభ, గవర్నర్లు మొదలగువారు గలరు. వీరివీరియధికారముల వ్యత్యాసముల గ్రహింపవలెను.

(4) తరువాత న్యాయస్థానములు, న్యాయాధిపతులకు మూడుదేశములలోగల భేదములను గ్రహింపవలెను.

(5) యీగ్రంథమున జెప్పకపోయినను, విద్య, కృషి, కర్మశాలలు, సేనలు, స్థానికప్రభుత్వము మొదలగువానివిషయమై యీమూడురాష్ట్రములలోగల స్థితిగతులను జదువరులు గ్రహింపవలెను.

(6) మరియు ప్రతిప్రభుత్వము కొన్ని మూలభావములపై యుత్పత్తి, వృద్ధులను పొందును; వానిలో కొన్ని నిచట జెప్పవచ్చును; (1) పార్లమెంటుప్రభుత్వము, లేక దాని రాహిత్యము; (2) అధికారమజ్జనము (centralisation); అధికారవిచలనము; రాజ్యాంగవ్యూహనము (organisation of departments): రాజ్యాధికారవిభజన; స్థానికప్రభుత్వము (local self-government); (3) సలహాసభ్యత; క్యాబినెటుపాలన; (4) శాసననిర్మాణశాఖద్వయపద్ధతి (two chamber system); (5) మాండలికప్రభుత్వము, మధ్యప్రభుత్వము మొదలగునవి; యీమూలభావములను చదువరులు బాగుగ గ్రహింపవలయును.

ఒకరాజ్యప్రకృతితో నొకదానినిసరిపోల్చి చూచుటవలననే రాజ్యప్రకృతుల లోపాలోపములు, యుత్పత్తికారణములు దెలియగలవు.



## మూడవయాధ్యాయము.

కాలిఫోర్నియా రాష్ట్రముయొక్క రాజ్యప్రకృతినుండి:—

1879 సం॥రం మార్చి మూడవతారీఖున శాక్రెమెంటో సంవాదమువలన తయారునొంది, 1879 సం॥రం మేయి 7 తారీఖున ప్రజలచే నంగీకరింపబడినది.

### ప్రజాహక్కుల ప్రకటన.

ప్రథమము.

కాలిఫోర్నియా రాష్ట్రపు ప్రజలమయిన మేము, మాకుగల స్వేచ్ఛకొ అకు సర్వేశ్వరునకు కృతజ్ఞులమై, దానిదీవనలను భద్రపరచి శాశ్వతములు జే యుటకుగాను యీ రాజ్యప్రకృతిని స్థాపించుచున్నారము.

నిబంధన 1.

### ప్రజాహక్కుల ప్రకటన.

సూత్రము 1. స్వతః మానవులందరు స్వతంత్ర స్వేచ్ఛలను కలిగియున్నా రు. మరియు కొన్ని మార్పునొందని (శాశ్వతపు) హక్కులను కలిగియున్నా రు. జీవస్వాతంత్ర్యముల ననుభవించి కాపాడుకొనుటయు, ఆస్తినిసంపాదిం చి యనుభవించి రక్షించుకొనుటయు, మరియు రక్షణమును, సుఖమును గలు గజేయుమార్గమునబోయి వానిసంపాదించుకొనుటయు ప్రజలకుగల శాశ్వత హక్కులైయున్నవి.

---

కాలిఫోర్నియా యునైటెడ్డుస్టేట్సులలో నొక వ్యక్తిరాష్ట్రము. యునైటెడ్డుస్టేట్సురాజ్యప్రకృతి గ్రహించవలెననిన, వ్యక్తి, సంయుక్తరాష్ట్రద్వయ ముల రాజ్యప్రకృతుల ప్రత్యేకముగ దెలియవలయును. ప్రథమమున వ్యక్తిరా ష్ట్రముయొక్క రాజ్యప్రకృతి నిచట వ్రాయుచున్నాను.

సూత్రము 2. రాజకీయాధికార మంతయు ప్రజలలోనుండి స్వతఃజన్మము నొందును. ప్రభుత్వము ప్రజలరక్షణ, భద్రము, లాభముకొఱకు నేర్పరుప బడినది. మరియు ప్రజాక్షేమముగోరినప్పుడెల్ల దానిని మార్పులేక సంస్కారము జేయుటకు వారికి హక్కుగలదు.

సూ॥ 3. అమెరికనుసంయుక్తరాష్ట్రములోని కాలిఫోర్నియా రాష్ట్రము అవిభజితమగుభాగమై యున్నది. మరియుయునైటెడ్‌స్టేట్సు రాజ్యప్రకృతిదేశములో ప్రధానచట్టమైయున్నది.

సూ॥ 4. ఈ రాష్ట్రమున సదా పక్షపాతవిచక్షణభేదములు లేనుండ, మతావలంబనమును, మతారాధనయు స్వేచ్ఛగనభ్యసించి యనుభవించుటకు గారంటీ (ఉత్తరవాదము) యుండును. తనమతభేదకారణమువలన నేపురుషుడును సాక్షిగగాని, జ్యూరరుగగాని యుండుట కసమర్థత గలిగియుండదు. మతస్వేచ్ఛహక్కును యతిస్వేచ్ఛగభావించుటయు, లేక రాష్ట్రపు శాంతము లేక రక్షణకు ప్రతికూలమునగు పనుల జేయగూడదు.

సూ॥ 5. తిరుగబాటు, దండయాత్రసమయముల ప్రజారక్షణ కవసరమగునప్పుడుదక్క హేబియసు కార్పసు హక్కు తొలగింపబడకూడదు.

సూ॥ 6. రుజువు ప్రత్యక్షముగ కనుబడునప్పుడును లేక నేరము చాలవరకు నిజముగ కనపడుచున్నప్పుడును గొప్పనేరముల (మస్తకశిక్షల) దక్క తక్కినయంశముల యందరుపురుషులకు జామీనుమీాద వదిలిపెట్టబడు హక్కుగలదు. జామీాను విస్తార ముండకూడదు. జరిమాన మతికఠినముగను, శిక్షయతిఘోరముగ నుండతగవు. సాక్షులనహేతుకముగ నిల్పిపెట్టకూడదు. మరియు వారిని ఖయిదీలుంచబడుచోటుల నుంచరాదు.

సూ॥ 7. జ్యూరీచే విచారణహక్కుందరకుండవలయును; దానిమార్ప తగదు. లౌకికవివాదములలో ముప్పాతికమందికూడి తీర్పుజెప్పినచాలును. కచేరీలో నందరియెదుట రెండుపక్షములవారు విచారణకు జ్యూరియవసరము లే

దని సమ్మతించినచో, దానినాపవచ్చును. ... ... ... వారి సంఖ్య పంద్రెండు లేక పార్టీలు సమ్మతించినయెడల దానికి తక్కువగ నుండవచ్చును.

సూ॥ 8.

సూ॥ 9. ప్రతిపౌరుడు నన్నివిషయములపై, (అహక్కును దుర్వాడుక జేయుటకు జవాబుదారియై) మాటలాడుట, వ్రాయుట, ప్రచురించుటలకు హక్కుకలిగియున్నాడు. వాక్పత్రికాస్వాతంత్ర్యములను నిర్బంధించుటకుగాని, తగ్గించుటకుగాని శాసనమెప్పుడు జేయబడతగదు.

సూ॥ 10. సామాన్యక్షేమముకొరకు ప్రజలు స్వేచ్ఛగాకూడి సభజేసి ప్రసంగించుటకును, తమప్రతినిధులకు యనుజ్ఞలనిచ్చుటకును, కష్టముల తొలగింపుమని శాసనాంగమునకు విన్నప మొనరించుటకును, హక్కుగలిగియున్నారు

సూ॥ 11. సామాన్యధర్మముగల చట్టము లన్నియు నొకటేవిధమగు క్రియాభావముగలిగియుండును.

సూ॥ 12. సేనలు లౌకికయధికారులకు లొంగియుండవలెను. శాంతకాలముల నిలుకడసేన యుంచబడకూడదు. గృహయజమానుని సమ్మతిలేక శాంతసమయమున సిపాయి లెవరును వానిగృహమందు నాపబడకూడదు. యుద్ధసమయములయందయినను, శాసనవిధిప్రకారము జరుగవలయును.

సూ॥ 13. నేరవివాదములలో, ప్రతిన్యాయస్థానమున ముద్దాయి శీఘ్రముగను, బహిరంగముగను విచారణజెందుటకు హక్కుగలిగియుండును. వాని తరపున సాక్షుల రప్పించుటకును, న్యాయవాదిద్వార లేక స్వయముగ వాదించుటకును హక్కుగలిగియున్నాడు.

ఎవరు వొకటే నేరమునకు రెండుపర్యాయములు బాధనొందకూడదు; తనకు వ్యతిరేకముగ తాను సాక్ష్యమిచ్చుటకు బలత్కారము నొందకూడదు. న్యాయచర్యలేక ప్రాణము, స్వేచ్ఛ, ఆస్తి వీనిభ్రష్టతనొందకూడదు. ముద్దాయి

యెదుటను, మరియు వాని న్యాయవాదియెదుటను సాక్షుల వాఙ్మూలముల బుచ్చుకొనునట్లు శాసనాంగమువిధించుటకు హక్కుగలదు.

సూ॥ 14. ప్రతిఫలము ప్రథమమునకలుగజేయకుండ, ప్రజాయుపయోగముకొరకు, ప్రైవేటుఆస్తితీసికొనబడుటయు, లేకహానిజెందుటయుగూడదు

సూ॥ 18. బానిసత్వము, బలాత్కారదాస్యము, నేరములశిక్షరూపమునదప్ప, యీరాష్ట్రములలో నంగీకరింపబడవు.

సూ॥ 19. అహేతుకములగుచర్యలు, నిర్బంధనములనుండి, శరీరము, గృహము, ఆస్తి వీని కాపాడుకొనుటకు ప్రజలకు హక్కుగలదు. కారణము, చర్యస్థానము, ముద్దాయి పేరు, ప్రమాణముపై నుదహరింపబడుటకనే వారంటును జ్యారిచేయగూడదు.

సూ॥ 20. ... ... ...

సూ॥ 21. శాసనాంగముచే మార్పుటకును, తీసివేయబడుటకును వీలులేని ప్రత్యేకపుహక్కులేవియు ప్రజలకుండకూడదు. అందరుపౌరులకు యివ్వబడనిహక్కులు లేక రక్షణలు పౌరుడెవనికిని, లేక వారిలోనేతరగతికిని కలుగకూడదు.

సూ॥ 22. వేఱుగనుండునట్లుజెప్పినప్పుడుదక్కయీ రాజ్యప్రకృతిలోని సూత్రములు ఆజ్ఞనిషేధకభావముల కలిగియున్నవి.

సూ॥ 23. సైహక్కుల జేర్కొనుటవలన, దీనిలో నుదహరించని హక్కుల నిషేధించుటగాని, అవిలేవని జెప్పుటగాని కాదు.

సూ॥ 24. వోటుయిచ్చుటకును, యుద్యోగమువహించుటకును ధనయోగ్యతపనికిరాదు.

## సంయుక్తరాష్ట్రముల రాజ్యప్రకృతి.

1787 సం॥రం సెప్టెంబరు 17 వ తారీఖున జార్జి వాషింగ్టనుయొ

క్క యధ్యక్షతక్రింద జరుపబడిన సంవిదమున యునైటెడ్ స్టేట్సుయొక్క రాజ్యప్రకృతి యీక్రిందరీతిని స్థాపింపబడినది.

ఐకమత్యము నెక్కువగా బలపరుచుటకును, న్యాయస్థాపనకొరకును, దేశశాంతిని స్థిరపరుచుటకును, దేశరక్షణ నేర్పరచి ప్రజాక్షేమమును వృద్ధిజేసి మాకును, మాసంతతివారికిని స్వాతంత్ర్యదీవనలను భద్రపరచుటకు యునైటెడ్డు స్టేట్సుజనులమయిన మేము యీరాజ్యప్రకృతిని స్థాపించి విధించుచున్నారము

నిబంధన 1

సూత్రము 1. సెనేట్ (అనగా అభిజనశాఖ) ప్రతినిధిసంఘములతో కూడినటువంటి సంయుక్తరాష్ట్రపుకాంగ్రెసునకు శాసననిర్మాణ యధికారము లన్నియు మేము యిందుపూర్వకముగ నిచ్చుచున్నారము.

సూ॥ 2. వేఱువేఱురాష్ట్రములలోని జనులచేత ప్రతిరెండవ సంవత్సరమున నెన్నుకొనబడిన సభ్యులవలన ప్రతినిధిసంఘము కూడికజెందవలయును. రాష్ట్రములోని శాసనాంగమునకు సంబంధించియున్న యెన్నికదారులకు కావలసినటువంటియోగ్యతలనే ప్రతిరాష్ట్రములోని యెన్నికదారులు (ప్రతినిధి సంఘము లెన్నుకొనుటకు) కలిగియుండవలెను.

25 సంవత్సరములు మించనివాడెవడును ప్రతినిధిగనుండకూడదు. మరియు సంయుక్తరాష్ట్రములలో నేడుసంవత్సరములు పౌరహక్కు కలిగియుండవలయును. మరియు నెన్నుకొనబడుసమయమున ఆప్రతినిధియెన్నుకొను రాష్ట్రములోని నివాసియై యుండవలెను.

[ఈసంయుక్తరాష్ట్రములో నిమిడియున్న వేఱువేఱురాష్ట్రముల సంఖ్యాప్రమాణమునుబట్టి ప్రతినిధులయొక్కయు ప్రత్యక్షకరముల (పన్నుల) యొక్కయు పరిమితి నేర్పాటుగావలయును. కొంతకాలము నౌకరిజేయవలసిన యుద్యోగులును పన్నులివ్వని ఇండియనులుదప్ప, తక్కినపురుషులలో, అయి

దులో మూడువంతులు ($\frac{3}{5}$) గల, స్వాతంత్ర్యపురుషులసంఖ్య కలిపినయెడల వచ్చు రాష్ట్రముల వేలువేలుసంఖ్యల ననుసరించి పై కార్యములు జరుగవలయును].

యునైటెడ్డుస్టేట్సుకాంగ్రెసుయొక్క ప్రథమసభ తర్వాత మూడుసంవత్సరములలో జనాభా లెక్క జరుగవలయును. తర్వాత యది శాసనము విధించుప్రకారము 10 సంవత్సరముల కొకమారు జరుగవలయును. ప్రతినిధుల సంఖ్య ముప్పదివేలకొకనికంటె మించకూడదు. కాని ప్రతిరాష్ట్రము నొక ప్రతినిధినైనను బంపవలయును. జనాభా లెక్క కట్టుగువరకు, న్యూహాంప్‌షయర్ ముగ్గురుప్రతినిధులను మెసచుసెట్సు యెనిమిదిమందిని, రోడ్డుద్వీపము, అండు ప్రావిడెంట్సు ప్లాంటేషను ఒకడు, కనెటికట్ అయిదుగురు, న్యూయార్కు ఆరుగురు, న్యూజర్సి నలుగురు, పెన్సిల్‌వేనియా యెనిమిదిమంది, డెలివేర్ ఒకడు, మేరీల్యాండు ఆరుగురు, వర్జీనియా పదిమంది, నార్తుకరలోనియ అయిదుగురు, దక్షిణకరలోనియా అయిదుగురు జార్జియా ముగ్గురు ప్రతినిధుల బంపుటకు హక్కుగలదు.

ప్రతినిధుల ఖాళీలు సంభవించినప్పుడు ఆయారాష్ట్రములనుండిన ప్రయోగాంగములు ఖాళిపని భర్తీజేయుటకు యెన్నికయు త్తర్వునివ్వవలయును.

ప్రతినిధిసంఘము తమసభానాయకుని (Speaker) యితరయుద్యోగులను నెన్నుకొనవలయును. మరియు నుద్యోగులపై విద్యుల్లంఘన నేరములమోపుట ప్రతినిధిసంఘమునకు హక్కుగలదు.

నూ॥ 3. ప్రతిరాష్ట్రమునుండి బంపబడిన యిద్దరభిజనుల (సెనటురుల) చే సంయుక్తరాష్ట్రముయొక్క సెనటు (అనగా అభిజనసంఘము) నిర్మాణము నొందును. వీరు ఆరుసంవత్సరములవరకు ఆరాష్ట్రముయొక్క శాసనాంగముచే నెన్నుకొనబడి సభ్యులుగనుందురు. ప్రతిసెనెటరొకవోటును (సమ్మతిని) కలిగియుండును. ప్రథమయెన్నికకాలము తర్వాత వెంటనే సెనెటర్లందరు స

మానమగు మూడుతరగతుల విభజననొందుదురు. మొదటితరగతి సెనటర్లయుద్యోగములు రెండవసంవత్సరాంతమునను, రెండవతరగతియొక్క యుద్యోగములు నాల్గవసంవత్సరాంతమునను, మూడవతరగతియొక్క యుద్యోగము లారవసంవత్సరాంతమునను ఖాళీయగుదురు-కనుక ప్రతి రెండవసంవత్సరాంతమున సభ్యులలో మూడవవంతు ఖాళియగుదురు. రాష్ట్రములోని శాసనాంగముయొక్క విరామకాలమున రాజీనామావలనను, యితరకారణములవలనను ఖాళీవచ్చినయెడల దానియొక్క ప్రయోగాంగము ఆక్టింగుగ (తత్కాలికముగ అనగా శాసనాంగము కూడువరకు) ఖాళీయుద్యోగములను భర్తీచేయవచ్చును- ముప్పదిసంవత్సరములకు మించక, యునైటెడ్డుస్టేట్సులో తొమ్మిదిసంవత్సరములు పౌరుడుకాక యన్నికరాష్ట్రములో తత్కాలమున నివసించనిపురుషుడెవడును సెనటర్ గాకూడదు.

యునైటెడ్డుస్టేట్సుయొక్క వైస్‌ప్రెసిడెంటు (ద్వితీయాధ్యక్షుడు) సెనెటుయొక్క యధ్యక్షత వహింపవలయును- కాని సభ్యులు సమానముగ ఒకయంశముపై విభజనగలిగినసమయమునదప్ప మరెప్పుడును వోటుకలిగియుండడు. వైస్‌ప్రెసిడెంటు లేనిసమయములను లేక ప్రెసిడెంటుపనికి బదిలీగా పనిచేయునపుడును, సెనట్ తత్కాలికముగ యధ్యక్షుని నెన్నుకొనవచ్చును. అది తనయుద్యోగులను నెన్నుకొనవచ్చును.

రాజద్రోహ నేరములను విచారించుటకు సెనటుకే హక్కుగలదు. అప్పుడు సెనటర్లు ప్రమాణములు జేయవలసియుండును. యునైటెడ్డుస్టేట్సు ప్రెసిడెంటు విచారణచేయబడినచో ప్రధమన్యాయాధిపతి యధ్యక్షత నొందవలయును. యేపురుషుడును ⅔ సభ్యుల యేకగ్రీవసమ్మతములేక నేరస్థుడుగ నెంచబడడు.

రాజద్రోహపునేరములలో శిక్ష యుద్యోగభ్రష్టతకంటె వేఱుగా నుండకూడదు- మరియు యునైటెడ్డుస్టేట్సులో గౌరవము, నమ్మకము, లాభము గలుగుయుద్యోగముల వేనికిని హక్కులేకుండుటకంటె మించియుండకూడదు

కాని నేరస్థులగువారు మామూలుచట్టప్రకారము విచారణ, తీర్పు, శిక్షలకుపా
త్రులగుదురు-

సూ॥ **4.** సెనటర్ల యొక్కయు, ప్రతినిధులయొక్కయు యెన్నికలు జరుగవలసినకాలములు, స్థలములు, విధములను ప్రతిరాష్ట్రముయొక్క శాసనాంగము నేర్పాటుచేయవలయును- సెనటర్ల యెన్నికస్థానములను దప్ప యితరనియమములను కాంగ్రెసు తనచట్టముద్వార మార్చవచ్చును- కాంగ్రెసు ప్రతిసంవత్సరమున కనీస మొకసారియైన డిశంబరుయొక్క ప్రథమసోమవారమున కూడవలయును- మరొకరోజునకూడినచో దానికి ప్రత్యేకమయినశాసనముండవలయును-

సూ॥ **5.** ప్రతిశాఖయు తనలోనిసభ్యుల యెన్నికలు ఆహ్వానములురెహాగ్యతలు నిర్ణయించుటకు హక్కుగలదు- వీనిలో విశేషాంశము పనిజరువుటకు కోరమగును- హాజరుకానిసభ్యుల సంఘముయొక్క నియమముల ననుసరించి హాజరుకమ్మని బలాత్కరించవచ్చును, శిక్షింపవచ్చును-

ప్రతిశాఖ తన స్వంతచర్యావిధానమును తానేనిశ్చయించి తనసభ్యులను అక్రమమార్గమునకు శిక్షింపవచ్చును- మరియు సభ్యులలో $\frac{2}{3}$ మూడురెండువంతుల సమ్మతిబట్టి ఒకసభ్యుని వెడలగొట్టవచ్చును-

ప్రతిశాఖ తనచర్యావిధానమును దెల్పు ఒకపత్రికను సిద్ధపరచి రహశ్యాంశములు దప్ప తక్కినవానిని కాలక్రమమున ప్రచురింపవలయును- మరియు హాజరయినవానిలో అయిదవవంతభిప్రాయమునుబట్టి ప్రత్యేక ప్రహాంశములపై సభ్యులిచ్చిన అనుకూల ప్రతికూలసమ్మతులను ఆపత్రికలో జేర్పవలయును

ఏశాఖయు కాంగ్రెస్ కాలమున యొండొరుల సమ్మతములేక మూడురోజులకంటె నాపుదలచేయుటయు యిదివరకున్న నివేశములవదలివేసి యితరచోటులకు పోవుటయు కూడదు-

సూ॥ 6 తమసేవకు బహుమానముగ శాసనవిధిప్రకారము సెనటర్లు

న ప్రతినిధులును యునైటెడ్డుస్టేట్సు కోశాగారమునుండి జీతమునొందవలయును- రాజద్రోహము, దొంగతనము, కల్లోలము యీనేరములకుతప్ప యితర కారణములవలన వారిసభ్యతకాలమునను రాకపోకలసమయమునను వారు బంధింపబడకూడదు- మరియు సభలలోజేయు నుపన్యాసతర్కములకుగాను యితరచోటుల ప్రశ్నింపబడకూడదు- ఏసెనెటరుగాని, ప్రతినిధిగాని తనసభ్యతకాలమున యునైటెడ్డుస్టేట్సు పాలనాంగమున లౌకికయుద్యోగముల వేనియందును నియోగింపబడకూడదు- యునైటెడ్డుస్టేట్సులో యుద్యోగియైన పురుషుడెవ్వడును తనయుద్యోగకాలమున శాఖద్వయమున దేనియందును సభ్యుడుగాకూడదు-

సూ॥ **7.** శిస్తు వసూలుచేయుటకగు ప్రతిబిల్లు ప్రతినిధిసంఘములో ప్రారంభము నొందవలయును- ఇతరబిల్లులయందువలెనే దీనియందును సవరణలను సూచించుటయు, సమ్మతించుటయు. సెనటునకు గలదు-

శాసనశాఖలయొక్క యనుమతినొందిన ప్రతిబిల్లు చట్టముగాకపూర్వము, యునైటెడ్డుస్టేట్సు యధ్యక్షునియెదుట సమర్పితము నొందవలయును- ఆయనయంగీకరించుచో దానిపై తనదస్కతు బెట్టును- తన యాక్షేపణలతో ప్రథమశాఖకు తిరిగిబంపినచో వారు ఆయాక్షేపణలను పత్రికయందుజేర్చి తిరిగివిచారణజేయుటకు మొదలుబెట్టవలెను- ద్వితీయ్యావిచారణయందు సంఘములోని మూటిలో రెండుపాళ్లు $\frac{2}{3}$ ఆబిల్లునంగీకరించినచో రెండవశాఖకు యాక్షేపణలతో బంపబడును- అక్కడకూడ పునర్విచారణజరిగి రెండుపాళ్ళచే నంగీకరింపబడినపుడు శాసనమగును- కాని ఆయావిషయము లన్నిటియందు రెండుశాఖలయొక్క వోట్లు అనుకూల ప్రతికూలధ్వనులచే నిర్ణయింపబడును- మరియు అనుకూల ప్రతికూలపురుషుల పేర్లు ప్రతిశాఖయొక్క పత్రికయందు జేర్చబడును- ఆదివారములుదప్ప దాఖలుచేయబడిన పదిరోజులలో ఆబిల్లును యధ్యక్షుడు తిరిగి పంపనిచో అది ఆయన దస్కతుండునప్పటివలెనే కాంగ్రసువిరామకాలమునదప్ప శాసనమగును- సెనెటు ప్రతినిధిశాఖలయొక్క అంగీకారమునొందవలసిన ప్రతియాజ్ఞతీర్మానము (ఓటును) అధ్యక్షునియెదుట

బెట్టవలయును- అది అమలుకురాకమునుపు యధ్యక్షునియంగీకారము నొంద వలయును- అంగీకారమునొందనిచో శాఖలయొక్క రెండుపాళ్ళసభ్యులచే బిల్లువిషయములో విధించబడినటువంటి నియమములకులోనై యంగీకారము నొందవలయును-

సూ॥ 8 పన్నులు, విధులు, యెగుమతి దిగుమతిశిస్తులు వేసిపోగుచేయుట కును రాజ్యరుణమునుతీర్చుటకును, దేశరక్షణకొరకును యునైటెడ్డుస్టేట్సుయొ క్క సాధారణయోగక్షేమముకొరకు నేర్పాటుచేయుటకును, కాంగ్రెసుకు యధికారముకలదు- కాని ఆవిధులు, కరములు, సుంకములు, సంయుక్తరా ష్ట్రముల సమానముగ నుండవలయును-

మరియు యునైటెడ్డుస్టేట్సుపేరున రుణముజేయుటకును, పరదేశముల తోను, తనలోని వేరువేరు రాష్ట్రములతోను, ఇండియన్ నీగ్రోజాతులతోను కలుగువర్తకమును క్రమపరుచుటకును;

సంయుక్తరాష్ట్రములంతట ప్రాకృతికకరణమునందును, దివాలావిష యములందును సమాననియమముల నేర్పరచుటకును;

నాణెముల ముద్రించి వానివిలువక్రమపరచి విదేశనాణెములవిలువకూడ క్రమపరచుటకును తూనికలు, కొలతలు, నిర్ణయించుటకును;

తాకట్టులయొక్క మోసమునకును దొంగనాణెముల ముద్రించినందుకు ను శిక్షల నేర్పాటుచేయుటకును;

టపాకచేరీలు, టపారోడ్లు స్థాపించుటకును, శాస్త్రము, కళావిద్యల నభివృద్ధిని, గ్రంధకర్తలకును, నూతననిర్మాణకులకును కాపీరైటు (కేవలమయిన హక్కు)ను నిచ్చి ప్రోత్సాహముచేయుటకును;

ప్రధానన్యాయస్థానముక్రిందయుండు న్యాయస్థానముల నిర్మించుటకు ను, సముద్రముపైనజరుగు దొంగతనములు, నేరములు, మరియు యితరదేశ చ ట్టముల నతిక్రమించిజేయు నేరములనువిలక్షించి శిక్షించుటకును, యుద్ధము

ప్రకటించుటకును, సముద్రము, భూమి, వీనిపై జరుగవలసిన ముట్టడులను శాసించుటకును; సేనల తయారుజేసి పోషించుటకును; (కాని దీనికివలయు ధనము రెండుసంవత్సరములకంటె యెక్కువకాల ముపయోగింపబడకూడదు);

నావికసేనను నేర్పాటుజేసి కాపాడుటకును;

భూజలసేనల పాలనవిధానము నిర్ణయించుటకును;

సంయుక్తరాష్ట్రముయొక్క చట్టములను ఆచరణలోనికి బెట్టుటకును; తిరుగుబాటులను అణగద్రొక్కి దండయాత్రలను పారగొట్టుటకు వలయు సేనను సిద్ధముజేయుమని యాజ్ఞాపించు నేర్పాటుచేయుటకును;

ఈభూసేనలను యుద్ధసన్నాహముజేసి గవాతునేర్పుటకును;

వేఱువేఱురాష్ట్రములకు యుద్యోగులనునియమించు యధికారమును కవాతునేర్పుయధికారముమాత్రము వదలివేసి సంయుక్తరాష్ట్రముల సేవకొరకు యుపయోగింపబడువానిని పాలించుటకు నేర్పాటుచేయుటకును;

ప్రత్యేకరాష్ట్రదత్తమై కాంగ్రసుచేతస్వీకరింపబడిన పదిచదరపుమైళ్లు మించనిప్రదేశముల కేవలమయిన సర్వశాసనాధికారమువహించి సంయుక్తరాష్ట్రముయొక్క ప్రధానకార్యస్థానముగ జేసికొనుటకును, కోటలు, మందుగుండుసామానుల పోగుబెట్టుటకుకావలసిన గృహములు, రేవులు, యితరకట్టడములు, వీనినిర్మాణముకొరకు రాష్ట్రముయొక్క శాసనాంగపు యనుమతిని కొనినటువంటిప్రదేశములపై యధికారము చలాయించుటకును;

మరియు పైయధికారములను ప్రయోగపరచుటకుకావలసినటువంటివిన్ని, తగినటువంటివిన్ని చట్టములను నిర్మాణముచేయుటకును యునైటెడ్డుస్టేట్సు పాలనాంగమునకుగాని యితరయుద్యోగాంగములకుగాని యీరాజ్యప్రకృతిచే నివ్వబడిన యధికారము చలాయించుటకు, చట్టములనిర్మించుటకును; కాంగ్రసుకు హక్కుగలదు-

సూ॥ 9. 1808 సంవత్సరమునకుపూర్వము రాష్ట్రములు సరియనుకొను పురుషులదిగుమతికి కాంగ్రెసు నిర్బంధముచేయకూడదు. కాని ప్రతివానిపైన పదిడాలర్లకుమించని పన్ను విధించవచ్చును-

దండయాత్ర, తిరుగుబాటు, విషయముల ప్రజారక్షణగోరినపుడు హెబియస్ కార్పస్ (యెవడును విచారణలేక బంధము జెంది చెరయందుంచబడకుండుటకుగలహక్కు) రద్దుచేయబడకూడదు- జనాభా లెక్క ప్రమాణమునను సరించియే, తలపన్ను గాని లేక ప్రత్యక్షకర మేదియైనను విధింపబడవలెను-

ఎగుమతిపదార్థములపై యేరాష్ట్రమునుండి పన్నులుతియ్యకూడదు- వాణిజ్యము లేక రాజస్వముయొక్క నియమములజేయునపుడు రాష్ట్రముల లోనుండు రేవులకు ఒకదానికంటె నింకొకదానికి పక్షపాతముజూపకూడదు ఒకరాష్ట్రమునుండి యింకొకరాష్ట్రమునకు పోవునపుడు పన్నులుండకూడదు-

శాసనాధికారములేక కోశాగారమునుండి ధనమునుతీయగూడదు- మరియు కాలక్రమమున ఆదాయవ్రయపట్టీలు ప్రచురింపబడవలయును- సంయుక్తరాష్ట్రముచే బిరుదాంకితము లెవరికినివ్వబడకూడదు- కాంగ్రెసుసమ్మతి లేక యేయుద్యోగియు బహుమానము, బిరుదు, జీతము, వేరయుద్యోగము, విదేశరాజు, ప్రభువు, రాష్ట్రముల నెవరినుండి బుచ్చుకొనకూడదు-

సూ॥ 10. ... ... ...

నిబంధన 2-

సూ॥ 1. అమెరికాలోని ప్రెసిడెంటు (అధ్యక్షుడు) ప్రయోగాంగము (executive) నకు ప్రధానయధికారియై యుండవలెను- ఆయన యుద్యోగకాలము నాలుగుసంవత్సరములవరకుండును- వైసుప్రెసిడెంటుతో కలిసి ఆసమానకాలమునసే నీక్రింద జెప్పుకొనువిధమున నెన్నుకొనబడగలడు- కాంగ్రెసులోనుండవలసిన సెనటర్లు ప్రతినిధులసంఖ్యకు సమానమగు సంఖ్యగలయెన్నికదారుల శాసనాంగము విధించుప్రకారము ప్రతిరాష్ట్రము నియమించవలె

ను- సెనెటర్లును, ప్రతినిధులును, లేక యేయుద్యోగియు ఎన్నికదారిగ నుండ కూడదు-

[ఎన్నికదారులు తమతమరాష్ట్రములలోకూడి యిద్దరుపురుషులకు బాలటుపద్ధతిని వోట్లివ్వవలయును- వారిలో ఒకడయినను తమస్వరాష్ట్రమునని వసించువాడుగాకూడదు- ఎన్నబడినవారిపేర్లను, వారుసంపాదించినవోట్లయొక్క జాబితా వ్రాసి దస్కతుజేసి, దానియదార్థమునురూఢిజేసిసీలువేసియునైటెడ్డుస్టేట్సుయొక్క ప్రధానకార్యస్థానమునకు సెనెటుయొక్క యధ్యక్షుని పేర నంపుదురు- సెనెటుయొక్కయధ్యక్షుడు రెండుసభలయెదుట ఆసర్టిఫికెట్టులను తెరచి వోట్లను లెక్కపెట్టును-అందరికంటె నెక్కుడు వోట్లుగల యతడు యధ్యక్షుడగును- కొంతమందికి సమానవోట్లుండుచో ప్రతినిధిశాఖ బాలటుపద్ధతిని యధ్యక్షుని నియమించును......]-

కాంగ్రెసు ఎన్నికదారులను నియమించుకాలమును వీరు తమవోట్లనిచ్చుకాలమును నిర్ణయింపవచ్చును- ఆరోజు యునైటెడ్డుస్టేట్సులంతట సమానమై యుండవలెను-

ప్రెసిడెంటుయుద్యోగమునకు దేశమున జన్మమొందనివాడును, లేక పౌరహక్కు సంపాదింపనివాడును ఎన్నికహక్కుగలిగియుండడు- యునైటెడ్డుస్టేట్సులో 14 సంవత్సరములునివసించి 35 సంవత్సరములుమించినపురుషుడే ప్రెసిడెంటుపనికితగడు-

ప్రెసిడెంటు తనయుద్యోగమునుండి త్రోసివేయబడినప్పుడు, చనిపోయినప్పుడును, రాజీనామాజేసినప్పుడును, లేక ఆయుద్యోగకార్యముల నిర్వహింపలేనప్పుడును, ఆయుద్యోగమును వైసుప్రెసిడెంటు జూడవలసియుండును. మరియు కాంగ్రెసుప్రెసిడెంటు, వైసుప్రసిడెంటుల మరణము, రాజీనామా, లేక అసమర్థత సమయములలో శాసనరీత్యా యింకొకయుద్యోగిని నియమింపవచ్చును. మరియు తిరిగి ప్రెసిడెంటు యెన్నికజెందువరకు ఆ యుద్యోగి కార్యభారము వహింపవలయును..........

తనయుద్యోగమును, స్వీకరించకమునుపు ప్రెసిడెంటు యీక్రింద జెప్పి నప్రమాణమును జేయవలయును. "యునైటెడ్డుస్టేట్సుయొక్క ప్రెసిడెంటు యుద్యోగమును నమ్మకముతో నిర్వహింతుననియు మరియు యునైటెడ్డు స్టేట్సురాజ్యప్రకృతిని నాయావచ్ఛక్తికొలదిని భద్రముచేసి పోషించి కాపాడె దనని ప్రమాణము జేయుచున్నాను''

సూ॥ 2. ప్రెసిడెంటు యునైటెడ్డుస్టేట్సుయొక్క భూజలసేనలయొక్కయు యితరరాష్ట్రములయొక్క సేనయొక్కయు యుద్ధసమయముల సేనానియగును. సేనయుద్యోగులను తమతమవిధులకు సంబంధించిన విషయములపై తమ యభిప్రాయములను వ్రాతపూర్వకముగ పంపమనికోరవచ్చును... సెనటులోని రెండువంతుల సభ్యులసలహా సమ్మతులపై సంధిచేయుటకును రాయభారులబేర్కొని నియమించుటకును యితరప్రజాయుద్యోగుల నియమించుటకును ప్రధానన్యాయస్థానముయొక్క న్యాయాధిపతులను యిందుదహరించని యితరయుద్యోగముల భర్తీచేయుటకును హక్కుగలదు.

సూ॥ 3. సంయుక్తరాష్ట్ర వ్యవహారములగూర్చిన వార్తావిశేషములను కాంగ్రసుకు అప్పుడప్పుడు ప్రెసిడెంటు తెలియపరచి తాను యుపయోగములనుకొనినట్టియు అవసరము లనుకొనినట్టియు చట్టనిర్మాణమును కోరవచ్చును. అసాధారణకాలముల రెండుశాఖలను లేక వానిలో దేనినయినను, సమావేశము జేయవచ్చును. వానిలో విశ్రాంతికాలముపై యభిప్రాయభేద ముండినప్పుడు తనకు యోగ్యమనిదోచునట్లు విరామము నేర్పరుపవచ్చును.

రాయభారులకును యితరమంత్రులకును ఆహ్వానమివ్వవచ్చును. మరియు యునైటెడ్డుస్టేట్సులోని యుద్యోగులను నియమించుటయందును శాసనములు యథావిధిగ పాలింపబడుటయందును జాగ్రత్తపడవలయును.

సూ॥ 4. ... ... ...

నిబంధన 3.

సూ॥ 1. సంయుక్తరాష్ట్రములోని న్యాయనిర్ణయాధికారము ప్రధాన న్యాయస్థాన మొకదానికివ్వవలయును. మరియు కొన్ని చిన్న న్యాయస్థానములను కాంగ్రెసు వేఱువేఱుకాలముల స్థాపింపవచ్చును. యీస్థానముల న్యాయాధిపతులు సద్వర్తనకారణముల నెప్పుడును తమతమ యుద్యోగములనుండి తొలగింపబడకూడదు. మరియు వారికి కొంతప్రతిఫలము యుద్యోగమున నున్నంతవరకు నివ్వవలయును.

సూ॥ 2. రాజ్యప్రకృతియొక్క వ్యాఖ్యానభేదమువలన కలుగు వివాదాంశములన్నియు యీన్యాయసంస్థానములో నిర్ణయింపవలెను. రాయభారులు, మంత్రులు, గవర్నరులు, నావికవిషయములు, రాష్ట్రముల పరస్పరవివాదములు, ఒకరాష్ట్రముయొక్క పౌరులు మరియొకరాష్ట్రముతో కలిగియుండు వివాదాంశములు, వేరువేరురాష్ట్రములయుండుపౌరుల వివాదాంశములుఒక రాష్ట్రములోనేప్రజలలో యొండొరులకుగల వివాదాంశములును, పరదేశమువానిప్రజలతోగల వివాదాంశముల నన్నిటిని న్యాయస్థానములు విచారణచేసి తీర్పుచేయవలెను. రాయభారులు, మంత్రులు, గవర్నరులు, వీరికిని యొకరాష్ట్రమునకునుగల వివాదాంశములనుప్రధానన్యాయస్థానమే ప్రారంభవిచారణను చేయవలయును. కాంగ్రెసుచేయునిబంధనలకు లోనై ధర్మశాస్త్రము, అసలువిషయము మొదలగున్యాయాంశముల నిర్ణయమునకు ప్రధానన్యాయస్థానము అపీల్‌స్థానముగనుండవలెను- నేరములవిచారణ జూరిసహాయమువలన నేరముచేయబడినటువంటి రాష్ట్రములోజరుగవలయును- ఏ రాష్ట్రములోను ఆ నేరము జరుగనియెడల కాంగ్రెసుచట్టముద్వారా విచారణస్థానమును నిర్ణయింపవలెను-

సూ॥ 3. ... ... ...

నిబంధన 4.

సూ॥ 1. ప్రతిరాష్ట్రమునఅమలులోనున్న ప్రజాచట్టములు, రికార్డ్లు,

న్యాయవిచారణవిధానములు, వీనియందు సంపూర్ణనమ్మకమును, గౌరవము చబడవలయును- కాంగ్రెసు సామాన్యచట్టములద్వారా ఆయాచట్టములు, రికార్డ్లు, ఆచరణవిధానములు, రుజువుచేయబడునట్లు విధింపవచ్చును-

సూ॥ 2. ఒకరాష్ట్రములోనిపౌరులుయితరరాష్ట్రములలోపౌరహక్కులకును, స్వాతంత్ర్యములకును హక్కుకలిగియుండవలెను-

సూ॥ 3. సంయుక్తరాష్ట్రములోనికి క్రొత్తరాష్ట్రములుకాంగ్రసుచేత ఆహ్వానముజేయబడి ప్రవేశము నొందవచ్చును, కాని కాంగ్రెసుయొక్కయు రాష్ట్రములయొక్కయుసమ్మతిలేక యిదివరకున్నరాష్ట్రములనుండి విభజనచేతను, కూడికచేతను, నూతనరాష్ట్ర నిర్మాణము నొందకూడదు- యునైటెడ్డుస్టేట్సుదేశము, ఆస్థి (అనగా స్థిరచరాస్థులు) విషయమై తగు నియమములను క్రాంగెసునేర్పాటుచేయవచ్చును

సూ॥ 4. సంయుక్తరాష్ట్రము తనలోని ప్రతిరాష్ట్రమునకు ప్రజాధిపత్యప్రకృతి యుండునట్లు భద్రపఱచవలయును- మరియు విదేశదండయాత్రలనుండియు దానిని రక్షింపవలయును- మరియు అంత దౌర్జన్యములనుండి శాసనాంగముయొక్కగాని లేక ప్రయోగాంగముయొక్కగాని దరఖాస్తుమీద కాపాడవలయును-

## నిబంధన 5.

రాజ్యప్రకృతిని సవరణచేయవలెననిన రెండుశాసనశాఖలలోని సభ్యులలో రెండుమూడు ($\frac{2}{3}$) వంతులు సభ్యులు యంగీకరించినప్పుడును రాష్ట్రములలో రెండుమూడువంతులు$\frac{2}{3}$ శాసనాంగములు దరఖాస్తుచేసినప్పుడును వీలగును- మరియు సవరణలనుసూచింపుటకు సంవిదమునొకదానిని సమావేశము చేయవలయును- అది యీరాజ్యప్రకృతిభాగమువలెనే ప్రమాణమై రాష్ట్రములలోని ముప్పాలు $\frac{3}{4}$ శాంసనాంగములచే స్థిరపరుపబడవలయును- లేక రాష్ట్రములలో ముప్పాలింట సంవిదములుజరిగి స్థిరముచేయవలయును- ఈరెండుమార్గములలో దేనినయినను కాంగ్రసు సూచింపవచ్చును-

నిబంధన 1.

ఈరాజ్యప్రకృతిని స్థాపించుటకు 9 రాష్ట్రములలోజరుగు సంవిదముల యొక్క యంగీకారమునొందిన జాలును-

దీనికిసాక్ష్యముగ యీక్రింద సంతకముజేసినవారిపేర్లు, జార్జివాషింగ్టన్.

ప్రధానరాజ్యప్రకృతి, తర్వాత సంవత్సరములలోజెందిన మార్పులు

(ఇవి అయిదవనిబంధన ననుసరించి బుట్టినవి)

నిబంధన 1-

మతమును స్థాపించుటగూర్చియు దాని స్వేచ్ఛాభ్యాసమును మార్చుటకును కాంగ్రసుచట్టములేమియు చేయరాదు- వాక్పత్రికాస్వాతంత్ర్యములను, సమాజికస్వాతంత్ర్యమును, కష్టముల సవరణకొఱకుజేయబడు ప్రజల విన్నపహక్కును తగ్గించుటకు చట్టములను కాంగ్రసుచేయరాదు-

నిబంధన 2-

స్వతంత్రరాష్ట్రముయొక్క రక్షణకొఱకు బాగుగ తయారుచేయబడిన భూసేన యవసరముగనుక ప్రజలు ఆయుధములనుంచుకొనుటకును, యుపయోగించుకొనుటకును కల హక్కును నెవ్వరును తీసివేయరాదు-

నిబంధన 3-

శాంతసమయముల సిపాయిలు గృహాధికారియంగీకారములేక యెవరిగృహమందును నుంచబడకూడదు- యుద్ధకాలముననయినను శాసనవిధికృతవిధానముననే యాకార్యము జరుగవలయును-

నిబంధన 4-

దేహము, గృహములు, లెక్కలు, ఆస్తి, వీనిరక్షణవిషయమై సహేతువులేని చర్చలనుండి ప్రజలకుగల స్వేచ్ఛహక్కు నతిక్రమింపకూడదు- మరియు ప్రమాణముచేత బలపఱచబడినటువంటితగుకారణములేకను,చర్చప్రదేశము

వివరము లేకుండగను, బంధము చేయబడు పురుషులు లేక వస్తువులవివరము లేకుండ గను వారంట్లేమియు జారిచేయబడతగవు-

నిబంధన 5-

యుద్ధము లేక ప్రజాభయాసమయముల భూజలసేనల కేవలము నౌకరిలో నుండినప్పుడు మోపబడు నేరములదప్ప తక్కిన నేరములకు ఒక పెద్దజ్యూరీచే స్థాపనమునొందినగాని వానికెవడును జవాబుదారికాడు- ఒకటే నేరమునకు రెండుసారులు ప్రాణమునకుగాని యంగమునకుగాని బాధకు బాధ్యుడు కా కూడదు- మరియు తనకు వ్యతిరిక్తముగ తాను సాక్ష్యమిచ్చుకొనమని నేరస్తు ని యెవరిని బలాత్కారము జేయకూడదు- శాసనచర్యలేక యెవడును ప్రా ణము, స్వతంత్రము, ఆస్తి, వీనికి భ్రష్టుడు గాకూడదు- మరియు తగుప్రతి ఫలములేక ప్రజాయుపయోగముకొఱ కెవనిస్వకీయాస్తి యుపయోగమునొంద కూడదు-

నిబంధన 6-

నేరవిచారణల యన్నిటియందును ముద్దాయి త్వరితముగ ప్రజావిచారణ నొందుటకు హక్కుగలిగియున్నాడు- ఈ నేరము యారాష్ట్రములోని యొక నిష్పక్షపాతమయిన జూరీవలన విచారణగలిగి నేరముయొక్క స్వభావము కా రణములగూర్చి దెలుపబడవలయును- ప్రతికూలముగ జెప్పు సాక్షులు ముద్దాయి ని యెదుటనిలుపవలయును- ముద్దాయితరఫున సాక్షులు బలవంతముగనయినను దీసికొనిరావచ్చును- మరియు వానితరఫున వాదించుటకు న్యాయవాదిసహా యము నివ్వవలయును-

నిబంధన 7-

సాధారణపు శాసనవిషయక వివాదములలో వివాదపుమొత్తము 20 డాలర్లుమించినచో జ్యూరీచే విచారణకలుగవలయును- జూరీచే విచారణనొం దిన వివాదాంశమేదియు తిరిగి న్యాయస్థానముల దేనియందును శాసనవిధాన ము ననుసరించియే విచారింపబడవలయును-

నిబంధన 8-

విస్తారము బెయిలుండకూడదు- పన్నులు శిక్షలు అతిక్రూరముగ విధింపబడకూడదు-

నిబంధన 9-

రాజ్యప్రకృతిలో కొన్ని హక్కులనుదహరించుటవలన ప్రజలచే యనుభవమునొందు యితరహక్కులకు ప్రతిషేధము జెప్పుటకాదు-

నిబంధన 10-

రాజ్యప్రకృతిచే సంయుక్తరాష్ట్రముల కివ్వబడనటువంటియు, రాష్ట్రములకు నిషేధము జెప్పనటువంటియు హక్కులను రాష్ట్రములుకలిగియుండును లేక యవిప్రజలకుండును-

నిబంధన 11-

సంయుక్తరాష్ట్రముయొక్క న్యాయనిర్ణయాధికారము శాసనము లేక ధర్మమురీత్యా ఒకరాష్ట్రముపై యితరరాష్ట్రపుప్రజలచేగాని పరదేశీయులచేగానిసంభవమునొందిన లేక నేరముమోపబడినవివాదాంశపుకార్యములసాగదు.

నిబంధన 13-

సూ॥ 1- బానిసత్వము, లేక బలాత్కారపుదాస్యము, న్యాయముగ తీర్పుజేయబడి ఋజువయిన నేరములకు శిక్షగాతప్ప యితరకారణములవలన యునైటెడ్డుస్టేట్సులలోను వానియధికారపుస్థానములనున్ను యుండకూడదు-

సూ॥ 2. తమ శాసననిర్మాణమువలన దీనిస్థాపించి యమలుజరుపుటకు కాంగ్రెసునకు యధికారముగలదు-

నిబంధన 15.

సూ॥ 1. యునైటెడ్డుస్టేట్సులో పౌరులకుగలయెన్నికహక్కు యునైటెడ్డుస్టేట్సువలనను లేక యితరరాష్ట్రములవలనను, జాతి, వర్ణము, లేకపూ

ర్వపు దాస్యస్థితి, వీనివలన రద్దుజేయుటయు తగ్గించుటయు కూడదు-

సూ॥ 2. తగు శాసననిర్మాణమువలన కాంగ్రెసు దీని యమలులోనికి దెచ్చుటకు యధికారముకలిగియున్నది-

N.B.— నిబంధనలు 12, 14 యిచ్చట వదలివేయబడినవి-



## నాల్గవ యధ్యాయము.

<u>సంయుక్తరాష్ట్రపు విధాయకకృత్యములు:—</u> (రాష్ట్రముల సంఖ్య నలుబదినాల్గు) ఇవి సంయుక్తరాష్ట్రమునంతకు సంబంధించియుండును- మరియు సంయుక్తరాష్ట్రము నంతటిచేత నేనిర్వాహకము నొందగలవు- అవి:—

(1) యుద్ధము, శాంతము, సంధులు, పరదేశవ్యవహారములు-

(2) భూజలసేనలు-

(3) సంయుక్తన్యాయస్థానములు-

(4) స్వదేశవిదేశవాణిజ్యము-

(5) నాణెములు-

(6) కాపిరైటు, పేటేంట్లు-

(7) టపాకచ్చేరి, టపారోడ్లు-

(8) పైకార్యములకుగాను, మరియు పాలననిర్వాహకమునకును యవసరమగు రాజస్వము-

(9) రాష్ట్రముల యన్యాయపు లేక పక్షపాతపు చట్టములనుండి పౌరుల గాపాడుట-

ఈవిషయములపై సంయుక్తరాష్ట్రపు శాసననిర్మాణ, ప్రయోగనిర్ణ

యాంగములు పనిచేయును- ఇతరవిషయములు వేఱువేఱురాష్ట్రములజవాబు దారికి వదలివేయబడును-

## ప్రెసిడెంటు.

### I ప్రెసిడెంటుయొక్క యుపయోగము-

(ఎ) శీఘ్రముగను, దృఢముగను కొన్నిపనులు, ముఖ్యముగ రాజకవ్యవహార ములు చిరకాలమాలోచనకువీలులేకుండ జేయవలసియుండును- మానవకార్య ములన్నిటియందు నిటువంటిసమయములు కొన్నిగలవు- అప్పుడు పదిమంది చేతిలో యావ్యవహారముండినచో చక్కగజరుగుటకు సాధ్యముకాదు- వారు కూడికజెందకపోవచ్చును- అప్పుడు సర్వాధికారియగు యొక్కడుండుట మేలు-

(బి) యుద్ధపుసమయములు ముఖ్యముగ నిట్టివి-

(సి) శాసననిర్మాణప్రయోగాంగములకు తులతూనికగ యధ్యక్షుడుండుచో రాజకవ్యవహారములు బాగుగజరుగును-

(డి) విదేశవ్యవహారవిషయములు, సంయుక్తరాష్ట్రవిషయముల నెరవేర్చు యుద్యోగియొకడు నియామికకాలమువరకుమాత్రము యుద్యోగమునొంది జీత ము కొద్దిగజెందుటవలన నిరంకుశుడగుటకు వీలులేదు-

(ఇ) రాజకపక్షములతో సంబంధములేక స్వతంత్రుడై, కాంగ్రెసునకు జ డువక ప్రజాక్షేమమునకు పాటుబడవచ్చును-

### II ప్రెసిడెంటు యధికారములు- విధులు-

(ఎ) యునైటెడ్‌స్టేట్సుతరఫునజరుగు యుద్ధసమయముల భూజలసేనల యధిపత్యము.

(బి) సంధులు- హాజరయిన సెనేటుసభ్యుల ⅔ సమ్మతి సలహాపై సంధిజే

యుంటకును రాయభారులు, గవర్నర్లు, ప్రధానన్యాయాధిపతులు, యితర పెద్ద యుద్యోగుల సెనెటుసమ్మతిని నియోగించుటయు;

యుద్యోగోల్లంఘనవిషయములదప్ప తక్కిన నేరములన్నియు రాజద్రోహములయినను క్షమించుటయు;

అసాధారణకారణముల శాసనశాఖల సమావేశము జేయుటయు;

తనకిష్టపడనిప్రజలచే తయారగుబిల్లులను శాసనము జేయక తిరిగి ప్రధాన స్థలమునకంపుటయు;

కాంగ్రెసునకు దేశస్థితిగతులను దెల్పుటయు; చట్టముల నిర్మాణము జేయమని సలహాజెప్పుటయు;

యునైటెడ్ స్టేట్సులోని యుద్యోగముల భర్తీజేయుట;

విదేశరాయభారుల కాహ్వానమిచ్చుటయు;

శాసనముల చక్కగప్రయోగించుట; ప్రెసిడెంటుపనులై యున్నవి.

వీనిని నాల్గుతరగతులుగ జెప్పవచ్చును. (1) పరదేశవిషయములు- (2) అంతర్పాలన- (3) శాసననిర్మాణవిషయములు- (4) ఉద్యోగములనియోగము

## III ప్రెసిడెంటు యుద్యోగలోపములు.

(ఏ) ఇంగ్లండులోవలెగాక ఈయెన్నికయుద్యోగము ప్రజలు రాజ్యతంత్రజ్ఞుల యాశామోహముల వృద్ధిజేసి, యుద్యోగప్రాప్తికొఱకు న్యాయము, సత్యముల భీతిచెడి ప్రజలను కేవలము సంతసపెట్టుటకు ప్రవర్తింపునట్లు ప్రెసిడెంటును జేయును.

(బి) నాలుగుసంవత్సరములకొకసారి జరుగునుగాన అనేకమాసములవరకు నాలుగువత్సరములకొకసారి ప్రజాసంక్షోభను కలుగజేయును- ధనవ్యయము కలుగును.

(సి) ప్రెసిడెంటుయెన్నికలు రాజ్యతంత్రము సజావుగజరుగుటకు నాల్గు సంవత్సరములకొకసారి యాటంకముకలుగజేయును.

(డి) ప్రెసిడెంటు తిరిగి యింకొకపర్యాయము యెన్నికనొందుటకు వీలుండుటవలన ఆయాసచే న్యాయపరిపాలనజేయ యెన్నికదారులను సంతోషపెట్టుటకు పక్షపాతకార్యములజేయుట తటస్థించును-

(ఇ) అమెరికాలో శ్రేష్ఠులగువారినుండి ప్రెసిడెంటునెన్నుకొనబడుట దుస్తరము. ఎందుకన (1) యూరపుదేశములవలె అమెరికాలో యోగ్యతసామర్థ్యముల శ్రేష్ఠులగువారు రాజకవిషయముల జోక్యముదీసికొనక దేశముయొక్క ధనసంపత్తును వృద్ధిజేయుటయందు పాటుపడుదురు. (2) స్వకీయాశక్తిసామర్థ్యముల ప్రభావమునకు కాంగ్రెసు గాని, యితర రాజక ప్రతిష్ఠాపనములు యవకాశమివ్వవు. (3) గొప్పవారు శత్రుపక్షమును బలపరుచుటకు రాజక వ్యవహారముల వీలెక్కువగనుండును. (4) ప్రెసిడెంటు గొప్పమేధావియగుట యవసరములేదు. దృఢనిశ్చయము, సామాన్యబుద్ధి, సత్యత, న్యాయము, యివియే వానికి ముఖ్యముగ కావలసినగుణములు.

## IV క్యాబినెట్ (అంతరంగసభ)

ప్రెసిడెంటుకు సహాయార్థం మీాయీ నిమిదిమంది మంత్రులుందురు.

(1) రాష్ట్రీపుకార్యదర్శి-

(2) కోశాధికారి-

(3) యుద్ధపుకార్యదర్శి-

(4) న్యాయవాది (Attorney General) అటార్ని జనరల్

(5) నావికకార్యదర్శి-

(6) పోస్టుమాస్టర్ జనరల్-

(7) వ్యవసాయపుకార్యదర్శి-

(8) ఆంతరికపు (Interior) కార్యదర్శి-

వీరిలో ప్రతివారును 8000 డాలరులు (1600 పౌనులు) జీతము బుచ్చుకొందురు- వీరు ప్రెసిడెంటుచేత నియమింపబడుదురు- వీరిలో రాష్ట్రీపుకార్యదర్శి ప్రధానగౌరవముపొందును- పరదేశవ్యవహారములు చాలవరకు ఆయనచేతిలో నుండును; రాష్ట్రీపుచట్టములు, రికార్డులు, ముద్ర వీనిపై జాగ్రత పుచ్చుకొనును- పేటెంట్లు, పించనలు, జనాభ, సర్వేపనులును, ప్రజాభూముల వ్యవహారములనున్ను ఆంతరికకార్యదర్శిచూచును-

## V సెనెటు.

1. విధికార్యములు:— శాసననిర్మాణము, ప్రయోగము, నిర్ణయము-

(ఎ) ప్రతినిధిసంఘముతో కలసి, ప్రెసిడెంటుఅంగీకరించుచో, బిల్లులను చట్టములుగ నిర్మాణము జేయును-

(బి) ప్రయోగకార్యములు:— (1) ప్రెసిడెంటునియోగించుయుద్యోగులు, రాయభారులు, న్యాయాధిపతులు, మంత్రులు వీరిని ఖాయము జేయుట-

(2) ప్రెసిడెంటుజేయుసంధులను తనసభ్యులలో రెండుపాళ్లు ⅔ వ తగ్గక సమ్మతించుట- ⅔ సభ్యులొప్పుకొననియెడల సంధి రద్దుయగును-

(సి) న్యాయనిర్ణయకార్యము:— ప్రతినిధిసంఘము యుద్యోగులపై విధ్యుల్లంఘనకు మోపునేరముల విచారణజేయుట-

మరియు వేరువేరురాష్ట్రీముల వ్యక్తిభావమునురక్షించి సంయుక్తరాష్ట్రీముయొక్క ప్రధానలక్షణముగనున్నది- మరియు రాష్ట్రీప్రభుత్వములకును సంయుక్తరాష్ట్రీమునకును కూడికయొనగూర్చు గొలుసుగనుండును-

సెనెటుయొక్క ప్రధానోద్దేశ్యములు:— (1) చిన్న పెద్దతనముల విచక్షణ

సమానప్రాతినిధ్యమును సంయుక్తరాష్ట్రపు ప్రభుత్వముననిచ్చుటవలన వేఱు వేఱురాష్ట్రముల స్వతంత్రభావము సమాధానమునొందును; (2) ఉద్యోగములనిచ్చుటయందును, సంధులుజేయుటందును, ప్రెసిడెంటునకు సలహాయిచ్చి, కొంచెమభయపెట్టుటకును, తమసభాప్రకృతివలనను, అనుభవమువలనను యోగ్యతగలిగినసభను స్థాపించుటయు; (సెనేటులోని సభ్యులసంఖ్య 88; కనుక వ్యవహారవిచక్షణ బాగుగజరుగుటకు వీలుగలదు);

(3) ప్రతినిధిసంఘముయొక్కతొందరను, చలత్వభావమునణచి, ప్రజాభావము చంచలమగుటవలన సంభవించు యుపద్రవములనుండికాపాడుటయు;

(4) పరదేశములయెడట గౌరవమునొందునట్లు ప్రవర్తించునట్లును, స్వదేశ విదేశవ్యవహారముల నిరాటంకమగు తంత్రము నుపయోగించుటకును, ప్రభుత్వమునకు స్థిరభావము యొనర్పజేయుటకును, ప్రజాయెన్నికలనుండి కొంత స్వేచ్ఛగలిగినట్టియు, యెక్కువకాలము సభ్యతనొందగలిగినట్టియు, యధికానుభవశాలురయినట్టియు సభను నేర్పాటుజేయుటయు;

(5) ఉద్యోగుల విధ్యుల్లంఘనలనేరములను విచారించుటకు న్యాయస్థానములనిర్మించి ప్రయోగాంగముయొక్క క్రూరత్వమునాపుటయు సెనేటుయొక్క ముఖ్యప్రధానోద్దేశ్యములై యుండును.

సెనెటు ప్రజాప్రతినిధిసంఘముయొక్కయతితొందరకును ప్రయోగాంగముయొక్క నిరంకుశయధికారమును యడ్డుపెట్టును. అది ప్రజాధిపత్యమునకును, నిరంకుశరాజ్యమునకును మధ్యగనుండి యారెండుచెడుగులనుతొలిగించును

## VI ప్రతినిధిసంఘము.

1. ఒకరాష్ట్రములోనుండు ప్రజాసంఖ్యప్రమాణముపై యారాష్ట్రమునుండి నెన్నుకొనిబడు ప్రతినిధులసంఖ్య నాధారపడును.

2. దీని సభ్యులందరు శాసననిర్మాణమునిమిత్తము కొన్నికమిటీలుగ విభజనజెందుదురు. అవి:— ఆర్థికవిషయములు; దఖలుకరణము; న్యాయని

ర్నయము; బ్యాంకింగు; నాణెములు; వాణిజ్యము; వ్యవసాయము; పరదేశ విషయములు; ఎన్నికలు; యుద్ధవిషయములు; నావికవిషయములు; పోస్టాఫీసు; ప్రజాభూములు; దేశములు; రెయిల్వేలు; కాలువలు; గనులు; ప్రజాసౌధములు; విద్య; పరిశ్రమ; పాలనాంగములజేయబడుఖర్చులు; నియమము; లెక్కలు; పుస్తకభాండాగారము; పించనలు మొదలగు విషయములకొరకు వేర్వేరుకమిటీలేర్పడును.

## VII సంయుక్త న్యాయస్థానములు.

ఇవి మూడు విధములు.

(1) వాషింగ్టన్‌లోనుండు ప్రధానన్యాయస్థానము;

(2) సర్క్యూటుకోర్టు న్యాయస్థానము;

(3) జిల్లాకచ్చేరీలు-

(ఎ) రాజ్యప్రకృతివలననుండివచ్చు వివాదములను, యునైటెడ్డుస్టేట్సుయొక్క శాసనములనుండివచ్చు వివాదములను, సంధులనుండివచ్చు వివాదములను,

(బి) రాయభారులు, మంత్రులు, గవర్నర్లు వీరిపైవచ్చు వివాదములను

(సి) నావికవివాదములను,

(డి) యునైటెడ్డుస్టేట్సుతోగల వివాదములను,

(ఇ) రెండుమూడురాష్ట్రములు, వానిలోనిప్రజలు, రాష్ట్రము, ప్రజలు, ఒకరాష్ట్రములోనిప్రజలు, విదేశీయులు ఈపార్టీలలోని వివాదములను న్యాయస్థానములు తీర్పవలయును.

ఇంతవరకు పాలనాంగముల విధికార్యముల సంక్షిప్తముగ వివరించియుంటిమి- ఇప్పుడు సంయుక్తరాష్ట్రపద్ధతిని వివరింతుము:—

రాష్ట్రములు:— సంయుక్తరాష్ట్రపు రాజ్యప్రకృతియందు నిర్ధారణ జేసినట్లు కొన్ని నియమముల నతిక్రమించక, వానికిలోనై, తమచివరయధికార ములను సంయుక్తరాష్ట్రమునకు సమర్పించవలెను-

దేశప్రభుత్వమునకు బలపడుచు, తమస్వగౌరవమును కాపాడుకొనునంత సంతుష్టికరముగ రాష్ట్రములవిధికార్యములు నిర్ణయింపబడవలెను-

రాష్ట్రముయొక్కయు, సంయుక్తరాష్ట్రములయొక్కయు హక్కులను, యధికారములను స్పష్టముగ నిర్ధారణజెందియుండవలెను- రాష్ట్రములయొక్కయు, సంయుక్తరాష్ట్రములయొక్కయు యధికారములు నాలుగువిధములజెప్పవచ్చును-

1 సంయుక్తరాష్ట్రమునకేజెందియుండు నధికారములు:—

(ఇవి పరదేశవిషయములు, భూజలసేనలు, వాణిజ్యము, నాణెములు, తూనికెలు, కొలతలు, టపాకచేరీలు, శాసననిర్మాణ, ప్రయోగనిర్ణయ విషయములు కొన్ని నియమములు)-

2 రాష్ట్రముకేజెందు వ్యవహారములు:—

(ఇవి ఆంతరికప్రభుత్వము, వ్యక్తిశాసనములు, శాసనక్రమస్థాపనము, స్థానికప్రతిష్ఠాపనములు, విద్య, బీదలరక్షణ, పైపనులకువలయు రాజస్వము)

3 సంయుక్తరాష్ట్రము, వ్యక్తిరాష్ట్రముల రెంటికిగలహక్కులు:—

(దివాలవిషయములు, నావికనియమములు, మరియు సంయుక్తశాసననిర్మాణములేనటువంటి వాణిజ్యవ్యవహారములు, పరాపరోక్షకరములు, కాంగ్రెసునకుయధికారములేని న్యాయనిర్ణయవిషయములు, సెనెటర్లు, ప్రతినిధుల యెన్నికవ్యవహారములు)

4 సంయుక్తప్రభుత్వమునకులేని యధికారములు:—

1 హేబియస్ కార్పసును రద్దుచేయుట-

2 వాణిజ్యపక్షపాతము-

3 బిరుదులు, వాంగ్మతపత్రికాయుధస్వాతంత్ర్యముల దీసివేయుట-

4 ఉద్యోగుల మతయోగ్యతలకు పరీక్షలేకుండుట-

5 జ్యూరివిచారణ పెద్దనేరములలోనుండవలెను- 20 డాలరులు మించిన లౌకికవివాదములకు జ్యూరియుండవలెను-

5 రాష్ట్రములకుండని యధికారములు:—

1 సంధులు, సహాయపునొడంబడికలు, నాణెములు, బిరుదులు-

2 ఎగుమతి దిగుమతిసుంకములు-

3 భూజలసేనలు, రాష్ట్రములలో పరస్పరయొడంబడికలు, లేక సంధులు, యుద్ధప్రకటన-

4 బానిసత్వము, ప్రజాహక్కుల తీసివేయుట, జాతి, వర్ణములనుండి కలుగు భేదములు.

6 సంయుక్తరాష్ట్రముప్రజలందరిపై ప్రత్యక్షాధికారము కలిగియుండును- కేవల వ్యక్తిరాష్ట్రవ్యవహారములతో సంబంధముకలిగియుండదు- ప్రజలీప్రభుత్వద్వయములకులోనై యుండవలెను-

కాని ప్రతిరాష్ట్రమును సంయుక్తరాష్ట్రముకొఱకు పాలనప్రతినిధుల నెన్నుకొనవలయును- సేనల సప్లయిజేయవలెను- ప్రజాధిపత్యమునే నేర్పరచుకొనవలెను- పన్నులుకట్టుట యవసరములేదు- సంయుక్తచట్టములను లౌకికవ్యవహారములలో బడయనవసరములేదు- తమశాసనముల యంగీకారముకొరకు దాఖలుజేయనక్కరలేదు-

సంయుక్తప్రభుత్వమునకుండు కొన్ని లోపములు:—

(1) పరదేశవిషయముల దృఢనిశ్చయము లేకపోవుట-

(2) వ్యక్తిరాష్ట్రములపై మరియు పౌరులపై యధికారము గట్టిగనుండక పోవుట-

(3) రాష్ట్రములు తిరుగుబాటుచేయుటకును, విడిపోవుటకును వీలుండుట-

(4) రాష్ట్రములు తమతో తాము కుట్రలుజేసి కూడికజెడి చీలిపోవుట-

(5) శాసననిర్మాణప్రయోగకార్యములలో రాష్ట్రముల నైక్యతలేకపోవుట-

(6) శాసననిర్మాణప్రయోగకార్యములు ద్వివిధములుగనుండుటవలన శ్రమ, వ్యయము, ఆలస్యముసంభవించుట-

సంయుక్తరాష్ట్రముయొక్క యోగ్యతాగుణములు:—

1 వేఱుపాలనలను, శాసనాంగములను, స్థానికాభిమానములను, వీని నన్నిటిని నాశనముజేయకుండ, ఒక్క-టేజాతీయప్రభుత్వముక్రిందకు తీసికొనివచ్చి వేఱువేఱురాష్ట్రములకు నేకజాతీయతకు దెచ్చుటకు సంయుక్తరాష్ట్రము చాల బలపడును-

2 పెద్దదియు ఫలభరితమయినట్టియు దేశమునువృద్ధిజేయుటకు సంయుక్తరాష్ట్రము మంచిసాధనమగును-

3 సంయుక్తరాష్ట్రముమధ్యప్రభుత్వమును (Central Government) నిరంకుశముగాకుండ నాపును- ప్రజాహక్కులు భద్రముగానుండును-

4 (1) స్వరాజ్యము ప్రజలలో తమతమ స్థానికవ్యవహారముల యభిలాషను బలపరచును- రాజకజీవితమును వృద్ధిజేయును- లౌకికవిధికార్యములందు ప్రజలకు విద్యజెప్పును- మరియు వ్యక్తిస్వేచ్ఛయు, సంఘుసంపదయు, భద్రము

గానుండుటకు తన స్వంతకాలమునకు త్యాగము జేయుటయు, సదా జాగ్రత్తగ నుండుటయు నవసరమగును-

(2) స్థానికప్రదేశములలోనున్న ప్రజలు తమతమ వ్యవహారముల పాలన చక్కగజరుగుచున్నదో లేదో తెలిసికొనుటకు వీలుండుటవలన వాని రాజక వ్యవహారములు చక్కగ పాలింపబడును- ఒకజాతికి నిర్మాణము జేయువ్యక్తుల కు పెద్దవయినను, చిన్నవయినను, కొంతరాజకయధికారము నిచ్చినకొలదిని మధ్యప్రభుత్వమున కధికారము తగ్గుకొలదిని ప్రజలస్వేచ్ఛలును సామర్థ్యము లును బలపడును-

శాసననిర్మాణప్రయోగకార్యముల నూతనపద్ధతులప్రవేశపెట్టి వాని యుపయోగానుపయోగములను, కనిపెట్టుటకును, సంక్షోభసమయములపాలన విభజనకారణముచేత రాష్ట్రకార్యములుచెడకుండ యుండుటకును, మధ్యప్రభుత్వముయొక్క కార్యభారముతగ్గించుటకు, సంయుక్తరాష్ట్రప్రకృతియె తోడ్పడును- ఒకవైపున స్థానికస్వేచ్ఛ, స్వరాజ్యములపై ప్రేమయు, మరొకవైపున జాతిభాష విజ్ఞానము, చరిత్ర, రాష్ట్రీయధ్వజము, వీనియందలిప్రేమను సంయుక్తరాష్ట్రప్రకృతి బలపఱచును-

వ్యక్తిరాష్ట్రముల కీక్రిందనుదహరింపబడు స్వతంత్రహక్కులుగలవు:—

(1) రాష్ట్రముయొక్క రాజ్యప్రకృతి-

(2) గవర్నరు, యితరయుద్యోగులతోకూడిన ప్రయోగాంగము-

(3) శాంసనాంగము (శాఖద్వయము)

(4) కౌంటీలు, పట్టణములు, బస్తీలు, విద్యాశాఖలు వీనిలోనుండు స్థానికప్రభుత్వపద్ధతి-

(5) రాజస్వము, స్థానికకరము, (అనగా పన్ను) వీనిపద్ధతి-

(6) ఋణము

(7) స్థిరచరాస్తి, యొడంబడికలు, గృహస్థసంబంధములు, వీనివిషయిక మయినచట్టములు-

(8) న్యాయనిర్ణయచర్యావిధానము (లౌకికము, శిక్షాస్మృతి)

(9) ప్రథమన్యాయస్థానము-

(10) నగరహక్కు--



## అయిదవయధ్యాయము.

### ఆంగ్లరాజ్యప్రకృతి.

కొన్ని ప్రతిష్ఠాపనములు, వాడుకలు, యలవాటులు, మరియు కొన్ని శాసనములు నీసముదాయమంతటివలన ఆంగ్లరాజ్యప్రకృతి బుట్టుచున్నది- అమెరికారాజ్యప్రకృతి యొకటేసారిప్రజలచే నిర్మాణమునొంది కొద్దిమార్పుల కాస్పదమై, యన్నికాలములకు వర్తించుచున్నది; కాని ఆంగ్లరాజ్యప్రకృతి సర్వసాధారణముగ దేశమున పురాతనమునుండి యమలులోనున్న వాడుకలు యలవాటుల ప్రతిష్ఠాపనములపై యాధారపడి వ్రాతపూర్వకముగ స్థాపననొందక నె వర్తించుచున్నది- ఈరాజ్యప్రకృతిని నాలుగుభాగములు జేయవచ్చును మొదటిది, దేశమును పాలింపదగు పురుషులవివరము; రెండవది, యీ యుద్యోగులకుండు పరస్పరసంబంధము; మూడవది, శాసనములెట్లు నిర్మాణమునొందునో, నెట్లు నెవరివలన యమలుజెందునో దెల్పును; నాల్గవది, దుష్టప్రభుత్వమునుండి ప్రజలకుగల రక్షకావిధానము-

ఆంగ్లరాజ్యప్రకృతిని పరీక్షించవలసినపుడు గమనించవలసినసంగతులను ప్రథమమున క్లుప్తముగ జెప్పవచ్చును- రాష్ట్రములో ప్రధానరాజకయధికార

ము (Supreme political authority) రాజు లేక రాణి, పార్లిమెంటుయొక్క శాఖద్వయములకు జెందియుండును- పార్లిమెంటుశాఖలసభ్యులు ప్రత్యేకకుటుంబములలోని వంశపారంపర్యక్రమమునగాని, లేక యెన్నికపద్ధతివలనగాని భర్తీయగుదురు. పార్లిమెంటుయొక్కయు, రాజు లేక, రాణియొక్కయు సమ్మతిలేకుండ శాసననిర్మాణముజరుగదు- పార్లిమెంటుకు జవాబుదారులయిన మంత్రివర్గముద్వార, శాసనప్రయోగులగు యుద్యోగులు, సుంకరులు, పోలీసు, భూజలసేనాధికారులు, రాజుచేనియమింపబడుదురు; జ్యూరి విచారణవలన, హేబియస్ కార్పసు చట్టము లాదిగాగల నియమములచే ప్రయోగాధికారుల దౌర్జన్యములనుండి ప్రజలు కాపాడబడుదురు; రాజ్యప్రకృతిలో కొన్నిభాగములు మార్చుట కెంతమాత్రము వీలులేనట్టివిగనుండును;

ఉదాహరణము:— (1) రాజు లేక రాణి (2) ప్రాతినిధికపద్ధతి; మరియు ప్రతినిధులే రాజస్వకార్యములపై సంపూర్ణయధికారముగలిగియుండుట; (3) న్యాయాధిపతులు ప్రయోగాధికారుల (The executive) నుండి స్వతంత్రులై యుండుట; (4) రాష్ట్రాధికారులందరు దేశచట్టములకు లోనై యుండుట. మరికొన్నిభాగము లప్పుడప్పుడు విప్లవములకు జోటివ్వకయే, మారుటకు వీలుగలది; పార్లిమెంటు చర్యావిధానము; పార్లిమెంటుసభ్యుల యెన్నికయోగ్యతలు; ఎన్నికదారులయోగ్యతలు; సభ్యులహక్కులు; శాఖద్వయముల పరస్పరసంబంధములు.

ఆంగ్లరాజ్యప్రకృతి నభ్యసించుటకు నాలుగు మూలసాధనములుగలవు. (1) పాలకపాలితులు తమ పరస్పరహక్కులవిషయమై కొన్నికొన్ని విషమకాలముల నేర్పరచుకొనిన మహాసన్నదులు, లేక ప్రాశిపత్రములు; ఉదాహరణము: మాగ్నాకార్ట పెటిషను ఆఫ్ రైట్సు (హక్కులవిన్నపము, The petition of rights) హక్కులప్రకటన (The declaration of rights) (2) చట్టములు— ఉదాహరణములు; హేబియాసు కార్పసుచట్టము; బిల్లు ఆఫ్

రైట్సు, మ్యూనిసిపల్ చట్టము, స్థానికప్రభుత్వచట్టము. (3) అధికారముగల న్యాయనిర్ణయాంగముల తీర్పులు; ఉదా॥ జ్యూరరులహక్కులు; రాజు యొక్కయధికారములు; పార్లిమెంటుశాఖలహక్కులు; పోలీసుహక్కులు, విధులు. (4) పార్లిమెంటుసభలలో నిదివరకుజరిగినట్టియు, యంగీకారమునొందినట్టియు, పార్లిమెంటుచర్యలపై గొప్పవ్యాఖ్యానకర్తలువ్రాసినట్టియుయభిప్రాయసముదాయములు.

రాజ్యప్రకృతి మాంద్యము లేక, చురుకుతనముకలిగియుండునట్లుగాను, ప్రభుత్వముయొక్క మూడుయంగములకు (శాసననిర్మాణ, ప్రయోగ, నిర్ణయాంగములకు) పరస్పరాధేయతయుండునట్లు కొంతనియమముగలదు; కాని శాసనాంగము ప్రాధాన్యమువహించును. మధ్యప్రభుత్వాంగము ముఖ్యముగ రెండుభాగములుగనుండును; (1) శాసనాధికారియంగము (రాజు, ప్రభుశాఖ, ప్రజాశాఖ); (2) ప్రయోగపాలకాంగము (మంత్రివర్గము, లేక క్యాబినెటు; న్యాయాధిపతులు, భూజల సేనానాయకులు, పోలీసునాయకులు, విద్య,వర్తకము, ప్రజాదేహారోగ్యము, స్థానికపాలన); వీరు రాజునకు సలహా, సహాయకారులగుదురు. స్థానికాధికారులు వేరువేరునుందురు. (1) పారిషు లేక జిల్లా, కౌంటీ, పట్టణములలో పనిజేయుయుద్యోగశాఖలు. వీరు స్థానికప్రజలచే నెన్నుకొనబడుదురు. స్థానికప్రభుత్వములు వ్యవహరించుటకధికారముగల విషయములు. (1) బీదలకుసహాయము (2) బీదలకు విద్య (3) చెరసాలలు, పిచ్చివాండ్రకొరకు శాలలు; (4) స్థానికపారిశుద్ధ్యకార్యములు (5) స్థానికప్రదేశములరోడ్లు, దీపములు, మరియు నభివృద్ధికార్యములు (6) చిన్నయుద్యోగములవిషయమయిన చట్టముల ప్రయోగము, మధ్యప్రభుత్వము (Central Government) ప్రజానురాగమునొందవలయుననిన యీక్రిందకార్యముల కవకాశమివ్వవలయును. (1) ప్రజాశాఖసభ్యుల నెన్నుకొను విధానమువలన; (2) ప్రజలు రాజునకు విన్నపములుజేసికొనుటకును, మంత్రులకు తమ కష్టసుఖములను దెలియపరచుటకును, వీలుండుటవలన (3) జ్యూరీవిచారణవలన.

## రాజు.

రాజు క్రైస్తవులలో ప్రొటెస్టెంటు (Protestant) శాఖకు జెంది యుండవలెను. ఆంగ్లేయచర్చిలో సభ్యుడుకావలెను. రాణిగాని రాజుగాని యుండవచ్చును. రాజుయొక్క పెద్దకొడుకే సదా సింహాసనాహాతను నొందును; అనగా జేష్ఠపుత్రులే యధికారపదవికి దగుదురు. రాజుమయినరగుచో గార్డియనును పార్లిమెంటునియోగించును. రాజునకు షుమారు 3½లక్షల నవరసులు (అనగా 52 లక్షల రూపాయలు) సంవత్సరమునకు స్వంత (గృహ) ఖర్చునకుగాను పార్లిమెంటిచ్చును. ఈధనము రాజుయొక్క నౌకరులు, వారి పించెనలు, దివాన్ఖానాఖర్చులన్నిటికి సరిపోవును. రాజుయొక్క స్వకీయఖర్చులకుమాత్రము 60 వేల నవరసులు (రూ 9 లక్షలు) యివ్వబడును. దీనిని సివిలులిస్టు అందురు. క్యాబినెటు (మంత్రివర్గము) సలహాపైరాజు పార్లిమెంటు (అనగా శాసనాంగము); ప్రయోగాంగపువ్యవహారముల జక్కబెట్టుచుండవలెను.

### రాజునకు పార్లమెంటుతో గల సంబంధము.

(ఎ) నిషేధకకార్యములు:—చట్టములను, పన్నులను వేనిని పార్లిమెంటుసమ్మతిలేక తనంతటతాను నియమింపలేడు; మార్చలేడు; రద్దుపరుపలేడు. కాని నేరస్థులను క్షమించవచ్చును. ఈక్షమాపణకార్యము మంత్రులసలహాపైనుండవలెను; వారే జబాబుదారులగుదురు.

(బి) విధాయకకార్యములు (విధిరూపములు):— పార్లిమెంటును బిల్చుట, మూయుటకు రాజునకే హక్కుగలదు. ఏపార్లిమెంటు నేడుసంవత్సరములకు మించియుండకూడదు. ఇష్టమున్నప్పుడెల్ల రాజు పార్లిమెంటును మూయవచ్చును. క్రొత్తప్రజాసంఘము నెన్నుకొనబడునట్లు విధింపవచ్చును.

పార్లిమెంటు ఫిబ్రవరినుండి ఆగష్టుఅంతమువరకు కూడియుండును. ప్రతి పార్లిమెంటుయొక్క సాంవత్సరిక ప్రథమసమయమున మంత్రివర్గములచే

ఆశ్రేపణ (Session) లో చేయబడుశాసనముల స్వభావమును జూపునట్టి యు పరదేశప్రవ్యవహారములను దెలుపునట్టియు వ్యాసమొకటి రాజుచే జదువ బడును. ఆవ్యాసము మంత్రివర్గముచే తయారుచేయబడును. గాన సభ్యులు దాని యోగ్యతాయోగ్యతలపై కొంతతర్కింతురు. రాజు పార్లిమెంటుశాఖ లతో అనేకవిధముల ప్రసంగింపవచ్చును. వ్రాతపూర్వకముగను నోటిమాట ద్వార కబురుచేయవచ్చును.

## రాజునకు ప్రయోగాంగముతో గల సంబంధము.

(1) న్యాయాధిపతుల నందరిని రాజే నియమింపవచ్చును. రాజుపేర టి నేరస్థులందరు ప్రాశిక్యూషణ చేయబడి విచారణనొందవలెను. నేరస్థులను రాజు క్షమింపవచ్చునుగాని యిది సకృతుగా జరుగును. విచారణ అన్యాయ ముగాజరిగినట్లు కనపడినను తప్పుడుసాక్ష్యముమీద నేరస్థాపనగలిగినను జూ రర్లు క్షమింపమని సలహాయిచ్చినను, రాజకీయనేరములలోను రాజు క్షమింప వచ్చును. అనగా ప్రజాశాఖను బలవంతపెట్టుటకుగాను ప్రజాకల్లోలములు జరి గినయెడల రాజు క్షమింపవచ్చును

(2) ప్రభుబిరుదులన్నియు రాజేయివ్వవలయును. వర్తకసంఘములు, మక్తాలు, నాణెముల ముద్రణ మొదలగువిషయముల రాజునకె హక్కుగలదు.

(3) విదేశములకు రాయభారములనంపుటయు వానితోడి రాజకవ్యవ హారముల సలుపుటయు సంధులు యుద్ధముల ప్రకటించుటయు రాజుపనియై యున్నది. కాని ఆకార్యములు మంత్రివర్గముసలహాపై జరుగునుగాన వారు పార్లిమెంటుకు దెలియపరచవలసియుండును. ఇండియాలోను, ఐర్లండులోను రాజప్రతినిధుల నియమించును

## ప్రభుశాఖ.

దీనిలో ప్రస్తుతము 502 మంది సభ్యులున్నారు. వారి కితాబులపట్టి

యీక్రింద జెప్పబడును:— రాజకుమారులు 6; ఆర్చిబిషప్పులు2; డ్యూక్లు21; మార్క్వెసులు 19; ఎర్లులు 117; వైకౌంట్లు 26; బిషప్పులు 24; బేరనులు 257; స్కాట్లండుచే ప్రతిపార్లిమెంటు ప్రారంభకాలమున ప్రతినిధులుగ నెన్నుకొనబడువారు 16; జీవితకాలమువరకు నెన్నుకొనబడు అయిర్లండు ప్రాతినిధికప్రభువులు 28; మర్యాదవిషయములదప్ప యీబిరుదులవలన నింకొక ప్రయోజనములేదు. రాజు క్రొత్తప్రభువులనుజేయవచ్చును ఈప్రభువుల జ్యేష్ఠపుత్రులు యీకితాబుల వంశపరంపరం గలిగియుందురు. మంత్రివర్గముచేప్రావేశ్యమునొందిన శాసనబిల్లులను (సూచనలు) నంగీకరించుటదప్ప వీరికింకొకపని లేదు. కాని ప్రజాశాఖలో విశేషాంశపు సభ్యుల యంగీకారమునొందిన బిల్లును వీరుసమ్మతింపక విడువరు; కాని యొకప్పుడు తమనిరాకరణదెల్పునట్లు యంగీకరింపక బోవుటయుగలదు. ప్రభుసంఘము యుద్యోగయుల్లంఘన నేరములనొకానొకప్పుడు, పెద్దవిషయములు విచారణజేయుటకు హక్కుగలిగి యుందురు.

చాలామందిప్రభువులు తమజన్మహక్కువలన సభ్యత నొందుదురుగాన బుద్ధికుశలత, జ్ఞానము, దేశాభిమానము, యోగ్యత మొదలగు గుణములు కలిగియుండినవారు గాకపోవచ్చును. కేవల దుష్టశిష్టాచారపరాయణులు గావచ్చును. ప్రజాభిప్రాయమునకు నిర్లక్ష్యభావము జూపవచ్చును.

## ప్రజాశాఖ.

దీనిలో 670 మంది సభ్యులున్నారు. వీరిలో ఇంగ్లీషు, వెల్షు, స్కాచి అయిరిషుప్రజలయొక్క నానాతరగతులచే నెన్నుకొనబడినసభ్యులేయుందురు. వలసరాజ్యములును, ఆధేయరాజ్యములతరఫునను సభ్యులుండరు. ఎన్నికకూటములు మూడువిధములు:— (1) కౌంటీలు (గ్రామజిల్లాలు); (2) పట్టణములు (3) సర్వకళాశాలలు. ఈమూడుకూటములును ఇంగ్లండు, స్కాట్లండు, అయిర్లండులలో నుండును. కొన్నికూటము లెక్కువమందిప్రతినిధుల బంపును;

కొన్ని తక్కువబంపును. గ్రామప్రతినిధులు సాధారణముగ శిష్టాచారులగుదురు; పట్టణవాసులు స్వేచ్ఛాపరులుగనుందురు. ఈభేదమునకుకారణము వారి వారివృత్తి, విద్య, సంఘజీవితభేదములవలన గలుగుచున్నదని జెప్పవచ్చును.

## ఎన్నికదారుల యోగ్యతలు.

ఎన్నికదారులు పురుషులు; 21 సం॥లు దాటినవారు; కొంత భూమి లేక గృహముకలిగియుండినవారు; వోటరుగా రిజిష్టరుగాకపూర్వ మాయెన్నిక ప్రదేశమున 12 నెలలు నివసించినవారై యుండవలెను.

### (ఎ) పట్టణపు యెన్నికదారులు.

(1) స్వతంత్రజీవులు మొదలగువారు.

(2) పట్టణములోని యొకయింటిలో కనీసము 12 నెలలకు తక్కువగ కాపురముజేయకూడదు.

(3) ఈగృహము సంవత్సరమునకు 10 పౌనుల అద్దెదెచ్చునదిగ యుండవలెను.

### (బి) గ్రామకూటములలోని యెన్నికదారులు.

(1) సంవత్సరమునకు 30 రూపాయిలు భూఆదాయముగల ప్రతిమనుజుడు ఈభూమి స్వార్జితపిత్రార్జితము, వివాహము, యీవి, వారసత్వము మొదలగువానిచే కలుగవలెను.

(2) పైసరతులు లేక సంవత్సరమునకు 75 రూపాయిలదెచ్చు భూమి గల ప్రతిమనుజుడును;

(3) సం॥నకు 750 రూపాయల ఆదాయమునిచ్చుభూమిని 20 సం॥లకు మక్తాబుచ్చుకొనిన రయితును,

(4) కనీసము సం॥నకు 75 రూ॥ ఆదాయిచ్చుభూమి 60 సం॥లకు మక్తా బుచ్చుకొని స్వాధీనము జేసికొనినవాడును,

(5) సం॥నకు 180 రూ॥ అద్దెదెచ్చు యిండ్లు, భూముల నాక్రమించుకొనినవాడును, పార్లిమెంటుసభ్యులనెన్నుకొనుటకు హక్కు-కలిగియున్నారు

జనవరి 5 తారీఖువరకు బాకీయగు బీదపన్నుల ఆ సంవత్సరంలో 20 జూలయికి యెన్నికదారుడు యిచ్చియుండవలెను. వోటరులజాబితాలో యెన్నికదారుని పేరెక్కవలయు. ఈజాబితాలు బీదచట్టపుయుద్యోగులవలన వేసవికాలమున తయారుచేయబడి ఆకురాలుకాలమున ప్రత్యేకపు న్యాయస్థానములచే ఖాయపరుపబడును- అప్పుడు యెన్నికదారులు తమలోపముల వేనినయినను దెలియపరుచుకొనవలయును-

(సి) సర్వకళాశాల యెన్నికదారులు.

డిగ్రీపరీక్షయందు కడతేరవలయును.

## ఎన్నికకార్యవిధానము.

(ఎ) ప్రతివోటుయొక్క-విలువ:—

ప్రతివోటరు తమకూటమున కెంతమందిప్రతినిధులుందురో అన్నివోట్లు గలిగియుండును; కాని యొక్క-వోటుకంటె నెక్కు-వయుపయోగించ నక్క-రలేదు; మరియు నొకనికొకవోటుకంటె నెక్కు-డువోట్లివ్వకూడదు-

(బి) ఎన్నికదారులు తమవోట్లను బాలటుపద్ధతి (అనగా తమప్రతినిధిపేరు నొక కాగితముపైవ్రాసి, రహస్యముగ యెన్నికస్థానమునబెట్టుట) యివ్వవలయును- ప్రతి జెనరల్ యెలెక్షను, లేక ప్రజాశాఖలో సభ్యులెవరయిన ఖాళీయైనయెడల రిటర్నింగుయుద్యోగికి తాఖీదుబంపబడును-

తాఖీదు అందినతరువాత ఆరిటర్నింగుయుద్యోగి ప్రజల కాఖాఖీని దెలియపరచి, అర్థులను నియోగమునకు బిలువవలయును- ఎన్నికార్థులు తమ రాజక సిద్ధాంతములను, రాజకపక్షమును, యభిప్రాయములను ప్రజలకు దెలియజేయవలెను- ఎన్నికదారులను తమకు వోట్లివ్వమని వేడుదురు- నియామకదినమున తొమ్మిదిమందియెన్నికదారులుకలిసి యొక్కొఅర్థిని (candidate) కాగితముపై పేరువ్రాసి రిటర్నింగుయుద్యోగికిబంపవలెను- ఆ యెన్నికకూటమునకు కావలసిన యర్థులకంటె నెక్కువనియామకము జెందినచో, ఆయుద్యోగి యొక తారీఖునియమించి, అప్పుడు యెన్నికనుసల్పును-

బాలటుపద్ధతి.

ఎవరును తన స్వయిచ్ఛకు ప్రతికూలముగా తానెవరికి వోటుయిచ్చెనో బహిరంగముచేయుటకు బలవంత పెట్టదగదు, అను మూలాభిప్రాయముపై బాలటుపద్ధతి యాధారపడియున్నది- తనయెన్నికహక్కును యుద్యోగులకు రుజువుజేసినతరువాత, ప్రతియెన్నికదారుడును ఒకచీటిసివ్వబడును. ఆచీటిపైన యెన్నికకొరకు యర్థులయినవారిపేర్లుమాత్ర ముండును- యెన్నికదారుడొక రహస్యప్రదేశమునకుబోయి తనకిష్టులుగానివారినామముల గొట్టివేసి, ఒకపెట్టెలో రంధ్రముద్వార యొకయుద్యోగునియెదుట వేయును- చివరకు యీచీట్లన్నియు లెక్కబెట్టబడి, విశేషాంశము వోట్లుగలయర్థి యెన్నుకొనబడును- ఒకకూటమునకు బాలటు దాని వేరువేరుయెన్నికస్థానముల నొకదినముననే జరుగును-

సర్వకళాశాలలవోటర్లుమాత్రము బాలటుపద్ధతిగాక యొకమేజస్ట్రేటుయొద్ద ప్రమాణమునొంది, రిటర్నింగుయుద్యోగికి తమవోట్లను యుత్తరముద్వార బంపవచ్చును-

పార్లిమెంటుసభ్యుల యోగ్యతలు

ఇంగ్లండుదేశస్థులును, 21 సంII లకు మించనివారున్నూ, ఆస్తియున్నను, లేకపోయినను సభ్యులగుట కర్హతగలదు-

యీ క్రిందివారు మాత్రము ప్రజాశాఖసభ్యులుగ నుండరాదు-

(1) ఇంగ్లీషు, స్కాచి ప్రభువులును, మరియు అయిరిషుప్రభువులును, ఐర్లండులోని యెన్నికకూటమున కర్తలు కాగూడదు- (2) ప్రధాన న్యాయస్థానాధికారులు- (3) జీతముగలిగిన, ప్రయోగాంగపుయుద్యోగముల స్వీకరించినవారు- (4) ఇంగ్లీషుచర్చిలోని మతాచార్యులు- (5) సర్కారు కంట్రాక్టరులు- (6) దివాలకోరులు- (7) పెద్దనేరములకు శిక్షజెందినవారు-

## ప్రజాశాఖలోనిసభ్యులు గమనింపవలసిన నియమములు.

నాలుగువిధములు:— (1) సభ్యులహక్కులు (2) సభ్యులపై శాఖకుగల యధికారములు; (3) ప్రజాశాఖపని (4) శాసననిర్మాణము-

### సభ్యులహక్కులు.

సభలో నేసభ్యుడయిన జేయుప్రసంగములవలని న్యాయస్థానముల నేరము మోపబడకూడదు; ప్రజాశాఖలో సభ్యులుగాని యితరులెవరికెంత కఠినముగనున్న సరే, నేరస్థుడుగాడు- కాని దుర్భాషకు ప్రజాశాఖయే తనలోని సభ్యులశిక్షించి సభ్యత తొలగింపవచ్చును- నిర్బంధన, చెఱయందుంచబడుట మొదలగునవి పార్లిమెంటుసభ్యులవిషయమై స్వనేరములదప్ప యింకొకకారణముల కూడదు-

### ప్రజాశాఖకుగల యధికారములు.

(1) తననియమముల కవిధేయతజూపినగాని పార్లిమెంటుసభ్యుల యెదుటబెట్టుటకుపూర్వము కమిటిలోనివ్వబడిన సాక్ష్యమును వెల్లడిజేసినగాని, విన్నపముల ఫోర్జరీదస్కతులుజేయుచుండగా జూచి ఫూరకున్నగాని, లేక పార్లిమెంటుకోరినప్పుడు తగురికార్డులతో హాజరుగాకపోయినప్పుడు ప్రజాశాఖ ఆమనుజుని తనలోని సభ్యుడయినను, జెఱకుబంపవచ్చును-

(2) మరియు ప్రజాశాఖ కపకీర్తిదెచ్చునట్టి వ్రాతలకుగాను, ఆవ్రాత గాండ్లను ప్రాశిక్యూషనుజేయవచ్చును- (3) సభ్యులు సభ్యతాయుద్యోగము నందుండగ వారి నిర్బంధనబెట్టినగాని, లంచములిచ్చినగాని, శాఖోద్యోగుల విధికృత్యముల నిర్బంధనజేసినగాని ఖయిదులో బెట్టవచ్చును- సర్జెంటు అట్ ఆరంసు అను యుద్యోగిని నియమించి వానిద్వార పనిజేయించవచ్చును- ఆయనకు జీతము 1,200 నవరసులు- ఫోర్జరీ, మోసము, లంచము, గొండితనము, దూషణభావముగల సభ్యుల పార్లిమెంటు వెడలగొట్టవచ్చును-

ప్రజాశాఖలోని యుద్యోగులు.

(1) అధ్యక్షుడు (స్పీకరు) ఈయనసంఘములో సభ్యులలో నొకడయి యుండును- రాజు ఆయనను ఖాయపరచును- శాఖానియమముల సభ్యులు మన్నించునటులనున్నూ, శాఖానియమము లేవియున్నవో. యేవిలేవో, అధ్యక్షుడు నిర్ణయించును- ఇద్దరుముగ్గురుసభ్యు లొకసమయమున మాటలాడుటకు లేచునపుడు, అధ్యక్షుడు వారు మాటలాడుక్రమమున నిర్ణయించును- మరియు నొకవిషయమున సమానవోట్లుకలుగునపుడు తనయభిప్రాయమును దెల్పి తాను వోటిచ్చి నిర్ధారణజేయును- ఈయన నిష్పక్షపాతియై, యుభయపార్టీలకు న్యాయము సభాప్రసంగములకు గౌరవము, నీతి, ఔదార్యము దీసికొనిరావలయును- అధ్యక్షపదవి నొందునంతకాలము పక్షములవేనియందును జోక్యము దీసికొనకూడదు- ఆయనజీతము సాలుకు 5000 నవరసులు-

(2) డిప్యూటిస్పీకరు, మరియు కమిటీలచేర్మను- జీతము 1500 నవరసులు.

(3) ముగ్గురుగుమాస్తాలు-

పార్లిమెంటు చర్యావిధానము.

సభ్యులలో నొకరులేచి యొకయంశమునుజెప్పి దాని సభ జర్చించునా లేదాయని ప్రశ్నించును; యీప్రశ్న నే మోషను (Motion) అందురు- స్పీ

కరు (అధ్యక్షుడు) సభ్యులసమ్మతిని దెలియగోర, కొందరు సరే (yes) అని, కొందరు 'వలదు' (nay) అనిన్ని జెప్పుదురు-అధ్యక్షు డెవరిసంఖ్యహెచ్చుగనున్నదో ధ్వనివలనగ్రహించిజెప్పును- విశేషాంశము 'సరే' అనుచో నాయంశము ప్రసంగమునకొచ్చును; లేనియెడలరాదు- కాని యీతీర్పు నేసభ్యుడయినను ముమ్మారుయెదిరించుచోనప్పుడుదానిపై సభ్యులవిభజన (Division) జేయవలయును; అనగా వారివోట్లు యధాప్రకారము లెక్కబెట్టవలయును- ప్రతిమోషనుసభయొక్క నామోదము పొందినచో సభయొక్క తీర్మానము లేక ఆజ్ఞగనుండును- తీర్మానమును నప్పుడావిషయముపై ప్రజాశాఖయొక్క యభిప్రాయము దెల్పదగును; ఆజ్ఞయగుచో సభ్యులపైగాని, ప్రయోగాంగముపైగాని, శాసనాకారమునుబొందును-

ఆజ్ఞగ్రంధములో మోషను ప్రావేశముజేయ ప్రతివాడు యిట్లు వ్రాయవలయు- సభకు నొకరోజు వ్యవధియివ్వవలయును

జూలై 16-

ఏగారు- ప్రస్తుతపు రాజస్వవిషయముల యమలులోనున్న నియమముల లాభాలాభములను విమర్శనజేయుటకున్నూ, ఆనియమముల నెట్టిమార్పులవసరమో సభవారికి దెలియపరచుటకును యొక ప్రత్యేకపుకమిటీ నియోగింపబడవలయునని-

బిగారు- ఇండియా సంస్కారనియమములవిషయకములయిన కాగితములన్నియు సభయొక్క టేబిల్ బల్లపయిన దాఖలుచేయబడవలెనని-

మంత్రివర్గముయొక్క మోషనుల సభ్యులు జర్చించుటకు కొన్నిరోజులున్నూ, మంత్రులుగాని వ్యక్తిసభ్యులచేవ్రాయబడు మోషనుల విచారించుటకు వేరొకరోజున్నూ మోషనులదెల్పురోజొకటియు ప్రత్యేకముగ నుండును-

మోషనుజేయుటకు నోటీసు.

సభ్యుడు తనపేరొక కాగితముపైవ్రాసి బల్లపైబెట్టును- కొంతకాలమునకు పార్లిమెంటుగుమాస్తా ఆచీట్లనుదీసి సంఖ్యలువేసి ఆసంఖ్యల యొక్క గ్లా

సులో బెట్టును; అప్పుడు ఒకటితరువాత నొకదానిని బయటకెదీసి ఆసంఖ్య
గల సభ్యుని స్పీకరు బిలుచును- సభ్యుడులేచి తనప్రశ్నను జదువును- తరువా
త బల్లదగ్గరకుదీసికొనిపోయి గుమాస్తాకిచ్చును. నియమించినరోజున ఆసభ్యు
డులేచి తనప్రశ్న జదువును- సభ దానిచర్చకంగీకరించినచో, అది తీర్మానము
గాని, ఆజ్ఞగానియగును- ఆవిషయము ఒకబిల్లును సభ్యులయెదుట జదువుట
గాని, స్పెషలుకమిటీని నియోగించుటగాని, కాగితములనడుగుటగాని, లెక్క-
లు (statistics) ఆకౌంటులు, పత్రములు, లేక కొన్ని వివాదాంశముల పరిశీ
లించుటకు స్పెషలుకమిటీ నేర్పరుపమనిగాని కోరవచ్చును- లేక పాలనవిష
యముల సభ్యులు మంత్రివర్గమును ప్రశ్నింపవచ్చును- ప్రభుత్వపుయుద్దేశ్య
ముల తెలియగోరవచ్చును; ఫలానావిధము జేయుడని జెప్పవచ్చును-

## ఒకబిల్లు యంగీకారము నొందుట.

సభ్యులెదుట బెట్టవలయుననుకొనిన విషయమున బిల్లురూపమున సభ్యు
డు వ్రాయించవలయును- దాని నంగీకరించునట్లు కనీస మిద్దరుసభ్యుల దస్క-
తయిన నుండవలెను- ఈబిల్లు తీసికొనివచ్చుటకు సభయంగీకారము నొందవ
లయును- తరువాత ఆబిల్లు గుమాస్తాయందుకొని సభలో ప్రథమసారి జదువు
ను- ప్రథమసారిచదువున జర్చయుండదు- (1) మతము (2) వర్తకము (3)
రాజస్వము (4) సివిల్లిస్టువిషయముల బిల్లులు, సభయంతయు కమిటీగగూర్చొ
ని, యంగీకరించినగాని తీర్మానమునకు దీసికొనిరాబడకూడదు-

ప్రథమసమర్పణ (చదువు) అయినతరువాత రెండవసారి సభ్యులయెదు
ట సమర్పించబడుటకు వారియనుజ్ఞ బొందవలయును- దానికిపూర్వము, ఆబిల్లు
నకు జవాబుదారియగువాడు లేచి దానివిషయమై సిద్ధాంతపూర్వపక్షములతో
నుపన్యసించును- తరువాత సభ్యులందరు దాని తర్కింతురు-

ఈప్రసంగకాలమునకు నియమము లేదు- తరువాత సూచనకారుడు తిరి
గి జవాబు చెప్పును- రెండవసారిచదువబడిన తరువాత, ఆబిల్లు కమిటీమెట్టున
కుబోవును- అనగా స్పీకరు సభను విడచును; ఆయనకుబదిలీ యింకొకసభ్యు

డు కుర్చీనాక్రమించును; అప్పుడు ఆబిల్లువిషయమై సభ్యులు స్వేచ్ఛగతర్కించి సవరణలజూపి, అవి విశేషాంశములచే నంగీకరింపబడినయెడల అసలుబిల్లులో జేర్పబడును- కమిటీలో కడతేరినతరువాత బిల్లు సభ యథావిధిగ దెలుపబడి, మూడవసారి యంగీకారమునకు తారీఖునియమించబడును- అప్పుడు ఈబిల్లు సమ్మతినొందుగాక' యని మోషనుచేయబడును- దీనికి సభ్యులంగీకరించినచో అది ప్రజాశాఖసమ్మతినొంది, ప్రభుశాఖ యంగీకారముకొరకు బంపబడును- వారు యిదేవిధముగవర్తించి తమ యంగీకారమునయినను అసమ్మతినయినను దెల్పుదురు- సమ్మతించినచో రాజుకూడ సమ్మతించును- అప్పుడాబిల్లుచట్టమగును- ప్రభుశాఖసమ్మతించక సవరణలజేసి ప్రజాశాఖకు తిరిగి బంపుచో, ప్రజాశాఖ ఆసవరణవిచారించి యంగీకరించుచో యది శాసనమగును; లేని యాసవరణలకు తమయాక్షేపణలుజూపుచు, తిరిగి ప్రభుశాఖకు బంపవలయును- ప్రభుశాఖ తమసవరణలదీసివేయక తిరిగిబంపుచో, ఆబిల్లు శాసనము కానేరదు- ఒకప్పుడురెండుశాఖలకుఆబిల్లుపై సంవిదను (conference) జరిగిన పరస్పరయభిప్రాయభేదముల సమాధానపరచుకొనుట తటస్థింపవచ్చును; కాని యిది కడుసకృతు-

ఒకబిల్లుయొక్క యదృష్టము ప్రజాశాఖలో నారుసారులు నిర్ధారణ చేయబడును-

(1) బిల్లు సభలోప్రవేశపెట్టుటకు యనుజ్ఞకొరకు మోషను- ప్రవేశమునకనుజ్ఞబడయుట-

(2) ప్రథమసమర్పణకొరకు మోషను- అనుజ్ఞ-

(3) ద్వితీయసమర్పణకొరకు మోషను- డిటో

(4) కమిటీకిబంపుటకుగాను విన్నపము-డిటో

(5) కమిటీవలన పరిశీలన- కమిటీరిపోర్టు-

(6) తృతీయసమర్పణకొరకు మోషను- అంగీకారము- ప్రభుశాఖకుబంపుట-

ఏసభకాలముననూ 40 మందిసభ్యులకంటె తక్కువయుండకూడదు- ఒకప్పుడు 500 మంది సభ్యులు హాజరగుదురు-

బిల్లుయొక్క రూపము.

ఇది యొనిమిదిభాగములుగనుండునని జెప్పవచ్చును- (1) అనుక్రమణిక దీనిలో చట్టముయొక్క కారణము క్లుప్తముగ నుదహరింపబడును- 'ఇటులున్నదిగాన' అని ప్రారంభించును-

(2) శాసనికవాక్యము- రాణి, ప్రభువులు, ప్రజలచే నీసమావేశమునొందిన పార్లిమెంటున శాసనమునొందుగాక' అనిజెప్పును-

(3) చట్టముయొక్కనామము; ఉ॥ 'ఇండియను రిఫారంసుఆక్టు 1909'

(4) చట్టము అమలుకువచ్చుకాలము చోటులు-

(5) చట్టములోనుపయోగింపబడు ప్రధానపదముల యర్ధమును దెల్పు లక్షణవాక్యములు-

(6) చట్టముయొక్క మూలాంశము; ఇదిసూత్రములుగ విభజనజెందును

(7) ఈచట్టము పూర్వమములులోనున్న చట్టముల రద్దుజెప్పువాక్యము-

(8) షెడ్యూలు- చట్టములోనుదహరించు జాబితాలు, అపెండిక్సులు స్థలములపేర్లు మొదలగువాని వివరము-

క్యాబినెటు (అంతరంగసభ)

దీనిలోని సభ్యులసంఖ్యకు స్పష్టమగు పరిమితిలేదు- కాని ప్రధానముగనుండవలసినవారు కొందరుగలరు; మరికొందరు తరుచుగనుందురు-



(1) కోశాగారపు ప్రధమప్రభువు (The first Lord of Treasary) ఈయన సాధారణముగ ప్రధానమంత్రియైయుండును-

(2) చాన్సెలరుప్రభువు (The Lord Chancellor) న్యాయనిర్ణయాంగముపై ప్రధాన యధికారి- న్యాయాధిపతులందరను నియమించును- న్యాయచట్టములలో మార్పులకుగాని తన సహోద్యోగియుల సలహామీద ప్రభుసంఘమున సూచింపును-

(3) సభకు యధ్యక్షు ప్రభువు (The Lord President of the council) ఇది గౌరవార్ధపుయుద్యోగము- అయినను యీతనిక్రింద మూడు రాజ్యాంగములుండును. (1)ప్రివికవున్సిలు (2)విద్యాకమిటి (3) వర్తకబోర్డు.

(4) లార్డు ప్రివీ సీలు (The Lord Privy Seal) ఇది కేవలము గౌరవార్ధపు యుద్యోగము.

(5) ఎక్సచేకరుచాన్సలరు(The Chancellor of the Ex-chequer) రాబస్వపుయధికారి బడిజెటును సమర్పించును.

(6) దేశీయవ్యవహారపుకార్యదర్శి (The Secretary of State for Home Department) పోలీసు, ఖయిదీలు, సైనెటుయుద్యోగము (గ్రాంట్లు ఉద్యోగములనిచ్చుపని) ప్రజారోగ్యము, క్షేమము, నేరములు మొదలగువానిపై పనులు

(7) పరదేశపువ్యవహారముల కార్యదర్శి (The Secretary of State for Foreign affairs) రాయభారములు మొదలగునవి యీయనద్వార జరుగును. పార్లిమెంటు కావిషయముల దెల్పవలయును.

(8) కాలనీలకార్యదర్శి(The Secretary of State for Colonies) కాలనీలకుసంబంధించిన పనులు చేయును.

(9) ఇండియాకార్యదర్శి (The Secretary of State for India)

(10) యుద్ధపు కార్యదర్శి (Secretary of State for War)

(11) పనులవిషయమయిన ప్రధాన కమీషనరు (The chief Commissioner of Works) రాజసౌధములు, మ్యూజియములు, పార్కులు, క్రొత్తరోడ్లు, వీధులు మొదలగు కట్టడములపైపని.

(12) లాంకాస్టరు డచ్చియొక్క చాన్సలరు (The chacellor of the Duchey of Lancaster)

(13) ప్రధాన నావికసేనాధిపతి ప్రభువు (The first Lord of the Admiralty)

(14) వర్తకబోర్డుయొక్క అధ్యక్షుడు (The President of the Board of Trade) ఈయనక్రింద యిద్దరు ఉపకార్యదర్శులుందురు. వర్తకవిషయముల జవాబుదారియై యున్నాడు. వర్తకపుసంఘులు, దేశీయావర్తక పన్నులు (సుంకములు), సారా, బెల్లము, బీరు, తేయాకు, పొగాకు లపై పన్నులు; రెయిల్వేలు, కాలువలు, రేవులు, వర్తకముయొక్కయు, చేతి పనులు, పంటలు వీనియొక్క లెక్కలు; రెయిల్వేలువేయుట, నావలలోనుండు యుద్యోగులు- యీవిషయముల పార్లిమెంటుకు జవాబుదారి.

(15) స్థానికప్రభుత్వపు బోర్డుయధ్యక్షుడు (President of the Local Government Board) స్థానికప్రదేశము బీదలు, పారిశుద్ధపువిషయములపై యధికారి.

(16) పోస్టుమాస్టర్ జనరల్ (Post Master-General). టపాలు, టెలిగ్రాములు, మనిఆర్డర్లు, సేవింగ్సుబ్యాంకీలు- వీనిపైయధికారి.

(17) ఐర్లండునకు ప్రధానకార్యదర్శి (Chief Secretary for Ireland)

(18) ప్రీవికవున్సిలుయొక్కద్వితీయధ్యక్షుడు (The Vice President of the privy Council)

## కొన్ని ప్రత్యేకపు సర్కారు యుద్యోగములు.

(1) కోశాగారము (Treasury) ఈయుద్యోగమిప్పుడు ప్రధానమంత్రికివచ్చును. ప్రధానమంత్రియనునతడు యితరమంత్రులనియమించి కాబినేటును నిరూపించును. సర్కారులో నవుకరిజేయు యుద్యోగులనందరను ప్రధానమంత్రియే కొన్ని నియమముల ననుసరించి నియోగించును. కాబినేటుకార్యముల కన్నిటి కాయనయే జవాబుదారగును. మంత్రివర్గములో నభిప్రాయభేదములు బుట్టినప్పుడును, ప్రధానమంత్రి యితరమంత్రులతో నేకీభవించనపుడును ఉభయులు మంత్రిత్వమునకు రాజీనామాయివ్వవలయును; లేక ఆ యితరమంత్రులు కాబినేటునుండి తమంతటతాము తొలగవలయును.

కోశాగారము ప్రధానమంత్రిగాక నలుగురుయుద్యోగులచే నడుపబడుచున్నది. వారు (1) ఎక్స్చెకరుకు చాన్సెలరు (2) ఇద్దరు జీతమొందు కమీషనరుప్రభువులు; ఒకడు జీతమునొందని కమిషనరుప్రభువు. ఈరాజ్యాంగము యొక్కపని ప్రజాధనము నందుకొనుటయు, యిచ్చుటయునై యున్నది. రాజస్వము, భూజలసేనాఖర్చులు, సివిలుసర్వీస్ (సర్కారుయుద్యోగములు), వీనికివలయు సప్లయిలను కోశాగారమే భద్రముజేయవలయును. న్యాయవిచారణ కగు ఖర్చులు కోశాంగపు యుద్యోగులచే తనిఖీయగును. మహసూల్ (Customs) బోర్డు, దేశపుశిస్తు, టపాలకచ్చేరి వీనివలనయగు రాజస్వ కార్యములన్నియు కోశాంగమువారు క్రమబరతురు.

(2) సివిలుసర్వీసుకమిషను. దీనిలో యిద్దరు కమిషనర్లుందురు. వీరు సర్కారుయుద్యోగములకు నర్హులగువారిని పరీక్షించి ప్రవేశముజేసికొందురు కొన్నియుద్యోగములు పోటీపరిక్షపైయుండును; కొన్ని కేవల నియోగము (nomination) వలన నివ్వబడును.

(3) దానపు కమీషను (The Charity Commission). దీనిలో నలుగురుకమీషనర్లుందురు. కాని వారిలో ముగ్గురకే జీతముగలదు. వీరు బీద

లకు సహాయముజేయునిమిత్త మేర్పరుపబడిన ప్రతిష్ఠాపనములపై పనిజేయు చుందురు. బీదగృహములు (Poor Houses) ఆసుపత్రులు, పాఠశాలలు, యివి వీరి యధికారములో నుండును.

(4) పిచ్చివారలకు కమీషను (The Lunacy Commission) వీరు ఆర్గురుగలరు. జీతమొందుదురు. పిచ్చివారలకుగాను నేర్పడిన గృహశాలను, వారిపోషణ మొదలగుపనుల జాగ్రత్తపెట్టుచుందురు.

(5) నాణెముద్రణాంగము. ఇది ఎక్సెకరు చాన్సలరుక్రింద నుండును

(6) రాజ్య ఋణాంగము (The National Debt Office)

ఈరాజ్యాంగము రాజ్యఋణమును తీర్చుటకును, దానిపై వడ్డినిచ్చుటకును పనిజేయవలయును. ఒకరాష్ట్రమితరరాష్ట్రములతో యుద్ధముజేయవలసినప్పుడు కావలయుధనమును రెండువిధముల సంపాదింపవచ్చును; (1) నూతనముగ పన్నులువేయుట (2) ఋణముజేయవచ్చును. ఈఋణమును ప్రజలనుండి ప్రభుత్వము స్వీకరించును. మరియు దానిని కొంతకాలమునకు దీర్చుటకుగాని, దానిపై సాంవత్సరికవడ్డిని యిచ్చుటకు బద్ధులగును. ఈవడ్డి ప్రజలపై పన్నులువేయబడి, దానిరాబడిద్వార యివ్వబడును. ఈరాజ్యఋణము తరగతి తరగతులపై బాధ్యతగలుగజేయును. ఈఋణము గవర్నమెంటుషేర్లు (భాగములు) లేక స్టాకులనబడును. ఈషేర్లను ప్రజలొకరినుండి నొకరు కొనుక్కొనవచ్చును. వానివిలువ బేరపుధరలబట్టి మారుచుండును. వడ్డి సాధారణము నూటికి మూడువంతునయుండును. రాజ్యఋణమున యనేకభాగములు గలవు. (1) ఫండునొందిన అప్పు- రాజస్వమునుండి రాజ్యఋణముపైవడ్డినిచ్చుటకు శాశ్వతముగ కొంతభాగము దీసికొనబడును. దీనిలో కొన్ని భాగములు గలవు:—

(ఎ) కన్సోలులు. ఈస్టాకుషేరుల పూర్ణనామము మూడుపరుసెంటు కన్సాలిడేటెడ్ బ్యాంకువార్షికములు. రాజ్యఋణములో దీనిభాగమెక్కు-

వగనుండును. ఇది సదా నూటికి మూడువంతున వడ్డీయిచ్చును.

(బి) తగ్గించిన త్రీలు (Reduced threes) దీనిపైన సర్కారుచేత వడ్డి తగ్గించబడినది.

(సి) నవత్రీలు. (డి) నవపాంచిలు. (ఇ) జీవితవార్షికములు.

(త్రీలు, పాంచిలు, అనగ వడ్డినిసూచించుసంఖ్యలు. త్రీలు అనగ నూటికి మూడువంతున వడ్డీయని దెలియవలయు).

(2) ఫండునొందనిఋణము- పార్లిమెంటుయంగీకారమువలన కొన్ని అప్పుపత్రములు జారిచేయబడును. రోజునకు నూరునవరసులకు $1\frac{1}{2}$ లేక 2 పెన్నీల (అణాల) వడ్డిచొప్పున యివ్వబడును.

(3) ఎక్సచెకరు బాండుపత్రములు నైపత్రములవలెనుండును.

## పరదేశ వ్యవహారపుకార్యదర్శి యుద్యోగము.

ప్రధానమంత్రితర్వాత కార్యదర్శులలో నెక్కువ గౌరవ పదవిగల స్థానము. ఈకార్యదర్శికి రాజుతోను, విదేశరాజులతోను నెక్కుడుసంబంధముండును. యితరదేశపువ్యవహారముల, యింగ్లండుతరపు ప్రతినిధిగనుండును; అనేకరహస్యపుకార్యము లీయనద్వార జరుగుచుండును; యుద్ధము, సంధి, రాయభారములు, యితరరాష్ట్రములలోని స్వేచ్ఛావిషయములు, ప్రభుత్వవార్తలన్ని యితనికి దెలియవలసివచ్చును. పరదేశవ్యవహారముల రెండువిధములజెప్పవచ్చును. (1) యూరపులోని దేశములు; టర్కీ, ఈజిప్టు, పరిషియా, యునైటెడ్డుస్టేట్సులతోడి వ్యవహారము (2) యితర భూభాగపువ్యవహారములు.

ఇంగ్లండుతరపున యితరదేశములలోనుండుమంత్రులు నాలుగువిధములు 1 రాయభారులు, 2 ఎన్వాయిలు, ప్లెనిపొటెన్షియరీమంత్రులు- 3 రెసిడెంట్లు- 4 చార్జిడీఅఫేయిర్లు. మొదటి రెండుతరగతులవారు రాజప్రతినిధులు

గనుందురు. మూడవతరగతివారు విదేశముల రాజప్రతినిధులుగ నుండక, యింగ్లండు వ్యవహారములుమాత్రము భద్రము జేతురు. చివరతరగతివారు విదేశమంత్రులకు సహాయము జేతురు.

3. పేటంట్లుకచ్చేరి- నూతనముగ జేయబడిన కల్పనయంత్రములు జేయువారికి వాని నితరులెవరు జేసి యమ్మకుండ మక్తాయిచ్చును.

2. న్యాయనిర్ణయాంగము- ఇది రెండుభాగములు- ఎ పెద్దకచ్చేరీలు బి చిన్నకచ్చేరీలు. పెద్దకచ్చేరీలు గొప్పధనవిషయమయిన వివాదములను, గొప్పశిక్ష వేయవలసిన నేరములును విచారణజేయగలుగును. పెద్దకచ్చేరీలు- 1 ఛాన్సెరికచ్చేరి- యేడుగురు న్యాయాధిపతులుందురు- 2 కింగ్సు బెంచికచ్చేరి (5జడ్జీలు) 3 కామనుప్లీసుకచ్చేరి (5 జడ్జీలు) 4 ఎక్సచెకరుకచ్చేరి (5 జడ్జీలు) 5 అడ్మిరాల్టికచ్చేరి- 6 ప్రోబేటు, వివాహపుకచ్చేరీలు- 7 దివాలాకోరులకచ్చేరి.

చిన్నకచ్చేరీలు:— 1 కౌంటీకచ్చేరీలు 2 క్వార్టరుసెషన్సు- 3 పోలీసుకోర్టులు- 4 పెటీసెషన్సు,

కౌంటీకచ్చేరీలు యొకచోటినుండి యింకొకచోటునకు సర్క్యూటు తిరుగును. ప్రతిసర్క్యూటులోను 16 కచ్చేరీలుజేయబడును. 521 కోర్టులిటువంటివిగలవు. అవి నెలకొకసారిజరుగుచుండును. ఇవన్నియు సివిల్కేసులై యుండును.

న్యాయవిచారణవిధానము :—

1 ప్రథమమున క్రౌను ప్రాసిక్యూటరు నేరముయొక్కస్వభావమును వివరించిచెప్పును.

2 ప్రాసిక్యూషనుసాక్షులు తరువాత విచారింపబడుదురు.

3 ముద్దాయితరఫునవిచారణ; ఆయనప్లీడరుయొక్కవాదన-

4 ప్రాసిక్యూషనుతరఫున ప్లీడరుజవాబు-

5 జడ్జి విచారణాంశముల క్లుప్తముగ జెప్పను-

6 జ్యూరీతీర్మానము- (జడ్జితీర్పు)-

క్యాబినెటు (మంత్రివర్గము) నకు పార్లిమెంటుతోగల సంబంధము.

క్యాబినెటులోని మంత్రులందరు పార్లిమెంటులోని సభ్యులుగ నుందురు. మరియు దానిలోని నాయకులుగనుందురు. పాలనశాఖలు (ప్రభువు ప్రజా శాఖలు) రెండింటిలోనిసభ్యులు ముఖ్యముగ రెండుపక్షముల (పార్టీల)వారై యుందురు; కొందరు శిష్టాచారులనియు, మరికొందరు స్వేచ్ఛాపరులనియు యుందురు ఇప్పుడు ఇంగ్లీషుపార్లమెంటున ముఖ్యముగ మూడునాల్గుపక్షములుగ గలవు. స్వేచ్ఛాపరులు (వీరిప్పుడు పాలనాధికారులుగనున్నారు). లేబరైట్లు(కృషిగాండ్లు)ఫ్రీట్రేడుయూనియనిష్టులు(Free trade Unionists) టారిఫ్ రిఫార్మర్లు (Tariff Reformers), మొదటిరెండుతరగతు లొకపక్షము. చివరరెండు యొకపక్షము. సభ్యులలో నేపక్షమువా రెక్కువగ నుండునప్పుడు, ఆపక్షమువారు తమనాయకులచేత పాలనకార్యము జరుపుదురు. ఆపక్షపునాయకులు మంత్రులగుదురు. క్యాబినెటుమంత్రులు తమతమనామములు సూచించుపాలనాంగముల(ప్రయోగాంగముల) పైయధికారులుగనుందురు. తమ ప్రయోగకార్యములకు (Executive acts) పార్లిమెంటునకు జవాబుదారులగుదురు. మరియు సభ్యులయెదుట శాసననిర్మాణముకొఱకు బిల్లుల సూచించే వారియంగీకారమున శాసనములుగ జేయించుదురు. మంత్రులను పార్లిమెంటు యుద్యోగభ్రష్టులనుగ జేయుటకువీలులేదు. కాని సభ్యుల సహకార్యసమ్మతములేక మంత్రులు పాలనాధికారము వహింపగూడదు. సభ్యులలోవిశేషాంశేమునకు తమపై నమ్మకములేనిచో వారు తమయుద్యోగమునకు రాజీనామా యివ్వవలయును, కాని మంత్రివర్గము పారిమెంటునుముగించి (dissolve)

నూతనయెన్నికలకు అనుజ్ఞయివ్వవచ్చును; అనగా పార్లిమెంటుసభ్యులుతమ నాయకులు జెప్పినట్లుకొంతవరకువినవలసియుండును. కాని ప్రాతినిధికాభిప్రాయము నుమంత్రులు గౌరవింపవలెను; మంత్రులను సభ్యులు విధేయించవలెను. ఒకరికొకరికి యభిప్రాయభేదము బుట్టుచో, యుభయుల పదభ్రష్టులుకావలసియుండును. సభ్యులు మంత్రులయందు నమ్మకముప్రకటించుట క్యాబినెటునకవసరము. నాయకుల విధేయించుట సభ్యతాధికారము నిల్చుటకును, నూతనయెన్నికలవలని ప్రయాసములేకుండుటకును, తోడ్పడును. సభ్యుల మంత్రులు గౌరవించనిచో, ప్రయోగకార్యమునకు వలయుధనమును పార్లిమెంటు సప్లయి జేయదు. మంత్రులే శాసనప్రవేశము జేయవలయును. మరియు సాంవత్సరిక పుబడిజెట్టును తయారుజేసి సభ్యులచే నంగీకరింపబడునట్లు జూడవలయును. సభ్యులు అబడిజెటుపట్టీలో నేమియు మార్పకూడదు మంత్రులయిష్టములేకుండ మార్చినయెడల, వారు రాజీనామాయివ్వవలయును. క్యాబినెటుల ప్రధానమంత్రి పెద్దగానుండును. ఆయనతర్వాత ఛాన్సెలరు అఫ్ యక్సచేకరు పెద్దగనుండును. యీమంత్రులలో నభిప్రాయభేదము బుట్టినప్పుడు వారి తమయుద్యోగమును వదులుకొనవలయును. పాలనకార్యముల కన్నిటి కందరు మంత్రులు జవాబుదారులే.

పార్లిమెంటులో కాబినెటుద్వార శాసననిర్మాణ ప్రయోగాంగములు రెండు కొంతవరకు కూడిక జెందినవి. మంత్రులు పార్లిమెంటులో నిర్మాణకర్తలు; ప్రయోగాంగముపై యధికారమును వారికిగలదు. ప్రయోగకార్యముల వలయుమార్పులు వారికిదెలియుటకు వీలుగలదు; మరియు వానిదెలిసికొని శాసననిర్మాణముగావించుటకును సాధ్యమగును. దీనినే ఇంగ్లీషుపార్లిమెంటరీపద్ధతియని జెప్పుదురు.



## ఐదవయధ్యాయము.

### అమెరికనుపార్లిమెంటరీపద్ధతికిని ఇంగ్లీషుపార్లిమెంటరీపద్ధతికి గల తారతమ్యము.

ఇంగ్లీషుపద్ధతిననుసరించి, ఫ్రాన్సు, బెల్జియమ్, హాలెండు, ఇటలీ, జర్మనీ, హంగేరీ, స్వీడెను, నార్వె, డెన్మార్కు, స్పెయిన్, పోర్చుగల్, కనడా, కేపుకాలనీలు, ఆస్ట్రేలియా దేశములు చాలవరకు పోలికగలిగిన రాజ్యప్రకృతులను స్థాపించుకొనిరి. కనుక అమెరికను' ఇంగ్లండుపద్ధతులనభ్యసించినజాలును.

| ఇంగ్లీషుపార్లిమెంటరీపద్ధతి. | అమెరికను కాంగ్రెసుపద్ధతి. |
|---|---|
| జవాబుదారి లేనటువంటిన్ని, ఖాయముగనుండునట్టియు, ప్రధానయధికారిని నియోగించును. ఆయన పేరట ప్రయోగకార్యములన్నియు జరుపబడును. (ఫ్రాన్సులోమటుకు యిట్లు లేదు). | అమెరికనుకాంగ్రెసు యీరాజకధర్మములపై యాధారపడియున్నది. 1 (ఎ) స్వతంత్రరాజ్యము (స్వరాజ్యము) యొక్క ప్రధానలక్షణము శాసననిర్మాణప్రయోగములు వేఱువేఱుయధికారుల స్వాధీనములో నుండుట. |
| నామమాత్రమున తనజేత నియోగమునొందినను, నిజముగా ప్రజలచే ప్రతినిధులుగ నెన్నుకొనబడిన వారలచేపాలనకార్యములు జరుగును. వీరు సాధారణముగ శాసనాంగపు సభ్యులై యుందురు. ప్రతినిధులే తమయేజంట్లద్వార నిజమయినప్రభుత్వమునల్పుదు | (బి) ప్రయోగాంగముయొక్కయధికారము స్వేచ్ఛకు నష్టము జేయును. గనుక దానికి స్పష్టమగు హద్దుతేర్పడవలయును. |

రు. ఈయేజంట్లకును (అనగా క్యాబినెటువగయిరాలను) నమ్మకపోయినచో, నూతనయేజంట్లను నియమించును. (ఈవిధముగ నొకరువిడచినతరువాత నొకపార్టీవారు పాలనవహింతురు.) శాసననిర్మాణప్రయోగపు నధికారములు ప్రతినిధుల విశేషాంశమునకు జెందియుండి తన వైశాల్యకారణముచే కాబినెటుకు కొంతస్వతంత్రమిచ్చును.

క్యాబినెటు కొంతవరకు శాసననిర్మాణాంగముగను కొంతవరకు ప్రయోగాంగముగనుండును. క్యాబినెట్టే ప్రజాచట్టముల మొదట శాసనాంగములో ప్రవేశము జేసి సమ్మతినొందునట్లు జేయును. ఇట్లు ప్రతినిధులపై క్యాబినెటు కొంత యాజమాన్యము కలిగియుండును. ప్రయోగ యుద్యోగులును శాసననాయకులునై యుందురు.

ఫ్రాన్సులో శాసనాంగము సంపూర్ణమగుయధికారము గలిగియుండును. ప్రషియా, జర్మనిలో చాల తక్కువయధికారము కలిగియుండును.

(సి) రాష్ట్రాధికారినిహద్దులోనుంచుటకుగాను వానియధికారములనిర్ణయించుటయు, నియామకకాలమునయుద్యోగమిచ్చుటయు శాసనాంగముపై ప్రాభవము లేకుండజేయుటయే ప్రధానమార్గములు.

(డి) ప్రయోగాంగపు యుద్యోగులు శాసనాంగములో సభ్యులుగ నుండకూడదు. ఇవి స్వరాజ్యప్రధానభావములైయున్నవి.

పై రాజకధర్మములు శాసనాంగమునకునిర్మలత్వమును, స్వతంత్రతయు నిరంకుశాధికారులపై నంకుశమును ప్రజా సేవాభావమునిచ్చును.

5 శాసనాంగము నిరంకుశము గాకుండుటకు సాధనములు కొన్ని నేర్పాటుజేసిరి. అవి 1 ప్రెసిడెంటును కాంగ్రెసు యెన్నుకొనక ప్రజలే యెన్నుకొనిశాసనాంగముపై నిషేధపుహక్కును (veto power) కలిగియుండును. 2 కేవలము ప్రెసిడెంటు తనంతట తాను బలహీనుడగును. ఎందుక

న్యాయనిర్ణయాంగము ప్రభుత్వాంగములో భాగముగనుండక శాసనప్రయోగాంగముల వివాదములను నిర్ణయింపదు.

ఇంగ్లీషు పార్లిమెంటు క్యాబినెటుపై యాజమాన్యము వహించును. వారిద్వార ప్రయోగాంగమును స్వాధీనము జేసికొనును. మరియు నది ప్రయోగాంగవిషయములందును ప్రధానాధికారము కలిగియున్నది. ఎందుకన ప్రయోగాధికారులగు క్యాబినెటును యిష్టమున్నచో యుద్యోగభ్రష్టుల జేయవచ్చును.

మంత్రివర్గము పార్లిమెంటును రద్దుజేసి నూతనయెన్నికల కనుజ్ఞ జేయవచ్చును. నూతనయెన్నికలు మంత్రివర్గముయొక్క కార్యముల నామోదించుచో వారు పాలనభారము వహింతురు. లేనియెడల తమ యుద్యోగములకు రాజీనామ జేయుదురు. ప్రభుశాఖకును, ప్రజాశాఖకును భేదములుబుట్టుచో, పార్లిమెంటు (అనగ ప్రజాశాఖ) సభ్యతలనొదులుకొని న శాసనాంగములో సభ్యుడుకాడు.

శాసనాంగము నిటులనే తనంతట తాను బలహీనముగనుండును. మరియు నేకసభ్యులు గారుగనుక కుట్రలకులోనై ప్రజలపై నిరంకుశాధికారము వహించుటకు వీలులేదు మరియు ప్రెసిడెంటు యుద్యోగమునకు చాల హద్దులుగలవు. 3. కాంగ్రెసును రద్దు జేయుటకుగాను ప్రజలసమ్మతికి అప్పీలుజేయుట కధికారములేదు. ప్రెసిడెంటు ప్రజాబాహుళ్యప్రతినిధి; నాల్గుసంవత్సరములవర కుద్యోగము వహించును.

కాంగ్రెసు చాలవరకు ప్రయోగహక్కులులేవు. ప్రయోగాంగపుయుద్యోగులగు ప్రెసిడెంటు ఆయన మంత్రివర్గముల యదినియోగింపదు. కాని దానిలోని కమిటీ లంతకంతకు బలపడుచున్నవి.

ప్రెసిడెంటునకును కాంగ్రెసునకును వివాదము రెండురూపముల కావచ్చును. 1 బిల్లులు 2 ప్రెసిడెంటుకా

తిరిగి యెన్నుకొనబడవలయును. లేక నూతనప్రభువుల సృజించి, ప్రజాశాఖచే ప్రభుశాఖకు పంపబడినబిల్లు చట్టముగునట్లుచేయబడును.

ఇంగ్లండులో ప్రయోగాంగము శాసనాంగముద్వార ప్రజలకు ప్రత్యక్షముగ జవాబుదారికలిగియుండును.

ఇంగ్లండులో ప్రభుత్వము పార్టీపద్ధతినిజరుగును. ఒకప్పుడు శిష్టాచారులును, మరొకప్పుడు స్వేచ్ఛాపరులును పాలనాధికారులగుదురు.

ఇంగ్లండు పాలనాంగముల నేకీభావము నైక్యతయు గలవు.

ఇంగ్లీషుపార్లిమెంటున మంత్రివర్గము, పూర్వపుమంత్రివర్గము, కృషివర్గము, జాతీయవాదులు (ఐరిష్) హెచ్చుగనుందురు. పార్లిమెంటులో ప్రతిపార్టీ నాయకుడును, తనసహాయకారిగ నొక సభ్యుని నియమించును. ఆయన హెచ్చుగనబడును. ఆయన విధులు:— 1 వోట్లువిభజన యెప్పుడుజరుగునో ప్రతిసభ్యునికి జెప్పుట.

ర్యములు. బిల్లుల ప్రెసిడెంటు యంగీకరించనిచో, కాంగ్రెసుసభ్యుల రెండుశాఖలలో $\frac{2}{3}$ మందికూడి దానిశాసనముజేయవచ్చును.

2 ప్రెసిడెంటు నితరకార్యముల కాంగ్రెసు నడ్డుపెట్టవచ్చునుగాని, ఆయనను విధేయునిగజేయుట కధికారములేదు.

ప్రయోగశాసనాంగములకు పరస్పరస్వతంత్రత యుండును. మొత్తముమీదయీపద్ధతి దేశక్షేమమునకు తోడ్పడును.

అమెరికాలో పార్టీప్రభుత్వపద్ధతి లేదు.

అమెరికా పాలనాపద్ధతిలో నేకీభావములేదు; ఐక్యతయులేదు. సెనెటర్లమీద యప్పుడప్పుడు స్వవిషయములద్వారసంభవించు యధికారముదప్ప, కాంగ్రెసుపైన ప్రెసిడెంటు అతని మంత్రివర్గములకు యధికారములేదు. శాసనప్రవేశహక్కులేదు.

మరియు సభ్యులు సభనువిడచిపోకుం డ విభజనకాలము ననిల్పుట.

2 తనపార్టీ సభ్యులను వోటు యివ్వమని జెప్పుట.

3 వారిస్వతః వోటు యిచ్చుటకు వీలులేనిచో, వారిప్రత్యామ్నాయము నితరులకుదుర్చుట.

4 విభజనలోవోట్లసంఖ్య లెక్కిం చుట.

5 పార్టీసభ్యులయభిప్రాయము కనుగొని నాయకులకు జెప్పుట.

క్యాబినెటుప్రభుత్వము యింగ్లీషు పద్ధతికి ప్రత్యేకమయినది. శాసనని ర్మాణాంగమునకు జవాబుదారియగు ప్రజాకూటముచేపాలనజరుగుట, క్యా బినెటు ప్రభుత్వ మనబడును. పార్లి మెంటులోని యొకశాఖ యింకొక శాఖకు జవాబుదారిగనుండి ఒకరాజ కపక్షమంతయు కూడి ప్రభుత్వము వ హించి, తమశాసనములనన్నియు కూ

పాలనాంగములపై కాంగ్రెసునకు అమితములగు విచారణ యధికారము లును అసంపూర్ణములగు ప్రాభవాధి కారములును గలవు.

శాసననిర్మాణ ప్రయోగాంగములు కేవలము వేఱువేఱుగ నుండుటవలన జవాబుదారి యెవరిపై నుంచవలెనో ప్రజలకు తెలియదు.

సంఘర్షణవలన, శాసన, పాలనాం గములశక్తి కొంతవరకు వ్యర్థమై పోవును.

పరమావసరకాలములప్రయోగాం గముయొక్క దృఢకార్య నిర్వాహక త్వమును, శీఘ్రముగ నిశ్చయించు శ క్తియు బలహీనములగుట కవకాశము గలదు.

డి నిర్మాణముగావించు పాలనావిధా
నమును జవాబుదారిపాలన యని జె
ప్పవచ్చును. ఒకసభ్యుడు యంగీకరిం
పకపోయినను పాలనాంగ మంతయు
చెడిపోవును.

క్యాబినెటులక్షణములు :— (1)
శాసననిర్మాణసభలలో (పార్లిమెం
టులో) ని సభ్యులే క్యాబినెటులో
నుండవలయును; (2) వీరందరు (మం
త్రులందరు) సమాన రాజకాభిప్రాయ
ములగలిగి, సమానపక్షమునకే జెంది వీ
రందరు ప్రజాప్రతినిధిశాఖలో విశే
షాంశపు సభ్యులలోనివారై సమాన
తంత్రమునువహించి (3) పార్లిమెం
టుయొక్క అసమ్మతమునకు పాత్రు
లగుచో సమానముగాకూడి తమయు
ద్యోగములకు రాజీనామాయివ్వవలసి
యుండును; (4) వీరందరును యొక
ప్రధానమంత్రి జెప్పినట్లు విధేయింప
వలెను.

## కెనడా సంయుక్తరాజ్య ప్రకృతి.

బ్రిటిషు నాతుఅమెరికా ఆక్టు (సం॥ 1867); వలన బ్రిటిషు పార్లి
మెంటుచే కనడాదేశపు సంయుక్తరాజ్యప్రకృతి స్థాపింపబడినది.

కెనడా ప్రభుత్వము ఇంగ్లీషుక్యాబినెటుపద్ధతిపై నాధారపడియున్నది అనగా మంత్రివర్గము పార్లిమెంటులో సభ్యతగలిగి కామన్సుగృహముయొక్క సమ్మతిపై యుద్యోగమువహింతురు. ఇంగ్లీషు రాజువలెనే గవర్నరుజనరలొక జవాబుదారిలేనట్టియు, శాశ్వతమయినట్టియు ప్రయోగాధికారియై యుండును. పార్లిమెంటును రద్దుజేయవచ్చును. సెనెటులో 78 సభ్యులుగలరు. వీరు గవర్నరుజనరలు, అనగా మంత్రివర్గముచే శాశ్వతసభ్యులుగ నియమింపబడుదురు. కామన్సుసభలో 210 సభ్యులుందురు. వీరు అయిదుసంవత్సరములవరకు యెన్నుకొనబడుదురు. సెనెటరులు, ప్రజాప్రతినిధులు జీతముల పొందుదురు. సెనెటుయధికారము బహుకొంచెమై యుండును. గవర్నరుజనరలు నిషేధహక్కును (veto power) కలిగియుండినను, బహుసకృతుగ దాని నుపయోగించును. రాష్ట్రీములోని న్యాయాధిపతులందరు మంత్రివర్గముచే నియోగింపబడి, మంచిప్రవర్తనము చూపునంతకాలము యుద్యోగము వహింతురు.

కెనడాలో యిప్పు డేడురాజధానులుగలవు. ప్రతిదానియందును శాసనాంగ మొకటిగలదు. డొమినియన్పార్లిమెంటుసభ్యులు రాజధానిశాసనాంగములసభ్యులుగ నుండతగరు. రాజధానులచట్టముల గవర్నరుజనరలొకప్పుడు రద్దుచేయువచ్చును.

యునైటెడ్డుస్టేట్సురాజ్యప్రకృతివలె డొమినియను, రాజధానుల శాసనాంగములకు యధికారవిభజనగలదు. కాని యీభేదము మాత్రము గలదు. యునైటెడ్డుస్టేట్సులో కాంగ్రెసును రాష్ట్రీములచే సమర్పింపబడిన హక్కులుండును. సమర్పింపనిహక్కులను రాష్ట్రీములే యనుభవించును. కెనడాలో రాజధానులకు ప్రధానశాసనాంగమే యధికారమునిచ్చును. రాజధానులు ప్రధానశాసనాంగములు నిర్మాణము జేయలేదు.

కెననాడారాజ్యప్రకృతి ప్రజాసమ్మతిపైబుట్టలేదు. కెనడాలో యొక

సంవిదముచే వ్రాయబడి ఇంగ్లీషుపార్లిమెంటుచే సంగీకారమునొందెను. బ్రిటిషుపార్లిమెంటే దానినిమార్చుటకు యధికారముకలిగియుండును.

ఇటులనే ఆస్ట్రేలియా, దక్షిణఆఫ్రికా మొదలగు రాష్ట్రముల రాజ్యప్రకృతులేర్పడినవి.



## ఆరవయధ్యాయము.

### ఇండియారాజ్యప్రకృతి.

ఇండియారాజ్యప్రకృతి నభ్యసించుటలో చదువరులు గమనింపవలసిన విషయము లనేకములుగలవు. కాని యీయధ్యాయమునందు చర్చనాంశము లవేనిని జెప్పుటలేదు; కేవలప్రభుత్వాంగములను, వానివిధులను వ్రాయుదును. ఇండియారాజ్యప్రకృతి 1858 సం॥నుండి స్థాపింపబడిన కొన్నిచట్టములపై నాధారపడియున్నది. 1858 సం॥ లోని యిండియాప్రభుత్వచట్టము (The Government of India Act, 1858); ఇండియను కౌన్సిలు చట్టము (1861 సం॥), (The India Council Act, 1861); లలోని

యీచట్టములు 1865, 1869, 1870, 1871, 1874, 1876, 1892, 1904, 1907, 1909 సంవత్సరములలో సవరణజెంది పునస్థాపితములగు రూపములప్రకారమున్నూ యిండియారాజ్యప్రకృతినిగూర్చి నభ్యసింపవచ్చును. మరియు నీరాజ్యప్రకృతి కేవలము శాసనరూపమున నిర్మితమయినదేగాక, కొంతవరకు వృద్ధిపొందినదనియు జెప్పవచ్చును.

ఇండియారాజ్యప్రకృతిని ముఖ్యముగ రెండురూపముల పరీక్షింపవచ్చును: (1) యిండియా ఆధేయరాజ్యమగుటవలన యింగ్లండులో యిండియాపా

లనకార్యమునకై యొకరాజ్యాంగ మేర్పడియున్నది. ఇండియాచక్రవర్తి ఇండియాకొరకేర్పడిన రాష్ట్రీపుకార్యదర్శి; యిండియాకౌన్సిలు (సభ) వారితోకూడిన రాజ్యాంగము; (2) ఇండియాలోనేర్పరుపబడిన రాజ్యాంగము; యిది వైస్రాయి, వైస్రాయికార్యనిర్వాహకసభ; శాసననిర్మాణసభ; రాజధానిప్రభుత్వములు; జిల్లాప్రభుత్వాంగములతో కూడియున్నది. ఈయధ్యాయములో యీరాజ్యాంగములు వరుసగా వివరింపబడును.

1858 సం॥నకు పూర్వము యిండియాదేశము మొగలాయిలు, మహారాష్ట్రీలయొక్క రాజ్యముయొక్క చివరదశయందు యీస్టిండియాకంపెని (East India Company)వారిచే పాలింపబడుచుండెను. ఈకంపెనివారు ఇంగ్లండురాజుదగ్గరనుండి సన్నదునొంది యారాజునకుగాను యిండియాలో నాంగ్లేయస్వాధీనమగు దేశమును పాలించుచుండిరి. వీరు 1600 సం॥న యెలిజబెత్ రాణినుండి యిండియాలో వర్తకము జేయుటకు సన్నదునొంది, దేశములసంపాదించి, కోటలు, సేనలు మొదలగువాని వినియోగించి, క్రమక్రమమున వర్తకసంఘము పాలనసంఘముగ మారెను. 1773 సం॥ రెగ్యులేటింగు చట్టము (The Regulating Act, 1773) వలన గవర్నరుజనరలు, మద్రాసు, బొంబాయిలకు గవర్నరులు, న్యాయస్థానములు స్థాపింపబడెను. 1813 సం॥న వర్తకవ్యాపారమును కంపెనీవదలుకొని, 1833 సం॥న యిండియాప్రభుత్వము దేశపాలనకొరకు చట్టనిర్మాణకార్యమును మొదలుబెట్టెను. 1858 సం॥న యిండియాప్రభుత్వమును యీష్టిండియాకంపెనీనుండి తీసివేసి యిండియాచక్రవర్తినియను పేరట, యింగ్లండురాణి తన స్వహస్తములలోనికి రాబట్టుకొనెను. అప్పటినుండియు, ఇంగ్లండురాజు యిండియాచక్రవర్తిగానుండి తనరాష్ట్రీపు కార్యదర్శులలో నొకరిని, యిండియాప్రభుత్వకార్యములపై నియోగించి ఆయనద్వార పాలనసేయుచుండెను. కాన యింగ్లండురాజు యిండియాయొక్క శాసనప్రయోగాంగమునకు పైయధికారియై యున్నాడు. రాజునకు సహాయార్థముగాను క్యాబినెటు (Cabinet) మంత్రియగు కా

ర్యదర్శియొకడు, యిండియాకవున్సిలు (The India Council) అని పిలువబడు సభయొక్క సలహాపొంది పాలించుచుండును. అయనకు యిద్దరు యుపకార్యదర్శులుగలరు. ఒక యుపకార్యదర్శి పార్లిమెంటులోనుండి పనిజేయును. కార్యదర్శిజీతము సం॥నకు 5000 నవరసులు; పార్లిమెంటులోని యుపకార్యదర్శిజీతము 1500 నవరసులు; యితరకార్యదర్శిజీతము 2000 నవరసులు.

## ఇండియా కౌన్సిలు.

1858 సం॥పు యిండియాప్రభుత్వపుచట్టములో నుదహరించినప్రకారము యీసభను వివరించదగును. దీనిలో 14 మందికి మించక, 10 మందికి తగ్గక సభ్యులుందురు. కార్యదర్శికి యీసభ్యులనియమించు యధికారముగలదు. వీరిలో తొమ్మిదిమందయినను యిండియాలో పది సం॥లు యుద్యోగము జేసియుండవలెను. అయుద్యోగమును విడచి పది సం॥లు మించకూడదు. వీరి సభాయుద్యోగకాలము పది సం॥లు. ఒకప్పుడు కార్యదర్శి సభ్యులనేవరినయినను తిరిగి యైదు సం॥లు నియోగింపవచ్చును. మరియు నూతనసభ్యుల ప్రత్యేక కార్యములకు నేర్పాటుజేయవచ్చును.

ఒక్కొక్కసభ్యునిజీతము సంవత్సరమునకు 1200 నవరసులై యుండును. ఇండియాకౌన్సిలుసభ్యుడు పార్లమెంటులో చేరకూడదు. ఇండియాప్రభుత్వముతో సంబంధించిన రాజకవ్యవహారముల నన్నిటిని కార్యదర్శిగారియాధిపత్యముక్రింద యిండియాసభ వ్యవహారించుచుండును. ప్రతిసభకు అయిదుగురుసభ్యులకు తక్కువగానుండకూడదు. ప్రతివారమున యొకసభ జరుగవలయును. కొన్ని నియామకవిషయములదప్ప కార్యదర్శిగారియభిప్రాయము చివరతీర్పయియుండును. ఈక్రిందివిషయముల సభ్యుల యంగీకారములేనిది కార్యదర్శిగారు వ్యవహారింపకూడదు.

(1) రాజస్వవ్రయవిషయములు.

(2) ధనముపై జామీను.

(3) తాకట్టువేలం.

(4) ఒడంబడికలు (కంట్రాక్టులు)

(5) జీతములుమార్చుట.

(6) సెలవు నియమములు.

(7) ఇండియాలోని యుద్యోగములు.

(8) ఇండియా సివిలుసర్వీసుకొరకు ప్రత్యేకముగానుంచబడిన యుద్యోగములను స్వదేశీయులకిచ్చుట.

(9) ప్రత్యేకమయిన యుద్యోగముల నియమములు.

ఇండియారాజస్వమును యిండియాయందుగాని తదితరచోటులగాని వ్రయపరచుటకు యిండియాకవున్సిలులోనిసభ్యుల విశేషాంశముయొక్క యంగీకారమునుపొందక కార్యదర్శిగారు పనిజేయుటకు హక్కులేదు. ఇండియా కొరకు అప్పుదెచ్చు ధనమునుగూర్చిన వ్యవహారములందును కార్యదర్శిస్వతంత్రించి పనిచేయకూడదు. ఇండియాప్రభుత్వమును జరుపుట కవసరములగు వస్తువులను కొనుటయందుగాని, అమ్ముటయందుగాని, తాకట్టుపెట్టుకొనుటయందుగాని, కంట్రాక్టుల నిచ్చువిషయములందును, సెక్రటరిగారికి స్వతంత్రాధికారము లేదు.

కార్యదర్శిగారు యిండియాప్రభుత్వమునకు బంపు యాజ్ఞల నన్నింటిని కౌన్సిలుయెదుట బెట్టవలయును. సభ్యులలో నెవరయినను ఆయాజ్ఞపై తన యభిప్రాయమును వ్రాయవచ్చును. సభ్యులలో విశేషాంశము ప్రతికూలించిన చో కార్యదర్శి తనప్రవర్తనగూర్చి తగుకారణములను వ్రాయవలయును. అతి తొందరవిషయముల దగుకారణములనువ్రాసి సభ్యులయెదుట బెట్టక యిండియాకు బంపవచ్చును. సంధి, యుద్ధము, రాయభారము, తంత్రము యీవిష

యముల సభ్యులకు తెలియపరచక కార్యదర్శి తగునట్లు పనిజేయవచ్చును. యుద్ధమును ప్రకటించునపు డా ప్రకటనకాలముయొక్క మూడుమాసములలో పార్లమెంటుకు దానినిగూర్చి జెప్పవలయును. ఇండియాయొక్క ప్రభుత్వము వర్తకము, రాజస్వము మొదలగువిషయముల కార్యదర్శి యిండియాప్రభుత్వమునుండి వర్తమానమును దెప్పించుకొనవలసియుండును. ఇండియా రాజస్వమును పార్లమెంటుయనుమతిలేక విదేశయుద్ధములకు ఖర్చుపెట్టకూడదు. ప్రతి సంవత్సరమున మేయి మొదలనుండి పదునాలుగురోజులలోగా యిండియా యొక్క సాంవత్సరిక జమాఖర్చులజాబితాను పార్లమెంటుయెదుట దాఖలు చేయవలసియుండును. (1) ఈజాబితాలో ప్రతిరాజధానినుండియు వచ్చిన ట్టిశిస్తును, ఖర్చులను, అంశవివరములుగ జూపవలయును. (2) గడచినసంవత్సరముయొక్క ఆదాయవ్యయములు (3) రాజ్యఋణముకొరకు యెంతశిస్తుపోవునో, దానికగువడ్డి మొదలగువిషయములు కార్యదర్శిగారి పాలనాంగములోని యుద్యోగుల జీతభత్యములవివరము; పించనలు. (4) ఇండియాప్రజల యొక్క అభివృద్ధి, స్థితి వీనివిషయమై కార్యదర్శిగారు పార్లమెంటుసభకు జెప్పవలసియుండును. కార్యదర్శిగారు యుద్యోగరీత్య జేసినలోపములకు దావా తీసుకొనిరావచ్చును.

## ఇండియా ప్రభుత్వము.

ఇండియాప్రభుత్వమును మూడువిధములుగ విభజింపవచ్చును. (1) శాసనప్రయోగాంగము (the executive organ); (2) శాసననిర్మాణాంగము (the legislative organ); (3) శాసననిర్ణయాంగము (the judiciary); ఈయంగములు వరుసగా వివరింపబడును.

### శాసన ప్రయోగాంగము; వైస్రాయి.

బ్రిటిషుయిండియాలోని సివిలు, యుద్ధపువ్యవహారములన్నిటియొక్క తనిఖీ, నియోగము, క్రమము మొదలగుకార్యములు సభాసమేతుడగు వైస్రా

యి (రాజప్రతినిధి), గవర్నరుజనరలునగు యధికారిజేతిలో నున్నవి. ఆయన యింగ్లండు యిండియాతరఫుననున్న రాష్ట్రీపుకార్యదర్శికి లోబడి యుండవలెను. వైస్రాయి రాజుచేనియమింపబడి, అయిదు సం॥లు పాలనసేయును. ఈవైస్రాయి యిండియా సివిల్సర్వీసులో యుద్యోగిగా నుండకూడదు; మరియు వారితో నేవిధమగు సంబంధముకలిగినవాడుగ నుండరాదు; వారందకంటె పైస్థితిమంతుడుగను, యింగ్లండులోని పాలనశాఖకు యిష్టుడుగను, వైస్రాయిగ నుండవలెను. వైస్రాయికార్యనిర్వాహకమున అయిదుగురు సభ్యులు సహాయము జేతురు. వీరిలోముగ్గురు కనీసము యిండియాలో 10 సం॥లు పనిజేసేయుండవలెను. ఒకడు బారిష్టరుపరీక్షయందు కడతేరవలెను; సేనాధిపతియు నొకప్పుడు ప్రత్యేకముగా కార్యనిర్వాహకసభలోజేరును. వైస్రాయిసభ్యులలోని విశేషాంశము (majority) యొక్క తీర్మానముప్రకారము వ్యవహరింపవలెను. ఒకానొకప్పుడు సభ్యుల కిష్టములేకయే, దేశక్షేమమునకు వలయుచట్టముల జేయవచ్చును. ఇప్పుడు యీకార్యనిర్వాహకసభ్యులచే తొమ్మిదిరాజ్యాంగములు వ్యవహరింపబడుచున్నవి. అవి: (1) స్వదేశము, (2) విదేశము, (3) అర్థము, (4) శాసననిర్మాణము, (5) శిస్తు, వ్యవసాయము, (6) పబ్లికుకార్యములు (public works); (7) వర్తకము, చేతిపనులు, (8) సేనలు, యుద్ధపుసప్లయి అయియున్నవి. ఈరాజ్యాంగము లన్నిటికి కార్యదర్శులు గలరు. వీరు కార్యనిర్వాహక సభ్యులక్రింద నుందురు.

## వైస్రాయి శాసననిర్మాణసభ.

వైస్రాయియు, నాతని కార్యనిర్వాహకపు సభ్యులునుగాక, యితర సభ్యులసంఖ్య అరువయి (60) వీరిలో యెన్నికొనబడినవారిసంఖ్య యిరువదయిదు (25); సర్కారుచే నియోగింపబడినవారిసంఖ్య ముప్పదియైదు (35); యీముప్పదియైదు 28 మందికంటె నెక్కుడు సర్కారుయుద్యోగు లుండకూడదు; ముగ్గురు యిండియను వర్తకసంఘమునుండియు, పంజాబు మహమ్మదీయులనుండియు, పంజాబు భూస్వాములనుండియు, ఒకొక్కరుచొప్పున

నియోగింపబడవలెను. సర్కారుయుద్యోగులు కానివారు వైస్రాయి శాసననిర్మాణసభలో విశేషాంశముగ నుండకూడదు.

## ఎన్నుకొనిన సభ్యులు.

(1) మద్రాసు, బొంబాయి, బెంగాలు, సంయుక్తరాజధానుల శాసననిర్మాణసభలలోని సర్కారుయుద్యోగులు కానివారిచే యిద్దరిద్దరుప్రకారము నెన్నుకొనబడిన సభ్యులసంఖ్య (మొత్తము)—8.

(2) తూర్పుబంగాళ, అస్సాము, పంజాబు, బర్మా, మధ్యరాష్ట్రములలోని సభలనుండియు, మద్రాసులోని భూస్వాములు, బొంబాయిలోని భూస్వాములు, బెంగాలులోని భూస్వాములు, సంయుక్తరాజధానులు, తూర్పుబెంగాలు అస్సాములోని భూస్వాములు, మధ్యరాష్ట్రములలోని భూస్వాములనుండియు, బొంబాయి, మద్రాసు, బెంగాలు, సంయుక్తరాష్ట్రములు, తూర్పుబంగాళా అస్సాములలోని మహమ్మదీయసంఘములనుండియు, బెంగాలు, బొంబాయి వర్తకసంఘములనుండియు ఒక్కొక్కరుచొప్పున యెన్నుకొనబడిన సభ్యులసంఖ్య 17.

సంయుక్తరాజధానులు, తూర్పుబంగాళా, అస్సాములలో, రెండు, నాల్గు, ఆరు మొదలగు విరామయెన్నికలలో యింకొక మహమ్మదీయసభ్యుడు భూస్వాములకు బదిలీగా నెన్నుకొనబడును.

## ఎన్నికవిధానము.

వైస్రాయి శాసననిర్మాణసభకు యెన్నుకొనబడుసభ్యుల నిర్వచించుటకుగాను నాలుగువిధములగు యెన్నికసంఘము లేర్పరుపబడినవి. (1) దేశీయనిర్వచన (యెన్నిక) సంఘములు (territorial electorates); యివి రాజధానులందుండు స్థానికశాసననిర్మాణసభ్యులలో సర్కారుయుద్యోగస్థులు కానివారిచే నేర్పడినవి; (2) భూస్వాములు. మద్రాసు భూస్వాముల యర్హతగుణము లిచ్చుట జెప్పవచ్చును. సభ్యులగువారు (ఎ) రాజధానిలో

నున్నట్టి భూములనుండి సం॥నకు రూ 15000 లు యాదాయము గలవారుగను (బి) లేక సర్కారునుండి రు 15000 లు మాలిఖానాలవెన్నుగను నుండవలెను; (3) మద్రాసులోని మహమ్మదీయసంఘము- సభ్యుడు సాలుకు రు 3000 లు ఆదాయముకలవారుగను, లేక రు 6000 పైన సాలుకు రాబడిపన్ను కట్టువారుగను, లేక చట్టనిర్మాణసభ్యులుగను, సర్వకళాశాల సభ్యులుగను, కొన్ని బిరుదులుగలవారుగను, లేక గెజిటెడ్ యుద్యోగులుగను నుండవలెను; (4) బొంబాయి, కలకత్తాలలోని వర్తకసంఘములు చెరియొకసభ్యునిఎన్నుకొనవలెను

| | |
|---|---|
| దేశీయనిర్వాచనసంఘములచే నెన్నుకొనబడువారిసంఖ్య | 12 |
| భూస్వాముల | 6 |
| మహమ్మదీయసంఘము | 5 |
| వర్తకసంఘములచే | 2 |
| మొత్తము | 25 |

## ఎన్నికదారుల యనర్హతగుణములు.

(1) బ్రిటిషురాజ్యమునకు జెందవలెను.

(2) ఆడవాండ్రు పనికిరారు.

(3) మైనర్లు, పిచ్చివాండ్రు కూడదు.

(4) ఇండియా, లేక రాజధానిప్రభుత్వముచే, అయోగ్యులు, మంచి నడతలేనివారు అనిప్రకటింపబడినవారు.

(5) సర్కారుయుద్యోగమునుండి తొలగింపబడినవారు.

(6) ఆరునెలల ఖయిదుశిక్షగల నేరము మోపబడినవారు.

(7) దివాలకోరులు, (8) ప్లీడరుపట్టా తొలగింపబడినవారు.

సభ్యతకాలము రెండు మూడు సం॥లుండును.

## కొన్నితరగతులకు ప్రత్యేకపు నెన్నికహక్కు.

వృత్తిదారులు, భూస్వాములు, మహమ్మదీయులు, యూరపియను, యిండియనువర్తకులకు ప్రత్యేకపుహక్కు లివ్వబడినవి.

(1) వృత్తిదారులు (అనగా జనసామాన్యమువృత్తివలన జీవించువారు) వైస్రాయిసభలో రాజధానిసభలచే నెన్నుకొనబడిన సభ్యులచే ప్రాతినిధ్యము నొందుదురు. రాజధానిసభలలో జిల్లాబోర్డు, మ్యూనిసిపాలిటీలు (పట్టణపారిశుద్ధసంఘములు) విశ్వవిద్యాలయములు, రాజధానిపట్టణములు, కార్పరేషనులు (రాజధానిపట్టణములలోని మ్యునిసిపాలిటీలు); వీనిచే సభ్యులెన్నికొనబడుదురు.

(2) ఇతరతరగతులు (అనగా భూస్వాములు, మహమ్మదీయులు, వర్తకసంఘములు) ప్రత్యేకముగ స్థాపింపబడిన యెన్నికసంఘములచే నెన్నుకొనుటకుగాని, లేక సర్కారు తమ ప్రతినిధుల నియోగముజెందుటకుగాని హక్కుగలిగియుందురు.

భూస్వాములు:— బొంబయిలోని సింధుప్రదేశములో మహమ్మదీయులసంఖ్య హిందువులకంటె హెచ్చు; కనుక గుజరాతు, దక్కనుసర్దారులు (హిందువులు) ద్వితీయ, చతుర్థ ... ఎన్నికసమయముల వైకల్పికముగా (alternately) ప్రతినిధుల నెన్నుకొందురు. ఒకటి, మూడు, అయదు యెన్నికసమయముల మహమ్మదీయులు ప్రతినిధుల నెన్నుకొనవలయును.

పంజాబులో మహమ్మదీయులు, హిందువులసంఖ్య రమారమి సమానముగనుండును. కనుకమహమ్మదీయులు 1, 3, 5, 7 యెన్నికలలో ప్రతినిధుల నెన్నుకొందురు. హిందువులు, 2, 4, 6 యెన్నికలలో నెన్నుకొందురు. సంయుక్తరాజధానులు, తూర్పుబెంగాలు ఆస్సాములలో భూస్వాములకుప్రత్యేకపు నెన్నికసంఘము లేర్పరుపబడినవి. తూర్పుబెంగాళ, ఆస్సాము, చెన్న

పురి, బెంగాలులలోనున్న తేయాకు, నార, కాఫీ నాటుసంఘము (planting communities) లకు వేరువేరు యెన్నికహక్కులు నేర్పాటుజెందినవి.

## ఎన్నికలేకుండ సర్కారుచేత నియోగము.

(1) ఇండియనువర్తకసంఘము (బొంబాయిలో దప్ప) అన్నిసభలలోను

(2) పంజాబు మహమ్మదీయులు వైస్రాయిసభలోను

(3) బెంగాలుసభలో నాటు (planting) సంఘము వీని ప్రతినిధుల నెన్నుకొనదగినంత యెన్నికదారులున్నట్లు కన్పింపలేదు గాన, వారు సర్కారుచే నియోగింపబడుదురు (nominated). కాని యెన్నికసంఘములు కొంతకాలమునకు స్థాపింపబడును.

## వైస్రాయిగారి శాసననిర్మాణకార్య నియమములు.

### కౌన్సిలు సభలు.

(1) కౌన్సిలు సాధారణముగ పగలు పదకొండుగంటలకు సభ చేయవలయును. అధ్యక్షునియొక్క యుత్తర్వులేక సాయంత్రము నాలుగుగంటలు దాటినతరువాత యీసభ నిలిచియుండగూడదు.

(2) ప్రెసిడెంటుగారితోకలసి యీసభ యేడుగురికి మించియుండ గూడదు.

(3) గవర్నరుగారుగాని లేక లెఫ్టినెంటుగవర్నరుగారుగాని, మరియు శాసనసభ్యులును ప్రెసిడెంటుగారెచ్చట కూర్చొనుటకు నియమింతురో యచ్చట కూర్చుందురు. అట్టియుత్తర్వు ననుసరించి శాసనసభ్యులు అధ్యక్షుడుగారి కుడిప్రక్కన యీక్రిందివరుసప్రకారము కూర్చుందురు.

1 నాకు నేయడునా.

2 సాధారణపు శాసనసభ్యులు వారివారి యెక్కువతక్కువల ననుస రించి.

3 మరి యితరశాసనసభ్యులు వారివారి హోదాల ననుసరించి.

(4) సభాధ్యక్షుడు స్వతంత్రించి సభను ఆపుదలచేయుటలో పరిపూర్ణాధికారము గలిగియున్నాడు.

(5) అధ్యక్షుడు సభలో ఆటంకహేతువులను ఆపుదల జేయుటకు పూర్ణాధికారము కలిగియున్నాడు. అందులో వ్యతిరేకాభిప్రాయములను నతిక్రమించి స్వతంత్రింపగలడు.

(6) ఏసభికుడయినను చర్చనాంశములలో దేనినిగూర్చియైనను సభయెదుట స్వాభిప్రాయముల వెలిబుచ్చదలచినయెడల తనయొక్క యాసనమునుండి లేవకుండనే అధ్యక్షునితో ప్రసంగింపవచ్చును.

(7) సభయెదుట చర్చనాంశములనుగూర్చి విచారించునపుడు ప్రథమమున ప్రథమవక్త తనవుపన్యాసమును ముగించినతోడనే సభికులెవరయిన తమ యభిప్రాయములను తెలియపరచదలచినయెడలను అధ్యక్షుని వామభాగమునుంచి వరుసగ సభికులు తమతమ యభిప్రాయములను జెప్పవచ్చును. అట్లు సభికులందరు ప్రసంగించినపిమ్మట ప్రథమోపన్యాసకుడు తిరిగి యుత్తరవాదము చేయవచ్చును ఇంకా యితరసభికులెవరయినను తిరిగి మాట్లాడదలచినయెడల అధ్యక్షునియనుమతిబొంది యట్లుచేయవచ్చును. చర్చనాంశమయే బిల్లు (అంగీకారముపొందని శాసనము) యొక్క సవరణనుగూర్చియైనప్పుడు శ్రీ ప్రవేశకర్త యీసవరణకోరిన సభికులయుపన్యాసము ముగిసినతోడనే ఉత్తరవాదము చేయవచ్చును.

(8) వాదనలో సందేహనివర్తిచేసికొనుటకుగాని మరియేయితర సవ్యమయినకారణముచేతగాని యేసభికుడయినను మరియొకసభికునితోనయినను వు

త్తర ప్రత్యుత్తరములు లేక సంభాషణలు చేయదలంచినప్పుడు అట్టిసంభాషణ గాని అట్టి ప్రత్యుత్తరముగాని అధ్యక్షునిద్వార జరుగవలెను.

(9) యేసభికుడయినను ఆంగ్లేయభాషలో తనయభిప్రాయములను తెలియపరచవలసినప్పుడును, ఆభాషలో మాట్లాడుటకసమర్థతగలిగినప్పుడును అట్టి నేర్పుగల యేయితరసభికునయినను నియోగించి అతనిద్వారా తన యభిప్రాయములను తెలియపరచవచ్చును.

(10) సభలో నేదయిన శాసననిర్మాణవిషయమై సంపూర్ణమయిన సభాభిప్రాయముగలిగిన తీర్మానము చేయవలసినప్పుడు అధ్యక్షుడు సభికులకు తెలియపరచి విశేషసభికుల యేకాభిప్రాయమును సరళముగ తీర్మానించవలయును.

(11) ఏసభికుడయినను బిల్లుకుసంబంధించిన యేకాగితమునయినను, జర్నలునయినను కౌన్సిలుసభలో నడుగవచ్చును. అధ్యక్షుడు అప్పుడేగాని లేక ఆసమయమునకు తరువాతజరుగబోవు సభయందుగాని సదరు అడుగబడిన కాగితములను లేక జర్నలును యిచ్చుటకు తీర్మానించుకొనవచ్చును.

(12) కౌన్సిలుసభలోజరిగిన బిల్లువిషయము దేనినయినను గవర్నరుజనరల్ పేరగాని, సెక్రటరిగారి కొక వుత్తరముద్వారాగాని కార్యదర్శిగారికి వ్రాయవచ్చును. ఇట్లుపంపినదానికి సాధారణముగ ప్రత్యుత్తరములివ్వబడవు. ఫోర్టువిల్లియంలోనుండు హైకోర్టువిషయములోదప్ప లోకల్ గవర్నమెంటు ద్వారాపంపబడవు.

(13) 1861 సం॥రపు ఇండియన్ సివిల్ చట్టముల 19 సెక్షన్ సంగతుల ననుసరించి యేదయిన నొకబిల్లును ఆమలులోకిపెట్టుటకు సభికులలో నెవరయినను కోరినయెడల సదరు బిల్లుయొక్క హోదానుగురించియు, తలంలపును గురించియు కార్యదర్శిగారికి ఆఖరుకు మూడుదినముల ముందయినను తెలియపర

చవలయును. అటువంటిఆలోచనజరిగి అంతకుముందు ఆబిల్లు సిద్ధముకానియెడల సదరు సభికునివల్లగాని లేక ఆతనియిష్టానుసారముగ కార్యదర్శివల్లగాని సదరుబిల్లు పూర్తితలంపులతోను, కారణములతోనుసిద్ధముచేయబడవలయును

(14) సెక్రటరిగారు తలంపులతోను, కారణములతోను ఆబిల్లును అచ్చువేయించి ప్రతిసభికుని కొక్కొక్కప్రతిచొప్పున పంపవలెను. సభికులలో నెవరికయినను యింగ్లీషుభాష రానియెడల ఆబిల్లునున్ను, దానితలంపులు, కారణములుదెలుపు పట్టీనిన్ని హిందీభాషలోనికి వారికోరికప్రకారమున్ను వారి యుపయోగార్థమున్ను భాషాంతరము చేయవలయును.

(15) బిల్లు అమలులోకితెచ్చుటకు శెలవు దయచేయబడినతర్వాత యెప్పుడయిన తమకు యేవిధమున తగుననితోచునో యావిధమున సదరు బిల్లును కౌన్సిలుప్రకటన చేయవచ్చును.

(16) ఒకబిల్లు అమలులోపెట్టినప్పుడు గాని తర్వాత నొకానొకసమయమునగాని ఆబిల్లునకు జవాబుదారియగువాడు యీక్రిందివానిలో దేనినయిన నాలోచించి చేయవలయును.

(1) ఒక ప్రత్యేకమయినసభకు (కమిటీకి) ఆబిల్లునుపంపుట.

(2) సభ్యులయభిప్రాయములను బయటకుతీసి తెలిసికొనుటకు దానినందరకు బంపవలయును.

(3) అప్పుడయినను లేక యితరసమయమందయినను, దానిని కౌన్సిలుయొక్క విచారణలోనికి తీసికొనిరావచ్చును.

(17) బిల్లుయొక్కప్రతియు దానితలంపులను కారణములను తెలియజేయుపట్టీని సభికులలో ప్రతివాని కొక్కొక్క కాపిచొప్పున చెందజేయునంతవరకు అటువంటియాలోచనలు యేమి చేయకూడదు. ఆఖరుకు యేడుదినముల ముందయినను సదరు బిల్లుయొక్కవివరములు తనకు అందనియెడల అట్టి

యాలోచనలను ఒకసభికుడు జరుగనివ్వక నాపవచ్చును. సభాధ్యక్షుడు తన యధికారముచేత యీనిబంధనలలో దేనినయినను నిలిపిపెట్టి సదరుతలంపులను నెరవేర్చుట కుత్తరువిచ్చినగాని సదరుఆక్షేపణ నివారింపబడదు.

(18) అట్టితలంపు యేదినముననయితే పుట్టినదో ఆదినమునగాని లేక వాదించుకొనుట కేర్పాటుచేయబడిన కొన్నిదినముల తర్వాతిదినమునగాని బిల్లుయొక్క మూలసూత్రమును దానియందలి యితరవిషయములను చర్చించుకొనవచ్చును.

(19) పదహారవసూత్రమున కనుపరుపబడినట్లు యేదయినయొకతలంపు తీర్మానింపబడినయెడలను 15 వ సూత్రముప్రకారము తమకు ముందు ప్రకటింపబడకుండినయెడల తలంపులతోను, కారణములతోను కూడియున్న పట్టీతో సహా సదరుబిల్లు ఇండియాయొక్క గెజటీలో ఇంగ్లీషుభాషయందు జేర్పబడవలయును. ఆంతకుముందు ప్రకటింపబడకయుండినయెడల సదరుబిల్లునకు సంబంధించిన సభ లన్నిటికి తెలియపరుచునిమిత్తమై బిల్లు తలంపులను కారణములను తెలియజేయుపట్టీయు కౌన్సిలుకిష్టమయిన యుద్యోగసంబంధమయిన గెజటీలలోను, మరియు కౌన్సిలుకిష్టమయిన దేశభాషలలోను, ప్రకటింపబడవలయును. కార్యమునిమిత్తము కౌన్సిలుసభ అట్టితలంపును అమలులోకి తెచ్చిన సభయందు త్తర్వునిచ్చును. అప్పటినుండిప్పటివరకును యేసభికునికయినను గలిగిన యట్టితలంపు కొట్టివేయబడును.

(20) తనకు తగినదని తోచినయెడలను, తనకిష్టమయిన గెజటీలలోను భాషలలోను, బిల్లు నమలులోకి దెచ్చుటకు శలవుకోరబడనప్పటికిని, దానితలంపులు, కారణములతోకూడిన పట్టీతోసహా బిల్లును ప్రకటించుటకు గవర్నరు జనరల్ గారు త్తరువుయివ్వవచ్చును.

ఇట్టివిషయములలో బిల్లు నమలులోకి తెచ్చుటకు శలవడుగుటనవసరమై యున్నది. అటుతర్వాత బిల్లు నమలులోకి తెచ్చినయెడల దానిని ప్రకటింపవలసిన యవసరములేదు.

## ప్రత్యేకమయిన కమిటీలు.

శాసనసభ్యుడు ప్రతిప్రత్యేకమయినసభలో సభికుడుగానుండును. ప్రతిసభయొక్క యితరసభ్యులు బిల్లు తమకు పంపబడినప్పుడుగాని తర్వాతజరుగు సభయందుగాని కౌన్సిలువల్ల పేరుల బొందుదురు. శాసనసభ్యుడుగాని అతను లేనికాలములో బిల్లుయధీన మెవరితోనుండునో ఆయన సభకు అధ్యక్షుడుగా నుండును. మరియు ఓటులసంఖ్య సరిసమానముగ నున్నప్పుడు అధ్యక్షునికి మరియొకఓటు యివ్వబడును.

(21) ఇండియాగెజటీలో బిల్లు ప్రచురింపబడినతర్వాత యేప్రత్యేకసభకు యీబిల్లునుపంపుదురో ఆసభ ఒకరిపోర్టును జేయును. ఇండియాగెజటీలో మొదట ప్రకటింపబడినతేదినుండి మూడు నెలలలోపు అట్టిరిపోర్టు చేయబడును. కాని కౌన్సిలు త్వరగా రిపోర్టుచేయవలయునని యుత్తర్విచ్చినయెడల త్వరగా రిపోర్టుచేయబడును.

ద్వితీయప్రకటనబొందవలసినంతగా సభవారితీర్పులలో ఆబిల్లు మార్చబడినయెడల, ఆబిల్లుయొక్క మార్పుచేయబడిన యొకప్రతిని కార్యదర్శిగారు ఆబిల్లుకుసంబంధించిన సెక్రటరి (కార్యదర్శి) గారికిపంపును. ఒకగెజిటీకంటె నెక్కువగెజిటీలలోను, నొకభాషకంటె నెక్కువభాషలలోను ప్రకటింపబడవలెనని మొదట యీసూత్రములవల్లను లేక కౌన్సిలువల్ల నుత్తరువుబొందబడిన బిల్లును సభవారు తిరిగిప్రకటించుటకు సిఫార్సుచేసినపుడు అవి యటువంటి ప్రతిగెజిటీలోను, ప్రతిభాషలోను తిరిగి ప్రచురింపబడుటకు చేసిన సిఫార్సునంగీకరించబడును. ఆబిల్లును తిరిగి యట్టిభాషలలో ప్రకటనజేయుటనవసరమని సభవారికి తోచినయెడల వారు వారి రిపోర్టులలో వారికిగలిగిన తలంపులకు తగుకారణములను వ్రాయుదురు.

(22) ప్రత్యేకమయినసభయొక్క ప్రతిరిపోర్టు సెక్రటరీగా రచ్చువేయించి దానిని ప్రతిసభికుని కొక్కొక్క కాపిచొప్పునపంపవలెను. మరియు

రిపోర్టునున్ను, సవరింపబడిన బిల్లునున్ను, ఇండియా గెజటీలో ప్రకటించుట వారిపనియైయున్నది. అసభికులలో నెవ్వరికయినను ఇంగ్లీషు రానియెడలనున్ను సెక్రటరిగారు ప్రార్థింపబడినయెడలనున్ను సదరురిపోర్టును హిందూస్థానిభాషకు అతనియుపయోగార్థము భాషాంతరము జేయవలయును.

(23) ప్రత్యేకసభవారియొక్క బిల్లుమీదిరిపోర్టు, బిల్లు యెవరియాధీనమందున్నదో యాసభికునివల్ల కౌన్సిలుకు యివ్వబడును. మరియు నది తగినంత యనుకూలకాలములో కౌన్సిలువల్ల విచారణచేయబడును. అయితే యేసభికుడయినను తనకు సదరురిపోర్టు వారములోపల బొందియుండనప్పుడు, అట్లుసదరు విచారణజరుగకుండ అడ్డు పెట్టవచ్చును. ప్రెసిడెంటు తన యధికారముచే పైసూత్రములలో దేనినయినను తీసివేసి రిపోర్టు విచారణలోనికి తీసికొనుట కనుజ్ఞయిచ్చిననేతప్ప సదరు ఆక్షేపణ నివారణకాజాలదు.

(24) కౌన్సిలువల్ల ఒకబిల్లు విచారణలోకి తీసికొనబడినప్పుడు ఏసభికుడయినను దానిని దిద్దునట్లు కోరవచ్చును.

(25) బిల్లు విచారణచేయుటకుగాను కౌన్సిలుసభజరుగుటకు ఆఖరుకు మూడు దినములు ముందయినను అట్టి దిద్దుటనుగురించి కార్యదర్శిగారికి తెలియబర్చకపోయినయెడల యేసభికుడయినను బిల్లును దిద్దుట నాక్షేపించవచ్చును. కాని ప్రెసిడెంటు యీసూత్రములలో దేనినయినను నిలిపిపెట్టి దిద్దుటకు యనుజ్ఞయిచ్చిననేదప్ప యట్టియాక్షేపణ నివారింపబడదు. దిద్దుబాటుజరుగ ప్రతి నోటీసున్ను కాలముండినయెడల కార్యదర్శిగారు అచ్చువేయించి ప్రతిసభికుని కొక్కొక్క ప్రతిచొప్పున పంపవలయును. ఏసభికునికయినను ఇంగ్లీషు భాషతో పరిచయములేనియెడల అతని యుపయోగార్థము కార్యదర్శి హిందూస్థానీభాషకు దానిని భాషాంతరము చేయవలయును.

(26) కౌన్సిలువల్లగాని లేక ప్రత్యేకసభవారివల్లగాని దిద్దబడిన ఒక బిల్లు తిరిగి ప్రకటింపబడవలయుననిగాని లేక మరల సభలో పెట్టబడవలయు

ననిగాని యేసభికుడయినను కోరవచ్చును. మరియు కౌన్సిలు ఆలాగే వాదము చేసినయెడల ప్రసిడెంటు యాబిల్లును తిరిగి ప్రకటించుటకుగాని లేక తిరిగి సభలోపెట్టుటకుగాని యుత్తర్వివ్వవలయును.

(27) కౌన్సిలువల్ల యొకబిల్లు విచారణనిమిత్తము తీసుకొనబడియే సవరణజేయబడనియెడల సదరుబిల్లును తత్క్షణమే అమలులోకి తీసికొనిరావచ్చును. ఏదయినను సవరణజేసినను ఆసభయందు యేసభికుడయినను బిల్లును అమలుజేయుటకు అటంకపెట్టినయెడలనున్ను ప్రసిడెంటు తనకుగల యధికారము చేత యీసూత్రములలో దేనినయినను నిలిపిపెట్టి బిల్లు నమలుపర్చుట కుత్తర్విచ్చినగాని సదరు ఆటంకముపోయి బిల్లు యమలులోకి తేబడదు. ఎప్పుడయితే ఆటంకముగలిగినదో దానికితదుపరి జరుగుసభయందు బిల్లు విచారణజరుపబడి యేవిధమయిన సవరణజరుగకయే బిల్లు నమలుపరచబడును.

బిల్లులను అమలులోకితెచ్చుటయు, చట్టములప్రచురించుటయు.

ఒకబిల్లంగీకరింపబడినప్పుడు అధ్యక్షుడు దస్కతుచేయవలయును. వైస్రాయిగారు దాని నంగీకరించినయెడల యది చట్టమై గెజటీలో ప్రచురింపబడును. సభకు రెండుదినములముందు కార్యదర్శి ఆసభలోజరుగబడు ప్రసంగవిషయముల జాబితాను సభ్యులకు బంపవలయును. జాబితాలో లేనివిషయములు సభలో జర్చింపబడకూడదు. కార్యదర్శి ఆసభలోజరుగు ప్రసంగములన్నింటిని గ్రంథములో వ్రాయవలయును. అధ్యక్షునిదస్కతుగూడ బొందవలయును

కార్యదర్శిపనులు

(1) సర్కారుచేత ప్రవేశమునొందు బిల్లులను వ్రాయుట, వాని ముఖ్యోద్దేశములను, వానిపై సభ్యులుచేసిన రిపోర్ట్లుజూపుట.

(2) గవర్నర్ జనరల్ గారిచేత నంగీకరింపబడిన బిల్లుల కాపీలను జాగ్రత్తపెట్టుట. సభావిషయికగ్రంథములను భద్రపరచుట.

(3) సభలో జరుగు చర్చనాంశముల జాబితాను తయారుచేయుట.

(4) అచ్చువేయవలసినవిషయముల నచ్చువేయించుట.

(5) యితరవ్యవహారములను జరుపుట.

సభ్యులుగానివారు అధ్యక్షుని అనుజ్ఞవడసి సభాప్రసంగములను విన వచ్చును.

## రాజధాని ప్రభుత్వములు.

ఇండియాదేశము వేరువేరు స్థానికభాగములుగ విభజింపబడినది. వీనిని రాజధానులందురు. కొన్నిరాజధానులపై గవర్నర్లును, మరికొన్నిటిపై లెఫ్టినెంటుగవర్నర్లును, మరికొన్నిటిపైన ప్రధానకమీషనర్లును చివరయధికారులుగ నుందురు. ఇప్పుడీపాలకు లందరకు కార్యనిర్వాహకమునందు సహాయపు ప్రయోగాంగము లుండవచ్చునని చట్టమున్నది; కాని బొంబాయి, చెన్న రాజధానులకే ప్రయోగాంగపు సభలు (Executive Councils) గలవు. వైస్రాయి కార్యనిర్వాహపు సభ్యులకు యవసరమగునట్టి లక్షణములే రాజధానిసభ్యులకును యవసరము; కాని సభ్యుల సంఖ్యమాత్రము తక్కువ; నలుగురికంటె మించకూడదు; మరియు వీరు 12 సం॥లు యుద్యోగములో నుండవలెను.

## శాసననిర్మాణసభలు.

మద్రాసుసభనుమాత్ర మిచట విపులముగ వివరించుటకు వీలుగలదు.

| | | |
|---|---|---|
| ప్రయోగాంగపుసభనుండి సభ్యులు | ... | 2 |
| అడ్వకేటుజనరలు (ప్రధానసర్కారువకీలు) | ... | 1 |

తరువాయి-

1. నియోగింపబడినవారు (16 కంటె సర్కారుయుద్యోగులుగ నుండకూడదు; ఒకడు యుండియును వర్తకపుసంఘముతరపున నుండవలెను) ... ... 23

2. ఎన్నికొనబడినవారు (19)

| | | |
|---|---|---|
| (1) మద్రాసు కార్పొరేషను | ... | 1 |
| (2) మ్యున్సిపాలిటీలు- జిల్లాబోర్డులు- తాలూకాబోర్డులు | | 8 |
| (3) మద్రాసు సర్వకళాశాల | ... | 1 |
| (4) జమీందారులు | ... | 2 |
| (5) జమీందారులు కాని భూస్వాములు | ... | 2 |
| (6) మహమ్మదీయులు | ... | 2 |
| (7) మద్రాసు వర్తకసంఘము | ... | 1 |
| (8) మద్రాసు చేంబర్ ఆఫ్ కామర్సు (Chamber of Commerce) | | 1 |
| (9) నాటుసంఘము (Planting Community) | | 1 |
| మొత్తము | | 47 |

మద్రాసు చట్టనిర్మాణసభలో 19 మంది సభ్యులెన్నుకొనబడుదురు. వారినెన్నుకొనుటకు తొమ్మిది (9) యెన్నికకూటము లేర్పడినవి. అవి:—

| | | సభ్యులసంఖ్య. |
|---|---|---|
| (1) మద్రాసుకార్పరేషను (మ్యూనిసిపాలిటి) | ... | 1 |
| (2) మద్రాసువిశ్వవిద్యాలయము (University) | ... | 1 |

(3) ఈక్రిందనుదహరించిన జిల్లాలలోని జిల్లా, మ్యున్సిపల్, తాలూకాబోర్డులు:—అర్థులు యీయీసంఘములలోసభ్యులై యుందురు.

| | | | |
|---|---|---|---|
| i | గంజాము విశాఖపట్టణపుజిల్లాలు | ... | 1 |
| ii | గోదావరి, క్రిష్ణా, గుంటూరు జిల్లాలు | ... | 1 |
| iii | నెల్లూరు, చెంగల్పట్టు, ఉత్తరార్కాటు | .. | 1 |
| iv | కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం | ... | 1 |
| v | సేలం, కోయంబుత్తూరు, నీలగిరులు | ... | 1 |
| vi | దక్షిణకనరా, మలబారు | ... | 1 |
| vii | తంజావూరు, దక్షిణఆర్కాటు, తిరుచునాపల్లి | | 1 |
| viii | మధుర, తిన్నవేలి | ... | 1 |

(4) ఈక్రిందజిల్లాకూటములలోనిజమీాదారులు 2 సభ్యులనెన్నుకొందురు.

ప్రథమకూటము:— గంజాము, విశాఖపట్టణము, గోదావరి, క్రిష్ణా, గుంటూరు, నెల్లూరు, ఉత్తరార్కాటు, కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపూరు. ... ... 1

ద్వితీయకూటము:— మద్రాసు, చెంగల్పట్టు, సేలము, కోయంబుత్తూరు, దక్షిణకనరా, మలబారు, నీలగిర్లు, దక్షిణఆర్కాటు, తంజావూరు, తిరుచునాపల్లి, మధురా, తిన్నెవల్లి. ... 1

(5) జమీాందారులుగాని భూస్వాములు.

ప్రథమకూటము<br>ద్వితీయకూటము } (4) ఐటములో జెప్పిన జిల్లాతరగతులు 2

(6) మహామ్మదీయులు.

ప్రథమకూటము } (4) ఐటములో జెప్పినట్లు 2
ద్వితీయకూటము

(7) మద్రాసు వర్తకసంఘము (Chamber of Commerce) 1

(8) మద్రాసు ట్రేడ్సు సంఘము ... 1

(9) నాటుసంఘము (Planting Community) ... 1

ఋజుచేయునుద్యోగి:— ప్రతిడివిజనుయొక్క రివిన్యూయుద్యోగి.
(అనగా డిప్యూటికలెక్టరు)
మద్రాసుజిల్లాలో డిప్యూటికలెక్టరు.

రిటర్నింగుయుద్యోగులు:— మ్యునిసిపల్, జిల్లా, తాలూకాబోర్డుల కొరకు.

1. (1) గంజాం, విశాఖపట్టణమునకు- విశాఖపట్టణపు కలెక్టరు.

(2) గోదావరి, క్రిష్ణా, గుంటూరునకు- క్రిష్ణా ,,

(3) నెల్లూరు, చెంగల్పట్టు, ఉత్తరఆర్కాటు-చెంగల్పట్టుకలెక్టరు.

(4) కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం- అనంతపురం ,,

(5) సేలము, కోయంబుత్తూరు, నీలగిర్లు- సేలము కలెక్టరు.

(6) దక్షిణకనరా, మలబారు- మలబారు ,,

(7) తంజావూరు, దక్షిణఆర్కాటు, తిరుచునాపల్లి తంజావూరు కలెక్టరు.

(8) మధుర, తిన్నెవల్లి- మధురకలెక్టరు,

2. జమీందారులు, భూస్వాములు, మహమ్మదీయులకొరకు గవర్నమెంటు కార్యదర్శి- గుంటూరుకలెక్టరును ప్రథమకూటమునకును, తిరుచినాపల్లి కలెక్టరును ద్వితీయకూటమునకును, నియమించును

16 వ నవంబరున జమీందారులు, భూస్వాములు, మహమ్మదీయుల యెన్నికదారుల పేర్లజాబితా ప్రచురింపబడును.

నామినేషను (నియోగిత) కాగితములు బుజుచేయబడును. తరువాతనవి పరీక్షించబడును. తరువాత వోటింగుకాగితములు జ్యారీచేయబడును. తరువాత వోట్లు రికార్డుచేయబడును. తరువాత డిశంబరు 17, 20, 22, 23, 24 తారీఖుల వేరువేరు యెన్నికకూటములచే నివ్వబడినవోట్లు లెక్కపెట్టబడును.

చెన్నపట్టణములో నెన్నుకొనబడినవారిపేర్లు వార్తాపత్రికలలో ప్రచురింపబడును.

జిల్లాబోర్డులు, మ్యూన్సిపాలిటీలు, తాలూకాబోర్డులచే నెన్నుకొన్నవారిపేర్లు జిల్లాగజిటీలలో ప్రచురింపబడును. జమీందారులలో నెన్నుకొనబడినవారిపేర్లు చెన్నపురి ఇంగ్లీషువార్తాపత్రికలలో ప్రచురింపబడును.

జమీందారులలోగాని, భూస్వాములలోగాని యెన్నికదారుల యర్హత వారి సం॥నకు 3,000 రూపాయలు ఆదాయముగాని, సర్కారువలని పించనగా యుండవలెను. మహమ్మదీయులలో యెన్నికదారుల యర్హత:—(1) సాలునకు భూములపై రూ 500 లు ఆదాయము; (2) రూ 2,000 పైన సాలుకు రాబడిపన్ను కట్టవలెను; (3) మద్రాసు సర్వకళాశాలలోని సభ్యులుగాని, బి. యేలుగాను కావలెను; (4) కొన్ని బిరుదులు కలుగవలెను; (5) గజటులో ప్రచురింపబడిన సర్కారుసేవకొరకు పించనతీసుకొనువారుగ నుండవలెను.

ఎన్నికనియమముల కొన్నిటి నిచట క్లుప్తముగ జెప్పవచ్చును, యెన్ని

కదారులు యిచ్చువోట్లను రుజువుజేయుటకు యొకయుద్యోగియుండును. ప్రతి యెన్నికదారుడు ఒకకాగిత మియ్యబడును. దాని తనకిష్టుడగు అర్థి పేరు వ్రాయును. తరువాత యీకాగితములన్నియు యొక నిర్ధారణయుద్యోగిదగ్గరకు పంపబడును. ఆయన వోట్లను లెక్కబెట్టి జయాపజయములను ప్రచురించును. ఒకప్పుడు ఎన్నికదారులు పేర్లనుసయితము ప్రచురింపును. వోటింగుకాగితములలోని యంశములు సరిగా యుత్తర మివ్వబడనియెడల ఆకాగితములు పనికిరావు.

స్థానికప్రభుత్వము ఎన్నికదారుల జాబితా అర్థుల నియోగపుకాగితములను రుజువు జిల్లామేజస్ట్రీటునకు బంపుట; వోట్లగణనము; నియోగకాగితముల పరీక్ష; మొదలగుకార్యములు జరుగవలసినవిధము, తారీఖులు, కాలములు, స్థలములు మొదలగువానిని ప్రచురింపవలయును.

మద్రాసురాజధానిలో వైస్రాయిసభకు యెన్నికహక్కుగల భూస్వాములసంఖ్య 100; జమీందార్లుగాని భూస్వాములసంఖ్య ఉత్తరకూటములో 159; దక్షిణకూటములో 344.

మద్రాసుసభకు అర్హతగలిగిన జమీందారులసంఖ్య 115; యితరభూస్వాములసంఖ్య 492.

## బడ్జెటునియమములు.

(1) ప్రతిసంవత్సరము యొకనియామకదినమున అర్థికాధికారియగు సభ్యుడు బడ్జెటుపట్టీని తగువ్యాఖ్యానముతో కవున్సిలున కప్పగించవలయును. మరియు ప్రతిసభ్యునకు ఆబడ్జెటుయొక్క ప్రతి యివ్వవలయును. ఆరోజున మాత్రము బడ్జెటుపై ప్రసంగమేమియు జరుగకూడదు. మరొకదినమున అర్థికాధికారి బడ్జెటునుగూర్చి సభ్యులకు సవిస్తరముగ చెప్పి కారణ యుపకారణములను దెలిపి పన్నులలోగాని, ఋణములలోగాని, స్థానికప్రభుత్వమునకిచ్చు గ్రాంటు (Grant) లోగాని మార్పులవిషయమై తీర్మానమునూచింపవచ్చును.

(2) తరువాత సభ్యులు ఆర్థికపట్టీయందున్న హంశము లన్నిటిపై వేఱువేఱుగా ప్రసంగించి తీర్మానములు జేయవచ్చును. కాని శాసననిర్మాణ సభకు హక్కుగలవిషయములనే ప్రసంగింపవలసియుండును.

## తీర్మానములు.

(1) ప్రతితీర్మానమును గవర్నర్ జనరలుకు సలహారూపమున నుండవల యును. మరియు దానిలో స్పష్టమగు సారాంశముండవలయును; వాదములు యూహలు, అపకీర్తి నిదెల్పు వాక్యములు హాస్యాస్పదములు యుద్యోగుల ప్రవర్తనవిషయమయిన వాక్యము లుండగూడదు. ఆర్థికపట్టిలోనుండు లె క్కలను రుజువుచేయమని యడగకూడదు. రెండుదినములు ముందు నోటీసు యిచ్చి తాను సూచింపబోవు తీర్మానమును సభ్యుడు యివ్వవలయును. అధ్య క్షుడు దానిని కారణమునుజూపకయే నిరాకరించవచ్చును. ఆనిరాకరణమును సభలో చర్చించగూడదు. సూచన అయినతరువాత యితరసభ్యులు దానిని గూర్చి ప్రసంగింపవచ్చును. కాని యేయుపన్యాసమును అధ్యక్షుని యనుమతి లేక 15 నిమిషములకన్న జరుగకూడదు. ప్రసంగములన్నియు తీర్మానాంశ ములనుగూర్చియే నుండవలెను. తగుప్రసంగమయినతర్వాత అధ్యక్షుడు సూచ నకారియగు సభ్యుని ప్రత్యుత్తరమివ్వమని యాజ్ఞాపింపవచ్చును. ప్రతిప్రశ్న యు ఔను, కాదని నిశ్చయింపబడవలయును.

ప్రతిసంవత్సరము మార్చి 24 వ తేదీన బడ్జటుచివరరూపమున సభయ దు టుంచబడవలయును. అప్పుడు సభ్యులు దానినిగూర్చి ప్రసంగింపవచ్చును కాని తీర్మానములుచేయుటకుగాని ఓటునిచ్చుటకునాని వీలులేదు. అధ్యక్షుడు తగుకారణము లున్నచో పైనియమములను త్రోసివేయవచ్చును.

| ఆదాయము. | | వ్రయము. | |
|---|---|---|---|
| ప్రసంగనీయాంశములు | ప్రసంగనీయములు కాని యంశములు. | ప్రసంగనీయాంశములు. | ప్రసంగనీయములు కానివి. |
| 1 భూశిస్తు- | 4 స్టాంపులు- | 1 రిఫండ్లు, లోపములు- | 2 అసైన్మెంట్లు, ప్రతిఫల |
| 2 నల్లమందు- | 7 మహాసూలు | 3 భూమిపన్ను- | ములు- |
| 3 ఉప్పు- | (పదేశవర్తకపుపన్నులు) | 4 నల్లమందు- | 13 ఋణముపై వడ్డీ- |
| 5 స్వదేశవర్తకపు పన్నులు | 8 పన్నులు- | 5 ఉప్పు- | 23 మతపీఠస్థలవిషయములు- |
| | 9 కప్పములు | 6 స్టాంపులు- | 25 రాజకవిషయములు- |
| 6 రాజధాని రేట్లు- | 16 (ఎ) న్యాయస్థానపు ఫీజు | 7 దేశవర్తకపుపన్నులు- | 27 స్థానిక రాజకపించనలు |
| 9 అడవి- | లు, జగిమానాలు- | 8 రాజధాని రేట్లు- | 38 రాష్ట్రపురెయిల్వేలు- |
| 10 రిజస్ట్రేషను- | 32 భూసేన- | 9 మహాసూలు- | 42 పెద్దపనులు, ఋణపువడ్డీ |
| 12 వడ్డీ- | 33 నావిక సేన- | 10 పన్నులు- | 46 భూసేన- |
| 13 టపాలకచ్చేరి- | 34 యుద్ధపుపనులు కేవలము | 11 అడవి- | 46 (ఎ) నావిక సేన- |
| 14 టెలిగ్రాఫు- | రాజధాని రాజ స్వవిష | 12 రిజస్ట్రేషను- | 47 యుద్ధపుపనులు- |
| 15 టంకసాల- | యములు- | 14 వడ్డీ- | 47 (ఎ) ప్రత్యేకపురక్షణకా |
| 16 (ఎ) చెఱసాల- | | 15 టపాలకచ్చేరి- | ర్యములు- |
| 17 పోలీసు- | | 16 టెలిగ్రాఫు- | అన్ని చట్టాధికారముగల ఖ |
| 19 విద్య- | | 17 టంకసాల- | ర్చులు కేవలము రాజధానిప్ర |

21 శాస్త్రీయ మరియు నిత రాంగములు-
22 ఉద్యోగులు పింఛను బుచ్చుకొనుటవలన వచ్చినది
23 స్టేషనరీ ముద్రణ-
24 మారకము-
25 చిల్లర-
26 రాష్ట్రపురెయిల్వేలు-
28 సర్కారు సహాయము నొందు కంపెనీలు-
29 నీటిపారుదల (పెద్ద) పన్నులు-
30 చిల్లరపనులుజలయానము
31 లౌకికపుపనులు-

18 పాలనకార్యములు-
19(ఎ)శాసననిర్ణయాంశము
(బి) చెరసాల-
20 పోలీసు-
22 విద్య-
24 విషయములు-
26 శాస్త్రీయ మరియు నిత రాంగములు
28 సివిల్ సెలవు, భత్యములు
29 పింఛనలు భత్యములు
30 స్టేషనరీ; ముద్రణ-
31 మారకము-
32 చిల్లరవిషయములు-
33 కరువుసహాయము-
34 రక్షణరెయిల్వేనిర్మాణము
35 రక్షణనీటిపారుదల పనులు-
36 ఋణముతీర్చుట-
37 సహాయమునొందిన కంపెనీలు-

యములు.

| | |
|---|---|
| 41 | చిల్లర, రెయిల్వేవ్యయము |
| 42 | నీటిపారుదల, కట్టడపు ఖర్చులు- |
| 43 | చిల్లరపనులు, జలయానము- |
| 45 | సివిల్పనులు- |
| 48 | రాష్ట్రపు రెయిల్వేలు- |
| 49 | నీటిపారుదలవసతిపనులు మూలధనపు ఖర్చులు- |

## ఏడవ యధ్యాయము.

### ఇండియా రాజ్యప్రకృతి.

పైయధ్యాయములో యిండియానుపాలనజేయు ప్రభుత్వముయొక్క కట్టడమును వివరించి జెప్పితిమి; యిప్పుడు యీరాజ్యప్రకృతియొక్క కొన్ని ప్రధానాంశములను, వాని లోపాలోపములను సూచింప ప్రయత్నింపనగును. ప్రథమమున, యిండియాసామ్రాజ్యముపై చివరప్రభుత్వాధికార మెక్కడనుండును; దాని స్వభావ మెట్టిది?

ప్రభుత్వాధికారమును పరీక్షించుటలో గమనింపవలసిన సంగతులు రెండుగలవు:-శాసనరూపకమయినది; వ్యావహారిక రూపమయినది. శాసనరీత్యా రాజు, ప్రభువులు, ప్రజాప్రతినిధులగు కామనులతోకూడిన బ్రిటిషుపార్లిమెంటు యిండియాయొక్క పాలనాధికారియని జెప్పవచ్చును. ఇండియా ప్రజలయొక్క యోగక్షేమములకు తగునట్లుగా శాసననిర్మాణమొనరింపుటకు పార్లిమెంటునకు అపరిమితమగు యధికారముగలదు. పార్లిమెంటు చట్టములను యిండియాలోని ప్రతియధికారియు, ప్రతివాడును శిరసా వహింపవలెను. ఇట్లుండుట శాసనరీత్యాయయినను, వ్యావహారికమునమాత్రము వేరుగానున్నది. ఒకరాష్ట్రముయొక్క పౌరులు యెవరియాజ్ఞలతుదకు విధేయింతురో, ఆసంఘమే ఆరాష్ట్రములో పరమాధికారియని జెప్పవచ్చును. దీనినిబట్టిచూడ యింగ్లండులోని యెన్నికదారులు చివరయధికారులని జెప్పదగును; ఎందుకన యెన్నికదారుల యభిప్రాయములమీదనే పార్లిమెంటు సభ్యులును, దేశపు జనులును శాసననిర్మాణమునకు యొప్పుకొందురు. మరియు రాజ్యప్రకృతియు యెన్నికదారుల యభిప్రాయము కొనసాగునట్లు నేర్పాటుగలిగియున్నది. ఇట్లు జరుగుట యింగ్లీషు రాజక వ్యవహారములయందు మాత్రమే సంభవించును; యిండియా ప్రభుత్వవిషయముననన్ననో, యిండియాజనుల యభిప్రాయములుగాని, లేక యింగ్లండుజనుల యభిప్రాయములు గాని ప్రాభవము గలిగియుం

డవు; ఎందుకనగా యింగ్లీషుప్రజలు యిండియాపాలన విషయమయి శ్రద్ధవహించుటయరుదు. మరియు యిండియా పయియధికారము త్రివిధములు యుత్పన్నమయినది:-(1) పార్లిమెంటు యధికారమువలన బుట్టిన శక్తులు; (2) యీస్టుయిండియా కంపెనీనుండి వచ్చినవి; (3) మొగలు చక్రవర్తిమొదలగు ప్రాచీనపాలకులనుండి పరంపరవచ్చిన యధికారములు. పై మూడువిధములగు యధికారములనుండి, ప్రస్తుతమున రాజకయధికార మనుభవింపుచున్న రెండు రాజ్యాంగములుగలవు. శాసనరీత్యా బ్రిటిషు పార్లిమెంటు చివరయధికారి; వ్యావహారికముగజూచిన రాజుయొక్క మంత్రులు చివరయధికారులు. ఇండియాకార్యదర్శి, యిండియాకౌన్సిలుయొక్క సహాయముతో యీస్టుయిండియా కంపెనీ, పార్లిమెంటులవలన యుత్పన్నములగు యధికారములను చెలాయించుచున్నాడు. ప్రాచీనకాలమున యిండియా పైరాజ్యముజేసిన పాలకులనుండి వచ్చిన రాజభాగం (King's share of land produce) మొదలగు యధికారములను కౌన్సిలుతోకూడిన వయిస్రాయి యనుభవింపు చున్నాడు, కనుక బ్రిటిషు పార్లిమెంటు యిండియాప్రభుత్వముపయి పూర్ణమయిన యధికారికాదని యూహజేయవచ్చును. అయినను యిండియా ప్రభుత్వముపయి పార్లిమెంటునకుగల యధికారమును నాలుగురూపములని నిచ్చటనిర్ణయింపవచ్చును.

(1) ఇండియా సేవకొరకు కావలసిన ధనమునంతయు కామన్సుసంఘమునకు యిండియా కార్యదర్శియు, అతనిసభయు దెలియపరుపవలయును; మరియు యిండియారాజ్యఋణమును ప్రజాసంఘము సమ్మతములేక వృద్ధిజేయకూడదు.

(2) ఇండియను బడ్జెటులోని ప్రతిసంవత్సరము ప్రజాసంఘముయెదుట మార్పుల జెప్పవలయును. ప్రజాప్రతినిధులు వార్తలనడుగుటకును, యిండియా విషయమయి ప్రభుత్వముయొక్క రాజ్యతంత్రమును విమర్శింపుమనుటకును హ

కు గలిగియున్నారు; యిండియారాజస్వమును మార్పుటకుగాను వోట్లుతీసి
కొనబడవు; కాని రాబోవు సంవత్సరమునకు ఆదాయవ్యయముల మామూలగు
తీర్మానములు జేయబడును.

(3) పార్లిమెంటు పక్షముల రెంటిసమ్మతములులేక, యిండియాకు
జెందుధనము, యిండియాకార్యములకొరకు దప్ప, విదేశములలో జేయబడు
యుద్ధపుఖర్చులు భర్తీకొరకు వినియోగము నొందకూడదు.

(4) **1909** సం॥లోని యిండియాకౌన్సిలు ఆక్టుప్రకారము జేయబడుప్ర
కటనలు, నియమములు, సూత్రములు మొదలగునవి పార్లిమెంటు సంఘము
లయెదుట నుంచబడవలయును.

కాని యిండియాకార్యదర్శి జీతము యిండియను ఖర్చులమీదనుంచుట
వలన పార్లిమెంటునకుకార్యదర్శిజవాబుదారి చాలవరకుతగ్గిసర్వస్వాతంత్ర్య
దగుటకు చోటు కలుగజేసెను.

## యిండియా కార్యదర్శియొక్క సంస్థానిక స్థితి.

వలసరాష్ట్రములపయి రాజుతన యంతరంగ సభతోకూడి, లౌకిక, యు
ద్ధవ్యవహారములను తనంతటతాను చక్కబెట్టుటకును, నిర్ణయించుటకును య
ధికారముగలదు; కాని యిండియా పయియధికారముమాత్రము ప్రత్యేకములగు
కొన్ని రాజ్యాంగములద్వార (అనగా యిండియాకౌన్సిలు ద్వార) చెలాయిం
చువాడగును; యీస్టుయిండియా కంపెనీనుండి ప్రస్తుతపు ప్రభుత్వము పుట్టినది
గాన, యిండియాపాలన కార్యము చక్రవర్తికిబోయినప్పుడు, కంపెనీయొక్క
డయిరక్టర్ల సంఘము రాజునకు సహాయార్థము వినియోగపడెను. రాజు
నకు సామ్రాజ్యకార్యముల సహాయము జేయునది ప్రివీకౌన్సిలు; యిండియా వి
షయముల సహాయముజేయు యంగము, ప్రివీకౌన్సిలు (అనగా ప్రివీకౌన్సిలులో

ని సభ్యుడగు యిండియా సెక్రటరీ) మరియు యిండియా కౌన్సిలు అయి యున్నవి.

కనుక యిండియా కార్యదర్శి క్యాబినేటులో సదా యొక సభ్యుడు గానుండును; కాన ప్రయోగాంగమగు క్యాబినేటు యిండియాపాలనపయి చివరయధికారిగాయియున్నది. అయినను యిండియాకార్యదర్శియొక్క సంస్థానిక (Constitutional) స్థితి, సామ్రాజ్యముయొక్క యితర కార్యదర్శులు స్థితులకంటె కొంత భిన్నమయినది.

ఎందుకనగ యిండియాపాలన విషయములన్నిటికిని పార్లిమెంటునకు ఆయన జవాబుదారికాడు; యిండియాకవున్సిలుయొక్కయనుమతిలేక కార్యదర్శివ్యవహరింపలేడు; అనగా యిండియాయొక్క ఆర్థికవిషయముల యిండియా సభయంగీకరింపవలయును; కార్యదర్శికి పూర్ణస్వతంత్రములేదు; కాని యిండియసభసభ్యులు పార్లిమెంటు సభ్యులుకాదుగాన ప్రజాప్రతినిధులకు యిండియాకార్యములపయి కొంతవర కధికారములేదు; అయినను విదేశయుద్ధములకు గాను యిండియారాజ్యస్వమును పార్లిమెంటు యంగీకారములేక, యిండియా సభగాని, కార్యదర్శిగాని వెచ్చింపకూడదు; కాని యిట్లు జరుగుట బహుసకృతు. ఇండియా ఆర్థిక విషయముల పార్లిమెంటునకు యధికారములేదనే జెప్పవచ్చును. 1869 సం॥లో యీహాంశము ప్రస్తాపనకు వచ్చెను; యిండియా కవున్సిలు పార్లిమెంటు ప్రతినిధిగానుండి, కార్యదర్శితనయధికారమును దుర్వినియోగము జేయకుండ, పార్లిమెంటు తరఫున యతని చర్యల పరీక్షించునట్లు యేర్పరుపబడినదని స్థాపింపబడెను. కాని యనుభవములో మాత్రము, యిండియా కవున్సిలునకు కార్యదర్శిపై నిజమయిన యధికారములేదు; ఎందుకన బ్రిటిషుసామ్రాజ్యకార్యములన్నిటియందును క్యాబినెటుమాటే జెల్లును; యిండియా కార్యదర్శియు క్యాబినెటులోని సభ్యుడుగాన తుదకు, ముఖ్యముగా సామ్రాజ్యవిషయముల ఆయన మాటయే చెల్లును. క్యాబినేటు చెప్పి

నరీతిగనె యిండియా సభ్యులును, కార్యదర్శియు విధేయులయియుండవలెను;
యిదివరకు యిటులనే జరిగినది; యిండియా కవున్సిలునకు యిష్టములేకయే,
యిండియా ధనవ్రయకార్యములు జరిగినవి. **1871-74** సం॥లలో సాలిసుబరి
ప్రభువు యిండియా కార్యదర్శిగా నున్నప్పుడు యిది స్థిరపడెను. కార్యదర్శికి
యిష్టమున్నను, లేక పోయినను, అర్థవిషయములందయినను, క్యాబినేటు జె
ప్పినట్లు వినితీరవలయును లేదా రాజీనామా యివ్వవలసి యుండును; మరియు
ప్రజాప్రతినిధి సంఘమునకు (The House of Commons) క్యాబినేటుప
యియిండియాఅర్థికవిషయముల వోటు యిచ్చుటకు హక్కులేదుగాన, క్యాబి
నేటు సర్వస్వాతంత్ర్యము నొంది, యిండియాధనమును సామ్రాజ్యకార్యములకు
న్యాయమయినను, యన్యాయమయినను వెచ్చింపనిష్టపడును, ఎందుకన వారుజ
వాబుదారులు ప్రజాసంఘమునకుకారు. కనుక యిండియాయొక్క అర్థిక
కార్యములు మంచిస్థితియందుండవలెనన, యన్యాయవ్రయములేకుండవలెనన,
ప్రజాపతినిధి సంఘము కాబినేటును, కార్యదర్శియు తమకు ప్రత్యక్షముగ జ
వాబుదారులగునట్లు చట్టముచేయవలయును.

పైజెప్పినదాని నిచ్చట క్లుప్తముగ వ్రాయవచ్చును. ఇండియా ప్రభుత్వ
మును క్రమపరచి, తనిఖీజేసి, శాసించు రాజ్యాంగములు యింగ్లండులోను, యిం
డియాలోను ముఖ్యముగా నాలుగు కలవు; (1) ప్రజాప్రతినిధి సంఘము,
(2) క్యాబినేటు, కార్యదర్శి, (3) యిండియా కౌన్సిలు; (4) వైస్రాయి,
వయిస్రాయిసభ. ఈనాలుగు రాజ్యాంగములలో నేదియు నిరంకుశరాజ్యము
జెందకుండునట్లును, యొకదానినొకటి హద్దుపెట్టునట్లును శాసనమేర్పడినది.
కాని అనుభవములో కార్యదర్శియు, క్యాబినేటుయు సర్వస్వాతంత్ర్యమును
వహించుట తటస్థించుచున్నది. ప్రజాసంఘమునకు యధికారములేదు; యిండి
యా కవున్సిలు కేవలము ఆలోచన (కార్యదర్శియడిగినప్పుడు మాత్రమే) యి
చ్చుటకు హక్కుగలదు; కాని వేరొండు యధికారము దానికిలేదు; వయిస్రా
యికి యధికారములేదు. అన్నియు కార్యదర్శి, ఆయనద్వార క్యాబినేటు జె
ప్పినట్లు జరగితీరవలయును. దీనినే నిరంకుశ ప్రభుత్వమందురు.

## వైస్రాయి - యిండియా ప్రభుత్వము.

పైజెప్పినదానివలన వయిస్రాయి యిండియా కార్యదర్శికి శాసన, ప్రయోగ నిర్ణయకార్యముల ద్వితీయుడయినట్లు స్థిరపడును, యిచ్చట విచారింపబోవు విషయము వయిస్రాయికిగల యధికారముయొక్క పరిమితి యెంతయోదాని నిర్ధారణజేయును. దీని నిర్ధారణజేయుట కష్టతరము. కొంతవరకు సంస్థానిక వాడుకవలన గ్రహింపవచ్చును; కొంతవరకువయిస్రాయియొక్క బుద్ధికుశలతనుబట్టియుండును. 1858 సం॥రం చట్టము ప్రకారము వ్యాఖ్యానముజేసినచో కార్యదర్శి వయిస్రాయిల కుండవలసిన పరస్పర సంస్థానికసంబంధములు తేటపడును. ఇండియా ప్రభుత్వము శాసననిర్మాణ కార్యములన్నిటిలోకెల్ల ప్రవేశయధికారమును గలిగియుండవలెను; లండనులోని యిండియా కౌన్సిలు తనిఖీజేసి సవరణజేయుటకు యధికారము గలిగియుండును; ప్రజాప్రతినిధి సంఘముయొక్క యంగీకారమునకులోనయి, యిండియాకార్యదర్శిశాసనముల రద్దుజేయుటకు యధికారముగలిగియుండును.

1861 సం॥లోని చట్టముకూడనిట్లనే నేర్పాటుజేసెను. కాని 1870 సం॥ యిండియాకార్యదర్శిగానున్న ఆర్గైలుడ్యూకునకును, వైస్రాయ్ యగు మేయో ప్రభువునకు వివాదముగలిగెను; యిండియాప్రభుత్వమువారు కేవలము ప్రయోగాంగమనియు, ఇంగ్లీషుప్రభుత్వముయొక్క శాసనముల ప్రకారము విధేయించుటయే వారివిధియనియు, మరియు సర్కారు సభ్యులందరు అట్లువోటుయిచ్చునట్లు కోరవలయునని స్థాపించెను. 1874 సం॥లో సాలిసుబరీప్రభువు ఇండియా కార్యదర్శికి ఇండియా శాసనముల (veto) రద్దుచేయుటయేగాక, అవి స్థాపనజెందుటకు పూర్వము పరీక్షించి శాసనకార్యమున కనుజ్ఞయిచ్చుటకును, నూతనశాసనముల యిండియాప్రభుత్వమున కిష్టమున్నను లేకపోయినను, ప్రవేశపెట్టుటకును యధికారము గలదని స్థాపించెను. రాజధానుల ప్రభుత్వములలోని శాసనకార్యములను యిండియాకార్యదర్శియనుజ్ఞలేక జరుగకూడదు.

మరియు వైస్రాయికి యిండియాకు సంబంధించిన విదేశకార్యములన్ని
యు ఇంగ్లండులోని క్యాబినెటు యాజ్ఞప్రకారము జరుగవలెను. కనుక ప్ర
యోగకార్యముల సయితము వైస్రాయి యధికారమునకు హద్దుగలదు. ఇండి
యా కార్యదర్శియొక్క యాజ్ఞలను విధేయించుటకు యిష్టములేనిచో తనయు
ద్యోగమునకు రాజీనామాయివ్వవలెను. ఐనను వైస్రాయికి యిండియా యొ
క్క రాజకస్థితిగతులబట్టి ఇండియా ప్రజలపై అపరిమితమగు యధికారము గ
లదు. కార్యదర్శిమభావముగనుండినయెడల వైస్రాయిమంచికిగాని, చెడుగు
నకుగాని నిరంకుశప్రభువయియున్నాడని జెప్పవచ్చును. దీని కంతయు కార
ణము ఇండియనులకు ప్రాతినిధికహక్కు లేకపోవుటయే.

## వైస్రాయి కౌన్సిలు.

వైస్రాయికి పాలనకార్యమునకు సహాయము చేయుటకు యీకవున్సిలు
యేర్పడినది. వైస్రాయిసభాధ్యక్షుడుగనుండును ఒక్కొక్కసభ్యుడుఒ
క్కొకరాజ్యాంగమునకు యధికారియయి వ్యవహరించుచుండును. ఈకవున్సి
లు కేవలము సలహాకొరకేగాక పాలనకార్యముల వైస్రాయినుండి స్వతంత్రము
గ నయినను వ్యవహరించుటకు యధికారముగలదు. ఈసభ్యులకు వ్యతిరేకము
గ నడచుటకు వయిస్రాయికి శాసనరీత్యాహక్కుగలిగినను యిప్పటి దినముల
లో నట్లుజరుగుటలేదు తొలుత యీకవున్సిలును స్థాపించిన వారి ప్రధానోద్దే
శ్యము వయిస్రాయికి సలహాపూర్వకమగు సహాయమొనర్చుటయై యున్నను
ప్రస్తుతమున సభ్యులయనుమతిలేక వయిస్రాయి వారికి ప్రతికూలముగ వ్యవహ
రింపసాహసింపడు. ఈరూపమున కవున్సిలు పద్ధతి ఇంగ్లీషుక్యాబినెట్ పద్ధతిని
కొంతవరకు పోలియుండును. అయినను యీసభ్యులకుగల యధికారము యిం
గ్లీషు రాష్ట్రపుకార్యదర్శికిగల యధికారముకంటె తక్కువగను, మితముగలదిగ
ను నుండును మరియు రాజ్యాంగవిభజన ఇంగ్లండులోవలె సంపూర్ణముగ జరి
గియుండదు. మరియునది వయిస్రాయి యిచ్ఛప్రకారము జరుగుచుండును. వ

యిస్రాయిమాత్రము విదేశవ్యవహారాంగమును తనచేతిలో నుంచుకొనును, ప్రతి సభ్యునకు సహాయ నిమిత్తము వక కార్యదర్శి నియమింపబడును. ఈయనవ్యవహారనిశ్చయముకొరకు తనపైయధికారియొద్ద కాగితములు పెట్టును ఆసభ్యుడు తన యాజ్ఞానుదానిపై వ్రాయును తరువాత వయిస్రాయిదానినిచూచి యంగీకరించనిచో కౌన్సిలందరియెదట బెట్టునట్లు నాజ్ఞనిచ్చును. తర్వాత నావ్యవహారము సభ్యులలో విశేషాభిప్రాయముపై నిర్ధారణ నొందును.

రాజధాని ప్రభుత్వములు.

ఇండియాలో పదమూడు రాజధాని ప్రభుత్వములుగలవు. మద్రాసు, బొంబాయిలకు గవర్నలర్లును, బంగాళా, తూర్పుబంగాళ, అసాము, ఆగ్ర, ఔడు,సంయుక్తరాష్ట్రములు, పంజాబు, బర్మాలకు లెఫ్టినెంటు గవర్నర్లును, మధ్యరాష్ట్రములు, ఆజ్మీర్ మార్ వారా, కూర్గు, బ్రిటీషుబెలుచ్చిస్థాను నార్తువెస్టుఫ్రాన్ టియర్ అనగా వుత్తరపశ్చిమ యెల్లలకు సమీపముననుండు దేశము అండమాను ద్వీపములు వీనికి ప్రధాన కమీషనర్లును యుందురు. మద్రాసు, బొంబాయి గవర్నలర్లకు కార్యనిర్వాహక సభయుండును, లెఫ్టినెంటుగవర్నలర్లకు కార్యనిర్వాహక సభలుండవచ్చునని 1909 సం॥రపు ఇండియాకవున్సిలు చట్టముమవలన స్థాపించబడినది. అందరికంటె గవర్నలర్లకు యెక్కువగను, కమీషనర్లకు తక్కువగను యధికారమర్యాదలు గలవు. కార్యనిర్వాహక సభలును వయిస్రాయి కార్యనిర్వాహక సభవలె నుండును.

జిల్లా ప్రభుత్వము.

జిల్లాప్రభుత్వము కలెక్టరుయాధీనములోనుండును. శిస్తు, నేరముల విచారణ, పోలీసు జయిల్సు, విద్య, రోడ్లు, మ్యునిసిపాలిటీ, ఆసుపత్రులు మొదలగు వ్యవహారములను యాయన జూచుచుండును.

శాసన నిర్మాణపు సభలు.

ఇండియాప్రభుత్వముననుండుశాసననిర్మాణసభలన్నియు, కార్యనిర్వాహక సభలే నూతన సభ్యులయొక్క కూడికచే పెంచబడినవని జెప్పవచ్చును.

వీరందరు కలసి శాసననిర్మాణకార్యము గావింతురు. ఈకౌన్సిలులన్నిటియం దును రెండుతరగతుల సభ్యులుందురు; (1) సర్కారు యుద్యోగులు, (2) సర్కారునకుజెందనివారు. మరియు యీరెండవతరగతి వారిలో కొందరుసర్కారు యొక్క నియోగము (nomination)చేతను, కొందరు ప్రజల యెన్నికచే తను సభ్యతనొందుదురు. ఈయధ్యాయములో యిప్పుడు నూతనముగ నేర్పడిన సభలయందలి కొన్ని లోపములను, ప్రత్యేకలక్షణములను జూపవచ్చును.

(1) వైస్రాయి సభలో సర్కారుయుద్యోగులు విశేషాంశముగానుందురు; యీవిధానమునకు కారణము "సామ్రాజ్యపు పార్లిమెంటునకును, చక్రవర్తి ప్రభుత్వమునకును జూపవలసిన సంస్థానిక విషయలను యిండియా ప్రభుత్వము చెల్లించునట్లు నేర్పాటుచేయుట" అయియున్నది. రాజధాని సభలలో మాత్రము సర్కారు యుద్యోగులు కానివారిసంఖ్యయధికమగునట్లు నేర్పాటయినది; కాని యీవిశేషాంశముయొక్క ప్రమాణముమాత్రము వేఱు వేఱు రాజధానులలో వేరుగానుండును. బెంగాలులో యుద్యోగులు కాని సభ్యులసంఖ్య యితరరాజధానులకంటె నెక్కుడు; మద్రాసులో యన్నిటికంటె తక్కువ, సర్కారు యుద్యోగులు సర్కారు పక్షమునవోటు జేతురు. ఇది ముఖ్యముగాసర్కారుబిల్లులలో జరుగును, మరియు సర్కారుచేత నియోగితులగు యుద్యోగులుకానివారు సయితము సర్కారుపక్షముననే వోటు యిచ్చుట తటస్థింపగలదని యూహజేయుట దోషముగాదు. కనుక శాసన నిర్మాణసభలలో సర్కారుమాటయే యధికముగ కొనసాగగలదు.

(2) సర్కారుచేత నియోగితులగు సభ్యులకు సభ్యతా యోగ్యత లేవియవసరములేనట్లున్నది. ఇంగ్లీషురానివారును, దివాలాకోర్లును, ఖయిదీలోనికిపోయినవారును సభ్యులుగ నియమింపబడవచ్చును.

(3) అనుజ్ఞలయొక్క యోగ్యతాయోగ్యతలను నిర్ణయించు యధికారము ప్రయోగాంగపు యధికారులకివ్వబడినది. ఇదిచాలాహానికరమగునది. న్యాయనిర్ణయాంగములకు యింగ్లండులోవలె యిచ్చినయెడల బాగుండును.

(4) శాసననిర్మాణసభ్యతకు జిల్లా, తాలూకాబోర్డులు, మ్యూనిసిపాలిటీలలోని సభ్యులేయోగ్యులని యుండుటవలన దేశములోనియనేకమందియోగ్యులు శాసన నిర్మాణసభలలోనికి ప్రవేశించుటకు వీలులేకుండును. మ్యూనిసిపాలిటీలలోను, బోర్డులలోను చాలమంది సభ్యులు సర్కారుచేత నియోగము నొందుదురు. మరియుసర్కారు ప్రజానాయకులనియోగించుటయరుదు మరియు నూతన మ్యూనిసిపాలిటీల సభ్యతవిషయమై చేయబడినమార్పులువిద్యాధికులు సభ్యులుగాకుండుటకు మరంతతోడ్పడును; ఎందుకన విద్యాధికులలో ధనవంతులు సాధారణముగ తక్కువగనుందురు.

(5) సభ్యులుకాగోరువారు కొంత ఆస్తిపరులై యుండవలెను; ఇంగ్లీషుపార్లిమెంటుసభ్యులకు యిట్టియోగ్యతయవసరములేదు. శాసననిర్మాణకార్యమునకు వలయుగుణసంపత్తి ధనముకాదు; బుద్ధివిశాలత, గౌరవజీవితము, విద్య, యనుభవములే ప్రధానలక్షణములు; కాని విద్యావంతులలో చాలామంది ధనికులుకారుగాన, సభ్యులుయగుటకు వీలులేదు.

(6) సర్కారుయుద్యోగమునుండి తొలగింపబడినవారు సభ్యులు కాగూడదు. ఈనౌకరీపోవుట యనేకకారణములవలన సంభవించును; రాజద్వేషము, దుర్నీతి, అవిధేయత, పాలుమాలితనము మొదలగుకారణముల వేనికైనను సర్కారుసేవనుండి తొలగింపబడవచ్చును; కాని యిట్టిపురుషులందరు సభ్యులగుటకు వీలుండకపోవుట కడుశోచనీయము.

(7) ఆరునెలలశిక్షగల నేరముమోపబడిన ప్రతివాదును యర్హుడుకాడు. ఇంగ్లండు మొదలగు దేశముల నిట్లులేదు. శిక్ష యనేకకారణములవలన సంభవించును; ఆకారణములు న్యాయములుగావచ్చును; యన్యాయములు గావచ్చును; కనుక శిక్షనుబట్టి యోగ్యతాయోగ్యతలు నిర్ధారణ కాగూడదు.

(8) ఒక మనుష్యుని సర్కారుయుద్యోగులు న్యాయముగానయినను, లేక యన్యాయముగనయినను అనుమానపు నడతగలవాడని వ్రాసినచో వాడు

సభ్యుడుకాగూడదు. ఇది వైవానికంటె గొప్పలోపము.

(9) మతవివక్షతనుబట్టి యెన్నికహక్కు లేర్పాటగుట శాసననిర్మాణ సభలకుగల పెద్దలోపములలో నొకటి. మహమ్మదీయులు యిండియాలోని జనసంఖ్యలో షుమా రయిదవపాలుందురు. కాని వీరిప్రతినిధులు తమ జనసంఖ్యప్రమాణమునుమించి యెక్కువగ నేర్పరుపబడిరి; ఇది మహమ్మదీయులు యల్పాంశములుగానున్న దేశభాగములలోనెకాదు. హిందువులు తక్కువనున్న చోట్లనయితమ వారికెక్కుడు ప్రాతినిధికము లేకుండుటయేగాక, మహమ్మదీయులకు నెక్కుడుగానున్నది. మరియు మహమ్మదీయులు జిల్లాబోర్డులు, మ్యూన్సిపాలిటీలలో సభ్యులుగనున్నచోటుల వోటులివ్వవచ్చును.

శాసననిర్మాణసభలలో ప్రాతినిధికసభ్యులకుగల హక్కులు.

శాసననిర్మాణసభలలో సభ్యులకు యీక్రిందనుదహరించిన హక్కులు గలవు:—

(1) పాలనవిషయముల కొన్నినియమములకు లోనై ప్రశ్నించి ప్రత్యుత్తరములను సంపాదించుట;

(2) దేశీయ, రాజధానుల బడ్జెటులను సవిస్తరముగదెల్పి సభ్యులు కొంత దానిపై తర్కించునట్లు వీలుగలుగజేయుట;

(3) ప్రశ్నలకు యుపప్రశ్నలువేయుట;

(4) సభలలోపెట్టిన ఆర్థికపట్టీలనుగూర్చి తీర్మానములనూచింపుట;

(5) శాసననిర్మాణసభలయందు ప్రజావిషయముల (public affairs) తీర్మానములనూచింపుట.

కాని పాలకులు ప్రజాప్రతినిధులకు పాలనవ్యవహారము లెట్లున్నవో జెప్పుటకు జవాబుదారులుకారు. కాని వారు ప్రజాలాభమునకు వినియోగపడునని తలంచితే జవాబుచెప్పవచ్చును. మరియు తీర్మానములుజేయు యధికారము సభలకాలమును యితరతారీఖులకు మార్చుటకో, లేక వార్తవిషయములనో తెలియదు. ప్రత్యేకపుకమిటీలను విమర్శకొరకు నియమించమని సభ్యులు తీర్మానముజేయుట యిదిపరకు అమలులోనున్నది. మరియు దానివలన చాలా లాభములుగలవు.

బడ్జెటు, బడ్జెటునియమములు.

"రాజకదేహమునకు అర్థము యింద్రియధాతువని జెప్పవచ్చును. రాష్ట్రముయొక్క ఆర్థికవ్యవహారముల చక్కబెట్టువాడు, రాష్ట్రీయతంత్రమునంతయు స్వాధీనము జేసికొనినవాడగును. సంస్థానికము ప్రధానాభిప్రాయము; బడ్జెటులు ఆయభిప్రాయముకొనసాగుటకు గల సాధనములై యున్నవి,, అని యొక అర్థశాస్త్రజ్ఞుడు జెప్పియున్నాడు. కనుక యిండియాపాలనకార్యములో రాజ్యధనకార్యము లెవరిస్వాధీనములో నుండునో దెలియదగును. పార్లిమెంటు యిండియారాజస్వకార్యముల జోక్యముకలుగజేసికొనుటకు శాసనాధికారము లేదనిజెప్పియుంటిమి. మరియు యిండియాలోని శాసననిర్మాణాంగము బడ్జెటుపైవోటిచ్చుటకు యధికారముకలిగియుండదు. సంవత్సరప్రారంభమున యార్థికపట్టీని శాసననిర్మాణసభలో అర్థకాధికారియగు మంత్రిసభలో పెట్టును. అది కంట్రోలర్ ఆడిటర్ జనరల్ చేత తయారుచేయబడి ఆర్థకాధికారి యనుమతినొంది సవరణజేయబడి గవర్నరుజనరలుయొక్క ప్రయోగాంగముయెదుట బెట్టబడి తర్వాత శాసనాంగమునకు తీసుకొనిరాబడును. ఒక వారమురోజులయినతర్వాత చట్టనిర్మాణసభ్యులు బడ్జెటునుగూర్చియు సామాన్యపాలనావిధానమునుగూర్చియు తర్కింతురు. కాని బడ్జెటు యంగీకరింపబడుట లేకపోవుట ప్రయోగాంగపుచేతులో నుండును. కాని, యీదాయవ్యయవిషయమై శాసననిర్మాణసభకు యేమియు నధికారములేదు.

రాజధానిసభలలో సర్కారుయుద్యోగులు కానివారిసంఖ్య విశేషముగ నుండునుకాన క్రొత్తపను లేవియు వారియనుమతిలేక విధింపబడవు. ఇంగ్లండులో వలె యిండియాలో రాజకపక్షములచే పాలనగాని మంత్రివర్గముల జవాబుదారిగాని లేవు. మరియు ప్రయోగాంగము మారక శాశ్వతముగా నుండును. కనుక శాసననిర్మాణసభలకు బడ్జెటును ఆమోదించుటకుగాని తిరస్కరించుటకుగాని యధికారమిచ్చుటవలన లాభము లేదని నూతనచట్టములవలన నిశ్చయింపబడినది. అయినను ప్రయోగాంగము బడిజెటువిషయమై ప్రజాప్రతినిధుల సలహానుకోరి కొన్ని మార్పులు వీలయినచో చేసి వ్యవహరించవలసియుండును. ఈ నూతనమార్పువలన మూడువిధములగు లాభము ప్రజాప్రతినిధులకు సమకూడగలదు. (1) ఇండియాయొక్క సంస్థానికచరిత్రలో మొదటిసారి ప్రభుత్వము సర్కారుయుద్యోగులుకాని సభ్యులను వ్రయవిషయముల సంప్రదించి వారి యభిప్రాయములను సూచించుతీర్మానములచే లాభము చెంది బడ్జెటునుమార్చుటకు వీలుండును. (2) సభ్యులు బడటువిషయమై తీర్మానములను అంగీకరింపనిచో దానికి కారణములను ఆర్థికాధికారి జెప్పవలసియుండును. (3) పన్నుల మార్పులన్నియు బడ్జెటుకనుకూలించియే చేయవలసియుండును.



## ఎనిమిదవయధ్యాయము.



### కొన్ని రాజకీయపదములు.

#### స్వేచ్ఛ.

స్వేచ్ఛ, స్వాతంత్ర్యము అనుపదములు రాజకప్రసంగముల యనేకచోటుల వినుచుందుము. వీనియర్థమును సంపూర్ణముగ గ్రహింప ప్రయత్నింపవలయును.

ఒకపదముయొక్క యర్థము గ్రహింపవలయుచో ప్రథమమున దాని
యుత్పత్త్యర్థము జూడవలయును. తరువాత సామాన్యవాడుకలో నాపద
ము నెవ్విధము నుపయోగింపబడునో గ్రహింపవలయును. తర్వాత గ్రంథక
ర్తలచే నెట్లువాడిబడునో తెలియవలయును. పదముల యుత్పత్త్యర్థమునకు
ను, వాడుకలోనుండు యర్థమునకును తరుచుగ గొంత వ్యత్యాసముండును.
గ్రంథకర్తలు వాడుకలోనుండు యభిప్రాయములు కొరతపడియుండుట త
టస్థించునుగాన సాధారణముగ వానిని గ్రహింపక లోపాలోపములను గ్ర
హించి కొన్ని పదములకు తమగ్రంథముల సాంకేతికార్థమిత్తురు. స్వేచ్ఛ స్వా
తంత్ర్యమనుపదముల యర్థము వాడుకలో వేలువేలుగనుండును. వాని య
ర్థము సంపూర్ణముగనుండక దేశ కాల పాత్రములననుసరించి మార్పునొంది
వాడబడుచుండును. స్వేచ్ఛయనుపదమున కుత్పత్త్యర్థము(స్వ + ఇచ్ఛ)ఆయి
యున్నది. అనగా తనయిచ్ఛవచ్చినరీతిని ప్రవర్తించుట స్వేచ్ఛయగును. స్వ
తంత్రమనగ తనతంత్రము, తనకుపయోగపడునట్లు తంత్రముపన్నుకొనుట ఉ
త్పత్త్యర్థరీత్యా జూచినచో యీపదములు లోపసహితమయినట్లు గన్పడును.
ఎవరియిష్టమువచ్చినచొప్పున వారుసంచరించుట స్వేచ్ఛయగుచో నదిమంచిది
యా? రాజకసాంఘికవ్యవహారముల స్వేచ్ఛగావలయుననుచో నెవరియిచ్ఛ
ననుసరించి లాభాలాభము లెట్లున్నను మంచియైనను చెడుగయినను లెక్క
జేయకపోవలయుననుయర్థము స్పష్టపడదు. అయినను వానినిచ్చట జూపు
చున్నారము. ఈయభిప్రాయసముదాయమే స్వేచ్ఛస్వాతంత్ర్యములయొక్క
యర్థముని గ్రహింపవలయును. స్వేచ్ఛయన ప్రథమమున రెండర్థములు దో
చును. (1) శారీరక భయములేక నిర్బంధనలేకపోవుట (1) ఇతరులకార్యముల
వలన తనకు హానికలుగునేమోయను నైతికభయము లేకుండుట. (1) పరదేశ
శత్రువులనుండి రక్షణగలిగియుంట స్వాతంత్ర్యమనబడును. అనగా ఒకదేశపు
ప్రజలు పరదేశీయుల కాధేయులై యుండకపోవుట. (2) స్వదేశాభిమాన
మొకప్పుడు స్వేచ్ఛయగును. స్వదేశవిషయమై ప్రేమాభిలాష గలిగియుంట
స్వేచ్ఛాపరత్వమనబడును. (3) స్థానికస్వేచ్ఛ దేశములోని ప్రజల రాజకవ్య

వహారములన్నియు మధ్యప్రభుత్వముయొక్క యుద్యోగులచేత జరుపబడక ప్రజలచేజరుగునట్లు వీళ్లుండునపుడు ప్రజలు స్వాతంత్ర్యులైయున్నారని జెప్పబడుదురు. అనగా ప్రజల తమవ్యవహారముల నన్నియు సర్కారుతీర్పునకు మనవిజేసికొనక యేప్రదేశములవా రాప్రదేశములలో తమలోతాము తీర్మానము జేసికొనుటకు హక్కుగలిగియుండుట. గ్రామపంచాయితికచ్చేరీలు, పట్టణపారిశుద్ధసంఘములు, జిల్లాబోర్డులు, జిల్లాసభలు, పార్లమెంటు మొదలగు ప్రజాసంఘములకు రాజక వ్యావహారికహక్కులు గలిగియుంట స్వేచ్ఛయనబడును. (4) పాలనాంగపుసంబంధరీత్య ప్రజలపై చట్టనిబంధనము లనేకములు లేక కొద్దిగానుండుచో స్వేచ్ఛయనబడును. (5) పాలనాంగమునకు స్వేచ్ఛలేక ఆచరణకార్యములలో కట్టుబాటు లనేకములుండుట స్వేచ్ఛయనబడును. అనగా యిష్టమువచ్చినట్లు ఆజ్ఞలనిచ్చుటకును, శిక్షించుటకును, బంధించుటకును, పాలకులకు హక్కులేకుండుట స్వేచ్ఛయనబడును. (6) ప్రజలు బానిసత్వమునుండి విముక్తులగుచో స్వాతంత్ర్యముగలవారని జెప్పబడుదురు. ఇంకొకప్పుడు కేవలము క్రూరమగు బానిసజీవనము లేకపోయినను ప్రతివిషయముల తమకు స్వప్రవృత్తిస్వానుచరణలకు వీలులేక యితరులచే తమకార్యములు జేయబడుచో వారు స్వతంత్రులని చెప్పబడుదురు. నిరంకుశప్రభుత్వమునకును అతివిపరీతప్రభుత్వమునకును స్వేచ్ఛ ప్రతికూలించియుండును. (7) ప్రాతినిధికప్రభుత్వముగలిగియుండుట స్వేచ్ఛయనబడును. ప్రజాప్రతినిధులు పాలనకార్యమువహించి ప్రజలకు జవాబుదారియై ప్రజాభిప్రాయములననుసరించి పాలించుట స్వేచ్ఛయనబడును. (8) కొందరు స్వేచ్ఛను రెండువిధములుగ విభజించి రాజకీయస్వేచ్ఛయనియు, సాంఘికస్వేచ్ఛయనియు జెప్పుదురు. ప్రజాబాహుళ్యము, అజ్ఞానము, వాడుక మొదలగు కొన్ని కారణములచే నూతనమార్గములను సులభముగగ్రహించుట కిష్టపడక వ్యక్తిజీవనమును గర్హించి స్వతంత్రులను తమ బాహుళ్యాభిప్రాయాతిశయముచే బాధపెట్టుట సంభవించును. దీనికిప్రతికూలించి జంకక వ్యక్తిపురుషుడు తనయభిప్రాయముల, నిష్టమువచ్చినరీతి నాచరించుటకు హక్కుగలిగియుండుట సాంఘికస్వేచ్ఛయనం

బడును. మనస్సాక్షి, ఆలోచన వీనికి స్వాతంత్ర్యముండుట అనగా సకలవిషయములందును మనయిచ్ఛానుసారముగ దలంచుటకును, మంచిచెడుగులను సదసత్తులను దెలిసికొనుటకును, రాబోవునష్టములకు లోనై యితరులను మనకార్యములను దప్పనుకొనినను, పిచ్చివారిగభావించినను, ఝుడియక నాటంకము లేక మనజీవితములను మనగుణముల కనుగుణ్యముగ జేయుటకు వీళ్ళుండుట సాంఘికస్వాతంత్ర్యమనబడును.

రాజకస్వేచ్ఛయన నాగరికతగలుగు జనులెక్కువగౌరవించి ప్రేమించుహక్కులకు నడ్డేమియులేక యదార్థమగు రక్షణకలిగియుండుటయు, నా రక్షణ భద్రపరుపుటకు ముఖ్యసాధనమగునట్టి పాలనాంగమందు సంపూర్ణముగ నధికారముగలిగియుండుటయు, ప్రజలకు దమతమ హక్కులవిషయమై తమతమపరమావధిపై జ్ఞానముగలిగియుండుటయు మనుజులచే బాలనజరుగుటయు రాజకీయస్వేచ్ఛయొక్క ముఖ్యలక్షణములై యున్నవి. (మానవహక్కులనుండి)

## శాసనము, చట్టము.

ఇండియన్ పినల్ కోడ్డు (Indian Penal Code) అను శిక్షాస్మృతిలో ననేకవిధాయక నియమములుగలవు.

(1) దొంగతనముచేసినయతనికి మూడుసంవత్సరములవరకు ఖయిదుగాని జరిమానాగాని లేక యీరెండువిధములుగగాని శిక్షవిధింపబడును. (379 శెక్షన్)

(2) భూమి సూర్యునిచుట్టుతిరుగును. పైకి నెగరవేసినపదార్థములన్నియు క్రిందపడును. నిప్పుమండును. పదార్థముల దహనముజేయును.

(3) సత్యంవద, ధర్మంచర, (సత్యమునుజెప్పుము, ధర్మమునవలంబింపుము); అహింసాపరమోధర్మః (అహింసధర్మములకెల్ల శ్రేష్ఠము)

(4) పెద్దలను ప్రాతఃకాలమున జూచినచో నమస్కరింపుము. దేవస్థానములకుపోవునపుడు నమ్రతవహింపుము. పెద్దలవాడుకల గౌరవింపవలయును

(5) ఒక రాష్ట్రము మరొక రాష్ట్రమును గౌరవించి వారి హక్కులకు నష్టము చేయకూడదు.

ఈపైజెప్పినవాక్యముల కొన్ని మానవవిధాయకనియమములై యున్నవని దెలియవచ్చును. ఇతరములు కొన్ని (అనగా భూమి సూర్యుని చుట్టును తిరుగును వగయిరాలు) మానవవిధాయక కార్యములుగాక సృష్టినియమములని దెలియవచ్చును. నియమమనగ విధివాక్యము. ఇటుల దీనిని జరుపవలయు, లేక యిదీవిధముగ జరుగునని యదిజెప్పును. నియమవాక్యములన్నియు శాసనము లనకూడదు. సృష్టిప్రపంచము కొన్ని నియమవిధానములకు లోనై యుత్పత్తిస్థితిలయములకు లోనై జరుగుచుండును.

మానవపరిణామమును కొన్ని విధాయకనియమములును విధేయించును. మరియు మనుజులును తమ లౌకికవ్యవహారముల కొన్నినియమముల నేర్పరచుకొందురు. కాని యివియన్నియు శాసనములు గావు. పైజెప్పిన యైదుతరగతుల నియమములలో మొదటితరగతినియమములుమాత్రము శాసనములనబడును. శాసనములగు నియమములకును, యితరనియమములకును భేదము తెలియవలయునని వానిలో నిమిడియుండు యంతర్భావముల పరిక్షింపవలయును. శిక్షాస్మృతిలోని నియమవాక్యమునకును సత్యంవద, ధర్మంచర యను నియమవాక్యమునకును భేదముజూడవలయును. శాసనమునకును, నీతివాక్యమునకును భేదముకలదు. శాసనవాక్యమున యాజ్ఞభావముకలదు ఆజ్ఞ నతిక్రమించినచో దండనసంభవించుననియు కలదు. మరియు నాదండన పరలోకమందుకలుగక ప్రత్యక్షముగ పాలనాంగపుయధికారులవలనసంభవించును. ఆజ్ఞయనగనేమి? యీపనిజేయకుము, దీనిచేయుము, దీనినిచేయకపోయినచో యీశిక్ష కలుగగలదను వాక్యప్రచురము ఆజ్ఞయనబడును. ఆజ్ఞయొక్క ప్రధానలక్షణ మది

ప్రచురమునొందిన భాషాశైలివలన నిర్ణయము జెందదు. ఆజ్ఞనిచ్చువారి బలా
బలము, వారివలనగలుగు దండనయొక్క కాఠిన్యము వీనిపై నాధారపడియుం
డును. నేను నీయాజ్ఞకు లోబడనప్పుడు శిక్షించుటకు నీకు శక్తి లేనిచో అది
యాజ్ఞ కాదు. ఒకప్పుడు శక్తియున్నను శిక్షించుట కిష్టములేనిచో యది
యాజ్ఞ కాదు. శిక్షించుట కిచ్ఛాశక్తులుండునపుడే నియమవాక్యము ఆజ్ఞయ
గును. ఒకప్పుడు యీఆజ్ఞ మనవిరూపముగనుండవచ్చును. రాజు తనమంత్రి
కి "నీవు దయచేసి యీపనిచేయుము" అని చెప్పినను అది శిక్షించుటకు శక్తి
యు, యిచ్ఛయు, గల యధికారివలన వచ్చినదిగాన ఆజ్ఞయగును. "ఈకార్య
ము నీవుచేయుము లేనియెడల నిన్ను శిక్షింతును" అని సామాన్యపు మనుష్యుడు
తనకు సమానుడగు యింకొకనికి గంభీరస్వరముతో జెప్పినను యది యాజ్ఞ కా
జాలదు. ఏలయన ఆయధేయుని శిక్షించుటకు శక్తిసామర్థ్యము గలిగియుం
డడు. ఆజ్ఞ విధి యీరెండుపదములును పరస్పరాపేక్షపదములై యున్నవి.
అనగా ఆజ్ఞ యెప్పుడుండునో విధియు నప్పుడగలదు, విధియనుచో నాజ్ఞయు
కటికలదని నూహింపవచ్చును. ఆజ్ఞయనునపుడు విధికలదని నూహింపవలయు
ను. ఆజ్ఞయొక్క యుల్లంఘన ఫలితను దండనైయుండవలెను.

కనుక శాసనమనుపదమున ముఖ్యముగ నాలుగభిప్రాయములు గలవు:-
(1) ఆజ్ఞ (2) విధి (3) శిక్ష (4) స్థిరత (అనగా ఆయాజ్ఞ క్షణమాత్రముగా
క చిరకాలముండవలెను). ప్రతిశాసనమును (లేక శాసనమనదగు ప్రతినియమ
మును) రాజగు యొక పురుషునివలనగాని, రాజ్యాధికారముగల పురుషసము
దాయముచేగాని తమ యధికారముక్రిందనుండు స్వతంత్ర రాజకసంఘముపై
విధించబడవలయును. పైజెప్పిన లక్షణములుగాక శాసనపదమునందంతర్గర్భి
తములయిన యభిప్రాయములు మరికొన్ని గలవు. వానిని గ్రహింపవలెను. ప్రభు
త్వము, ఆధేయత, స్వతంత్రరాజకసంఘము. ప్రజాబాహుళ్య మొక నిర్ధారణ
జెందియున్న యధికారిని సర్వసాధారణముగ విధేయించువాడుక యుండవల
యు, ఆయధికారియొకడయినను లేక పదుగురయిన నుండవచ్చును. ఆపాలక

యధికారిగాని లేక పాలకాంగముగాని యితరులకెవ్వరికి విధేయులై యుండు వాడుకయుండకూడదు. అనగా యొకసంఘమునుండి సర్వసాధారణమగు విధేయతను యొకయధికారినొంది యితరులెవ్వరకు లోబడకుండుచో ఆయధికారిని ప్రభుత్వమువహించియున్నదని జెప్పవచ్చును. ఆసంఘము రాజకస్వాతంత్ర్యసంఘమని జెప్పవచ్చును. ఆనిశ్చితప్రభువున కితరు లాధేయులగుదురు. పాలక పాలితసంఘములకుండు సంబంధము ప్రభుత్వము, ఆధేయత, వీనివలన దెలియును. పరాపరోక్షముల నెటులయినను ఏకత్వ బహుత్వరూపములనే రూపమున్నను పాలకులు తమభృత్యులగు పాలితప్రజలపై నియోగించు విధాయకనియమము శాసనమనబడును.

(1) ఆజ్ఞ (2) విధి (3) శిక్ష (దండన) (4) స్వతంత్రరాజకసంఘము (5) స్వతంత్రప్రభువు (6) ఆధేయత; ఈయభిప్రాయములు శాసనపదమునందంతర్గర్భితములై యున్నవి. కాని శాసనచట్టపదములు సాదృశ్యరీత్యా యితరపదములతో జేర్చి వాడబడుచుండును. సృష్టిచట్టములు, నీతిచట్టము, ధర్మశాసనములు, పరస్పరజాతిచట్టములు, సాంఘికచట్టములు అని యనేక సమాసపదములు గలవు. వీనికిని న్యాయశాసనములకును భేదము చాలకలదు. న్యాయశాసనములయొక్క రూపలక్షణములను నిర్ణయించుటకు వీలుగలదు. ఈ శాసనముల నిశ్చయించి నిరూపించుట సాధ్యమంతగాదు. శాసనమునకును, దానిలోని యాజ్ఞభావమునకును, అవిధేయతయందు దండన నిశ్చయముగ సంభవించును. నీతిచట్టములగాని, ధర్మశాసనములగాని యుల్లంఘనదండనన్ని కాలముల గలుగజేయునని నిర్ధారణ మొనరించి చెప్పుటకు వీలులేదు. సత్యంవద యని నీతిశాసనముగలదు. అబద్ధమాడినప్పుడెల్ల, నరహత్య, దొంగతనము మొదలగు నేరములు జేసినవెంటనే గలుగునట్లు దండన గలుగుచున్నదా? లేదు. శిక్ష చివరకు కలుగకపోదని కొందరుచెప్పుదురు. కాని దాని యదార్థము లు స్పష్టపడవు. ఈ రెండవతరగతిచట్టముల న్యాయశాసనములన్నియు ప్రత్య

క్షముగనయినను, లేక పరోక్షముగనయినను లేవు. ఒకప్పుడూహామీద యాధారముగలిగియుండును.

హక్కు, స్వత్వము.

హక్కు, స్వత్వము అనుపదములే యభిప్రాయముల దెలియవలయును

(ఎ) మనయాలోచనలను, మన యభిప్రాయములను, ఇతరులతో జెప్పుటకుగాని పత్రికలలో ప్రచురించుటకుగాని మన మితరులకు హానిలేకుండ సంభాషించుటకుగాని మన యిష్టదైవము నారాధించుటగాని యడ్డేమియు లేకుండవలెను.

(బి) చట్టనియమములేకనే మనుజుడును బంధింపబడదగడు. విచారణలేకుండ వానిని చెరయందుంచకూడదు.

ఈపైజెప్పిన సూత్రములు రెండును మానవుల యోగక్షేమముల కాధారములగు రెండుహక్కులైయున్నవి. మరియు నారెంటిని వేలువేలుజాతులకు గుర్తులుగజూపవచ్చును. హక్కులు త్రివిధములు. (1) ప్రాతిపదికహక్కులు అనగా జన్మతోబుట్టినవి. (2) నైతికహక్కులు అనగా మానవుడు తన నీతిస్వభావమున కుపయుక్తమగునట్లు సంపాదింపవలసిన హక్కులు. (3) శాసనికహక్కులు, అనగా శాసనానుమతిపై నాధారపడియున్న హక్కులు. కాని శాసన మను పదము మితరపదములతో జేర్పబడి సాదృశ్యోపయోగము జెందినపుడు ప్రథమభావము నెట్లతిక్రమించునో యావిధముగనే హక్కు యనుపదము ప్రాతిపదికహక్కులు, నైతికహక్కులు అను సమాసములందు ప్రథమభావమును సూచింపదు. హక్కుయనుపదముయొక్క యంతరాభిప్రాయమును దెలియుటకు శాసనమనుపదమును పృథక్కరణరీత్యా పరిక్షించవలయును. సర్వస్వతంత్రుడగు యధికారి తన స్వాధీనములోనున్న రాజకసంఘముపై సాధారణముగజేయుచుండు యాజ్ఞలు శాసనమనబడునని జె

ప్పియుంటిమి. శాసనానుమతివలన ప్రజలు తమ లౌకికవ్యవహారముల యథా విధిగ నాచరింపుటకు గల యధికారము హక్కనబడును. చట్టనియమము లే క నే మనుజుడును బంధింపబడదగడు. ఇది ప్రజలకు తమ లౌకికవ్యవహారము లలో నుండవలసిన ప్రధానయధికారము లేక స్వత్వమని చెప్పవచ్చును. కాని న్యాయశాసన మాసూత్రమును స్థాపించనిచో అది ప్రజాహక్కని జెప్పగూడ దు. మనోవాక్స్వతంత్ర్యము ప్రాతిపదికసత్వముల ప్రధానము. మనయా లోచనలును, మనయభిప్రాయముల నితరులతో జెప్పుటకుగాని, పత్రికల లో ప్రచురించుటకుగాని యధికారములేనియెడల మనసంఘ మభివృద్ధి జెంద జాలదనుమాట సత్యమే. మరియు నీశక్తులు సహజముగ మనకు గలిగినవిగనుక వానినిర్బంధించుట కేరికి నధికారములేదనువాదముకూడ సత్యమే. కాని యీయధికారస్వత్వములు శాసనానుజ్ఞ లేక హక్కులుగావు. పాలకులొకప్పు డు వాక్స్వాతంత్ర్యమును కొన్నికొన్ని విషయముల దీసివేయుట తటస్థించు ను. అప్పుడాయావిషయముల వాక్స్వాతంత్ర్య హక్కు మనకులేదని జెప్పవచ్చును. శాస నికహక్కును పృథక్కరించి చూడవలయుననిన అయిదు ముఖ్యాంశముల గ మనింపవలయును.

(**1**) శాసనము, విధి, దండన, ప్రతిశాసనము నొకయాజ్ఞను ప్రతిపా దించును. ఆజ్ఞ విధినికలుగజేయును. విధి ద్వివిధము. వాస్తవికము, నిషేధక ము, కేవలము సాపేక్ష్యము. విధి నుల్లంఘున దండనకారణమగును. మానవు నికిగల ప్రతిహక్కు శాసనవిధాయకమై యుండవలెను. శాసనాంగీకారము జెందని స్వత్వము హక్కనబడదు. ఆహక్కు నితరు లతిక్రమించినచో దండ న కలుగును.

(**2**) పురుషుడు, లేక పదార్థము, కార్యము లేకనిషేధము, హక్కు లెప్పుడు మానవులకుగాని పశు జడపదార్థములకు జెందియుండవు. వస్తువు,

కార్యములు, నిషేధములు, వీనినిసంబంధించియుండును.

(3) హాని, నేరము, నష్టము, హక్కు అనుపదము విధ్యుల్లంఘన, దండనల నెట్లిద్వ్యాప్తించునో ఆవిధముగనే హానినష్ట నేరములయొక్క యభిప్రాయములు, హక్కునం దధ్యాహారములై యున్నవి.

(4) ఉద్దేశము, ఉదాసీనము:— నేరమునంద రెండుయభిప్రాయములు నంతర్థాపితములై యున్నవి. దొంగతనముచేసినయతనికి మూడుసంవత్సరములు ఖయిదుగాని లేక జరిమానాగాని, లేక యీ రెండువిధములగాని శిక్షింపబడును. (శె॥ 379 యిం॥ పి॥ కో॥) ఇది శిక్షాస్మృతిలోని యొక శాసనమైయున్నది. శాసననిర్మాణకులు దొంగతనము చేయకూడదని యాజ్ఞ యిత్తురు. ఆయాజ్ఞ యితరులనుబాధించును. యెవరిసొత్తయితే దొంగిలింపబడునో వారు దానిని సంపాదించుకొనుటకు హక్కును గలిగియుందురని జెప్పబడుదురు హక్కులన్నియు నిశ్చితపురుషులకు జెందియుండవలెననియు, మరికొంతమంది పురుషుల విధాయకకార్యములై యుండవలెననియు జెప్పుదురు. మరియు నవి నిషేధకములయినను ప్రతిషేధకములునై యుండవలెను. ఒకనివిషయమై యితరులొకకార్యమును జేయుటకును, జేయకుండుటకును శాసనముచే లబ్ధులగుచో వానికి హక్కుగలదని జెప్పవచ్చును.

హక్కునకు దగ్గరసంబంధముకలిగియున్న మరొకయభిప్రాయము గలదు. అది లౌకికపదవి Status యైయున్నది. మనుజునకుగల హక్కులు, విధులు, శక్తిసామర్థ్యముల నన్నిటిని నిర్ణయించునది రాష్ట్రములో వానికి గల పదవి (స్థితి) యని జెప్పవచ్చును. ఆస్థితి వారికిగల హక్కులనుండిగాని విధులనుండిగాని కలుగదు. మరియు యీహక్కులే, యీవిధులే దానిపదవికి నాధారములైయున్నవి. సంఘమున రాజు యితరులందరికంటె యున్నతముగ యవస్థను వహించియుండును. ఈయున్నతపదవికి కారణములు వానికిగల

విధులును, హక్కులును, వీని యుత్పత్తికవకాశములగు యితరవిషయములును కారణములై యున్నవని దెలియవలయును. బ్రాహ్మణులకు హిందూసంఘము న యితరవర్ణములకులేని హక్కులును, విధులును గలవు. ఈవిధముగనే ప్రస్తుతస్థితినిబట్టి వైస్రాయి; గవర్నర్ పనులకు మనదేశస్థులు యోగ్యతగలిగియుండరు. ఆపదవులకు తెల్లవారే యోగ్యులని శాసనముగలదు. దీనికి కారణము వ్యక్తిపురుషునియొక్క యోగ్యతాయోగ్యతలుగాదు. ఆతరగతి, వర్ణము, లేక జాతియొక్క యోగ్యతాయోగ్యతలేకారణములై యున్నవి. రామశర్మ (బ్రాహ్మణుడు) యజ్ఞముచేయవచ్చును. రామిరెడ్డి (శూద్రుడు) జేయకూడదు. మింటోప్రభువు వైస్రాయికావచ్చును. ప్రతాపసింగు వైస్రాయియగుటకు వీలులేదు. ఈవ్యత్యాసమునకు కారణము రామశర్మ, రామిరెడ్డి, వీరికందుగల పరస్పర యోగ్యతాయోగ్యతలయొక్క భేదముగాదు, రామిరెడ్డి రామశర్మకంటె నెక్కువశ్రేష్టుడు గావచ్చును. అయినను బ్రాహ్మణజాతిలో జన్మించలేదు గనుక ఆజాతికిగల హక్కులను, విధులను, సామర్థ్యములను గలిగియుండుటకు వీలులేదు. మింటోప్రభువుకంటె ప్రతాపసింగ్ యెక్కువసమర్థుడయినను పాలక సంఘములోనివాడు కానందున వైస్రాయి యగుటకు హక్కులేదు. కనుక లౌకికపదవి నిర్ధారణజేయునవి వ్యక్తిపురుషునియొక్క గుణాగుణములు, యోగ్యతాయోగ్యతలు కావు. వానియొక్కజాతి, వర్ణము, లయొక్క గుణాగుణములు, వాని రాజకయవస్థయొక్క హక్కులను, విధులను నిర్ణయించును. మరియు లౌకికపదవిని నిర్ణయించు హక్కులు, విధులు, యోగ్యతాయోగ్యతలు, ఆయాతరగతి జనులకు ప్రత్యేకములై యుండవలయును. కాని మానవులకు సామాన్యములగునవిగా నుండకూడదు. మరియు నాపదవియొక్క యనుభవము విస్తీర్ణవ్యాపకమును జెందియుండవలెను.

## ప్రభుత్వము.

ప్రభుత్వమనగ నేమియో గ్రహింపవలెనని శాసనమందుగల యంతర్భావములను గ్రహించినచాలును. సామాన్యము లేక ప్రత్యేకమయిన యా

జ్ఞలను పాలితజనులపై విధించుయంగము ప్రభుత్వమనబడును. ఈకార్యము
లేక యీకార్యములను జేయుడు, జేయకుడు, జేయనిచో యీదండనకలుగు
ను, అని శాసించునది ప్రభుత్వమనబడును. ఆజ్ఞ, శిక్ష, యీరెంటిపై యధి
కారముగలిగినయంగము ప్రభుత్వమనబడును. ప్రభుత్వాంగముపై వేరు యధి
కారు లుండకూడదు. ప్రధానప్రభుశక్తికి మూడు లక్షణములు గలవు; (1)
అవిధేయులగు పాలక పాలితాంగములను శిక్షించుట; లేక యుద్యోగము లు
న్నచో వానినుండి తొలగించుట; (2) తనపై యితరులెవరు యధికారము చె
ల్లించి అవిధేయతకు దండనజేయకుండుట; (3) తన పాలనకార్యమునకు పరి
స్ఫుటమగు వర్తనవిధానముల నిర్ణయించుకొనుట; అనగా న్యాయశాసన
ముచేయుటకును, నేరములను కనిపెట్టుటకును, వానినిర్ణయించి శిక్షవిధించు
టకును, మరియు నాశిక్షను ప్రయోగించుటకును ఆంగము లుండవలయును.

ప్రభుత్వశాసనముల రెంటికిని సమానోద్దేశములను జెప్పియున్నాము.
శాసనము ప్రభుత్వమును అధ్యాహారముజేయును. ప్రభుత్వమునందు శాసనము
అధ్యాహృతమగును. కాని ప్రాచీనసంఘములయొక్క- ప్రథమస్థితియందిట్టి
యభిప్రాయములు గలుగలేదు. శాసనము ప్రభుత్వమునుండి యుద్భవిల్లునని
వారు దలంచలేదు- అనాదినుండివచ్చువాడుకయే పాలకపాలితులను సమాన
బద్ధులుగ చేసినది- వాడుక, యలవాటు, అపకీర్తి యివియే పాలకయాజ్ఞ
లను ప్రజలు విధేయించునట్లు చేసెనుగాని కేవలము రాజదండనాభయముకా
దు- ప్రభుత్వము స్థిరపడినతర్వాతసహితము చాలకాలమువరకు పాలకులు యి
ప్పటిరీతిగ ప్రత్యక్షముగ స్వబుద్ధిని శాసననిర్మాణమొనరించు వాడుక లేకుం
డెను- కొన్ని దేశములలో అమలులోనున్నచట్టములన్నియు యింతవరకు స్మృ
తిరూపమునొందలేదు- మరియు శాసననిర్మాణమునకు మారుగా చిరకాలము
నుండి యమలులోనున్న వాడుకలకు సమయానుకూలముగ నూతన వ్యాఖ్యాన
ములుజేయుటయు ఒకప్పుడు న్యాయధర్మమునననుసరించి న్యాయాధిపతి ధై
ర్యవంతుడగుచో కొద్దిగ నూతనమార్పులు ప్రవేశపెట్టుటయు సంభవించుచుం

డెను- న్యాయశాసనములనగ దేశములో పాలకాంగముచే నిర్మాణముపొంది యమలులోనున్న చట్టములని గ్రహింపవలయునుగాని శాసనముయొక్క పరమావధి యీయీవిధముగ నుండవలెనని యూహించి అమలులో లేకపోయినను అది శ్రేయస్కరమని తలంచి యమలులోనున్నట్లు భ్రమింపకూడదు- ప్రభుత్వముయొక్క యధికారమునకుహద్దు దాని స్వనీతికాదు. మరియు నీశ్వరచట్టము లనునవికావు- ప్రభుత్వమునకు హద్దిడునది ప్రజాబాహుళ్యముయొక్క నీతియభిప్రాయమే యని గ్రహింపవలయును- మరియు ఆనీతియభిప్రాయము వాడుక యలవాటులనై చిరకాలము యాధారపడుచో ప్రభుశక్తికి హద్దులు బలపడును-

## జ్యూరీలచే విచారణ-

జ్యూరిపద్ధతి మానవుని వ్యక్తిస్వేచ్ఛలను కాపాడుసాధనములలో ప్రధానమని జెప్పవచ్చును- తనకు సములగు పండ్రెండుగురు పురుషుల తీర్పులేకుండ యేపురుషుడు నేరస్థుడని స్థాపింపబడతగడు- జ్యూరి సామాన్యమనియు, ప్రత్యేకమనియు రెండువిధములు- రెండవతరగతిజ్యూరీలో శ్రేష్ఠులగు సభ్యులెన్నుకొనబడుదురు- వీరు విద్యావంతులైయుండవలెను- ముద్దాయిగాని, వాదిగాని ఫలానిజ్యూరరు పనికిరాడని చెప్పవచ్చును- అప్పుడు క్రొత్త జ్యూరి యెన్నుకొనబడవలయును; లేక వేరొకజ్యూరరు నెన్నుకొనవచ్చును-

## హేబియసు కార్పసు (Habeas Corpus)

దీనివలన చెరలోనుంచబడిన ముద్దాయి యెవరయిన తనను నన్యాయముగ బంధించిరనుకొనినప్పుడు, న్యాయాధిపతియెదుట యాసంగతిని విన్నపముచేసికొని, చెరలోనుంచవలయునా, లేదా యనునంశము నిర్ణయించుటకును హక్కుగలదు- తరువాత యీన్యాయాధిపతి యొక వ్రాతపూర్వకమగు నాజ్ఞనుయివ్వవలయును- అందువలన ముద్దాయి నెందుకు చెరలోనుంచిరో కనుగొ

నవలయును- చెరలోనుంచబడిన ముద్దాయియొక్క నేరపువిచారణ వెంటనే జరుగవలయును- ఒక నేరమునకే తిరిగి విచారణ జేయబడకూడదు- తగు దరియాప్తు లేక కేవలము అనుమానముమీద యెవరును ఖయిదీలో నుంచబడకూడదు-

## ప్రజల స్వాతంత్ర్యము-

కేవలము సంఘసుఖమునకు ననుకూలించు కార్యములనే వ్యక్తిస్వేచ్ఛపై కొంత హద్దు లేర్పరుపబడియున్నవి- వ్యక్తిస్వేచ్ఛను కాపాడుటకు నాలుగు మార్గములు కలవు- అవి:— (1) శాసననిర్మాణము (2) ముద్దాయిలవిచారణ (3) అన్యాయపుబాధనములేకుండ జూచుట (4) పోలీసువిధులనిర్ణయము మొదటిది ప్రజాప్రాతినిధ్యమువలన సమకూడును; రెండవదానికి జ్యూరివిచారణ; మూడవదానికి హేబియసు కార్పసు; నాల్గవదానికి పోలీసు వారంటు లేకుండ యెరస్టుచేయకూడదు-

## పన్నులు - శిస్తు-

ఇవి మూడువిధములు-

1 ప్రత్యక్షమగు పన్నులు:—కొంతవిలువగల గృహముల నాక్రమించుకొనువారు, కొంత ఆదాయమువచ్చువారలపై పన్నులుగట్టుట-

(1) ఆదాయపుపన్ను (2) ఇంటిపన్ను (3) భూమిపన్ను-

— 2 పరోక్షములగు పన్నులు:—(1) ఇవి చేతిపనులు, యెగుమతి దిగుమతిపన్నులు; మహసూల్కారములు (దిగుమతులపైపన్నులు, తేయాకు, కాఫి, వైనులు, సారాయి, పొగాకు) (2) ఒకదేశములోని చేతిపనులు, ఎగుమతి దిగుమతులపై పన్నులు- బెల్లము, వైనులు, సారాయి, పొగాకు మొదలగునవి- (3) స్టాంపుపన్నులు; వారసత్వముపన్నులు వగయిరాలు-

3 టపాలు, టెలిగ్రాములు మొదలగువానివలన కొన్ని పన్నులు వచ్చును-

# ఇండియాలోని శాసనసభల నిర్మాణము.

## వైస్రాయిసభ.

| | | |
|---|---|---|
| (ఏ) ఎక్సుఫిషియల్ సభ్యులు | ... | 7 |
| (బి) రాజధానులనుండి యుద్యోగులు | ... | 10 |
| (సి) ఎన్నికలేక నియమింపబడిన సభ్యులసంఖ్యాపరిమితి | ... | 20 |
| పంజాబు భూస్వాములు, మహమ్మదీయులకొరకు నియోగింపబడినవారు | ... ... | 3 |
| ఇండియనువర్తకము | ... ... | 2 |
| (డి) ఎన్నికప్రతినిధులు | ... ... | 25 |
| 1 రాజధానిసభలచే | ... ... | (12) |
| 2 మద్రాసు, బొంబాయి, బెంగాలు, తూర్పుబంగాళ అండు అస్సాము, సంయుక్తపరగణాలు, మధ్యపరగణాలు | | (6) |
| 3 మద్రాసు, బొంబాయి, బెంగాలు, తూర్పుబంగాళ, అస్సాము, సంయుక్తపరగణాలలో మహమ్మదీయులు | | (5) |
| 4 కలకత్తా, బొంబాయి, వాణిజ్యసంఘములు | ... | (2) |
| | మొత్తము | 67 |
| | వైస్రాయిసహా | 68 |

## బొంబాయిసభ.



| | | | |
|---|---|---|---|
| కార్యనిర్వాహకపుసభ్యులు | | ... | 4 |
| అడ్వకేటుజనరల్ | | ... | 1 |
| (ఎ) నియోగింపబడిన సభ్యులు | | ... | 21 |
| వీరిలో యుద్యోగుల పరిమితి | 14 | | |
| (బి) నియోగింపబడిన సేర్వరులు | ... | ... | 1 |
| (సి) ఎన్నికసభ్యులు | ... | ... | 21 |
| 1 బొంబాయి కార్పొరేషను | | ... | (1) |
| 2 మ్యూన్సిపాలిటీలు | | ... | (4) |
| 3 జిల్లాబోర్డులు | ... | ... | (4) |
| 4 విశ్వవిద్యాలయము | ... | ... | (1) |
| 5 భూస్వాములు | ... | .. | (3) |
| 6 మహమ్మదీయులు | ... | ... | (4) |
| 7 కరాచివర్తకసంఘము | ... | ... | (1) |
| 8 బొంబాయి, అహమదాబాదు మిల్లువోనర్సుసంఘము | | | (1) |
| 9 ఇండియనుల వర్తకసంఘము | ... | ... | (1) |
| 10 బొంబాయివర్తకసంఘము | ... | ... | (1) |
| | | మొత్తము | 48 |
| | | గవర్నరుసహా | 49 |

## బెంగాలుసభ.



| | | | |
|---|---|---|---|
| 1. నియోగింపబడి యెన్నికనొందని సభ్యులు | | ... | 22 |
| (1) ఉద్యోగులు | ... | ... | (17) |
| (2) నాటుసంఘము | ... | ... | (1) |
| (3) ఇండియను వర్తకసంఘము | ... | ... | (1) |
| 2. నియోగమునొందిన చేర్పరులు | ... | ... | 2 |
| 3. ఎన్నికసభ్యులు | ... | ... | 26 |
| 1 కలకత్తాకార్పొరేషను | ... | ... | (1) |
| 2 మ్యూన్సిపాలిటీలు | ... | ... | (6) |
| 3 జిల్లాబోర్డులు | ... | ... | (6) |
| 4 విశ్వవిద్యాలయము | ... | ... | (1) |
| 5 భూస్వాములు | ... | ... | (5) |
| 6 మహమ్మదీయులు | ... | ... | (4) |
| 7 బెంగాలు వర్తకసంఘము | ... | ... | (2) |
| 8 కలకత్తావర్తకసంఘము | ... | ... | (1) |
| | | మొత్తము | 50 |
| లెఫ్టినెంటుగవర్నరుసహా | | | 51 |



## తూర్పుబంగాళ అస్సాముసభ.



| | | | |
|---|---|---|---|
| 1. నియోగితసభ్యులు | ... | ... | |

| | | | |
|---|---|---|---|
| 1 ఉద్యోగుల పరిమితి | ... | ... | (17) |
| 2 ఇండియను వర్తకసంఘము | ... | ... | (1) |
| 2. నియోగిత నేర్పరులు | ... | ... | 2 |
| 3. ఎన్నికసభ్యులు | ... | ... | 18 |
| 1 మ్యూన్సిపాలిటీలు | ... | ... | (3) |
| 2 జిల్లా, లోకల్ బోర్డులు | ... | ... | (5) |
| 3 భూస్వాములు | ... | ... | (2) |
| 4 మహమ్మదీయులు | ... | ... | (4) |
| 5 తేయాకు, గోగు నారసంఘము | ... | ... | (2+1=3) |
| 6 చిటగాంగు రేవు కమీషనరు | ... | ... | (1) |
| | | మొత్తము | 42 |
| లెఫ్టినెంటుగవర్నరుసహా | | | 43 |

## సంయుక్తపరగణాలు.

| | | | |
|---|---|---|---|
| 1. నియోగితసభ్యులు | ... | ... | 26 |
| 1 ఉద్యోగులు | ... | ... | (20) |
| 2 ఇండియను వర్తకసంఘము | ... | ... | (1) |
| 2. నియోగిత నేర్పరులు | ... | ... | 2 |
| 3. ఎన్నికసభ్యులు | ... | ... | 20 |
| 1 పెద్దమ్యునిసిపాలిటీలు (ఒకటితరువాతనొకటి) | | ... | (4) |

| | | | |
|---|---|---|---|
| 2 జిల్లాబోర్డులు, చిన్న మ్యునిసిపాలిటీలు | | ... | (8) |
| 3 విశ్వవిద్యాలయము | ... | ... | (1) |
| 4 భూస్వాములు | ... | ... | (2) |
| 5 మహమ్మదీయులు | ... | ... | (4) |
| 6 ఉత్తరఇయిండియావర్తక సంఘము | ... | ... | (1) |
| | | మొత్తము | 48 |
| లెఫ్టినెంటుగవర్నరుసహా | ... | ... | 49 |

## పంజాబుసభ.

| | | |
|---|---|---|
| 1. నియోగితసభ్యులు | ... | 19 |
| 1 ఉద్యోగులు | ... | (10) |
| 2. నియోగితనేర్పరులు | ... | 2 |
| 3. ఎన్నికసభ్యులు | ... | 5 |
| 1 పంజాబు వర్తకసంఘము | ... | (1) |
| 2 పంజాబు విశ్వవిద్యాలయము | ... | (1) |
| 3 మ్యునిసిపల్ కంటోన్మెంటు కమిటీలు | ... | (8) |
| | మొత్తము | 26 |
| లెఫ్టినెంటుగవర్నరుసహా | | 27 |

## మద్రాసుసభ.

| | |
|---|---|
| 1. కార్యనిర్వాహకసభ్యులు | 2 |
| 2. అడ్వకేటుజనరల్ | 1 |
| 3. నియోగితసభ్యులు | 23 |
| 1 ఉద్యోగులు | (16) |
| 2 ఇండియను వర్తకసంఘము | (1) |
| 4. నియోగితసేర్పరులు | 2 |
| 5. ఎన్నికసభ్యులు | 19 |
| 1 మద్రాసు కార్పొరేషను | (1) |
| 2 మ్యూనిసిపాలిటీలు, జిల్లాబోర్డులు | (8) |
| 3 విశ్వవిద్యాలయము | (1) |
| 4 భూస్వాములు | (4) |
| 5 మహమ్మదీయులు | (2) |
| 6 నాటుసంఘము మద్రాసు | (1) |
| 7 వర్తకసంఘము | (1) |
| 8 ట్రేడ్సుసంఘము | (1) |
| మొత్తము | 47 |
| గవర్నరుసహా | 48 |



## బర్మాసభ.

| | |
|---|---|
| (ఎ) నియోగితయుద్యోగులు | 6 |
| (బి) నియోగిత అనుద్యోగులు | 8 |
| (సి) బర్మాజనులతరఫున | 4 |
| (డి) ఇండియనులు చీనావారితరఫున | 2 |
| (ఇ) ఇతరతరగతులతరఫున | 2 |
| (కే) నేర్పరులు | 2 |
| (జి) బర్మావర్తకసంఘము | 1 |
| మొత్తము | 17 |
| లెఫ్టినెంటుగవర్నరుసహా | 18 |

### ఇండియనుసివిల్ సర్వీసుయుద్యోగులకుమాత్రము ప్రాప్తించు యుద్యోగములవివరము.

1 కార్యదర్శులు, సహకార్యదర్శులు, ఉపకార్యదర్శులు (మిలిటరీ, నావిక, పబ్లీకువర్క్సు అంగములలోదప్ప)

2 అక్కౌంటెంటుజనరల్.

3 సివిల్ ఆడిటర్.

4 సబ్ట్రెజరరు- (కోశాధికారి).

### న్యాయస్థాన యుద్యోగములు.

1 సివిల్ అండు సెషన్సుజడ్జీలు.

2 ప్రధాన మేజస్ట్రేట్లు.

3 జాయంటు ,,

4 సహాయక ,,

రివిన్యూ-(శిస్తు) (రాజస్వాంగము).

1 రివిన్యూబోర్డు మెంబరు (మద్రాసు, బొంబాయి)

2 రివిన్యూబోర్డు కార్యదర్శులు.

3 రివిన్యూకమీషనర్; కలెక్టర్లు, అసిస్టెంటుకలెక్టర్లు.

4 సాల్టుఏజంట్లు.

5 సాల్టుకమీషనర్సు.

6 నల్లమందుఏజంట్లు.

## ప్రశ్నలు.

---

ఈప్రశ్నావళియొక్క ప్రధానోద్దేశము ద్వివిధము. పైయధ్యాయముల లోని సారాంశములను జదువరులు సులభముగ గ్రహించునటుల ప్రశ్నలరూపమున నీయధ్యాయమున కొన్నివాక్యములు వ్రాయబడినవి. "ఈవాక్యముల విమర్శింపుము, లేక పరీక్షింపుము" అనునప్పుడెల్ల యావాక్య మొక రాజక భావమును ప్రతిపాదించునని జదువరులుగ్రహింపవలయు. మరియు గ్రంథముల నెన్నియున్నను, ప్రజలు తమంతట తాము ప్రయత్నించి, గ్రహింపమొదలు పెట్టకుండ, రాజకజ్ఞానము ప్రాప్తించదని చదువరులు గట్టిగ నమ్మవలయును. ఈదిగువప్రశ్నలు కొన్నిటికి నిర్దేశకపుయంశములకు ప్రత్యుత్తరముగ జెప్పుదును; కాని యవి సంపూర్ణమని దలంపకూడదు. ఒకప్రశ్నను తర్కింపవలయుమార్గమును దెలుపుటకు కొన్ని సూచనల మాత్రమిచ్చుటకు సాధ్యమగును. మరియు చదువరులకొక విజ్ఞాపనము జేయువాడ; ఏరాజకవాక్యము సిద్ధాంతమును, నిండుయదార్థముగ గ్రహింపక దాని యనుకూల ప్రతికూల వాదములను తమంతట తాము నాలోచింప ప్రయత్నింపవలెను. ఇట్లుజేసినప్పుడే రాజకసంజ్ఞానము పక్వస్థితికిరాగలదు.

---

## మొదటియధ్యాయము.

ప్రశ్న.

1 రాజకచైతన్యమననేమి?

2 రాజ్యప్రకృతియనుపదమునగల యర్థమును జెప్పి దానిలోని విభాగములను దెల్పుడు.

3 రాజ్యతంత్రపతనమువలన గలుగుఫలితమును సూచింపుడు.

## రెండుమూడు యధ్యాయములు.

ఈవాక్యముల సత్యాసత్యముల విమర్శింపుడు:—

1 స్వతః మానవులందరు స్వతంత్రస్వేచ్ఛలను కలిగియున్నారు.

2 మనుజునకు కొన్ని శాశ్వతపు, లేక ప్రాతిపదికహక్కులుగలవు.

3 రాజకయధికారమంతయు ప్రజలలోనుండి జననమొందును.

4 ప్రభుత్వము ప్రజల రక్షణకొరకేర్పడియున్నది.

5 ప్రభుత్వమును మార్చుటకుగాని, సంస్కరించుటకుగాని ప్రజలకు హక్కుగలదు.

6 రాజ్యప్రకృతియే సంస్థానికదేశముల ప్రధానచట్టమైయున్నది.

7 జీవము, ఆస్తి, స్వతంత్రము, యీమూడును ప్రాతిపదికహక్కులని రాజ్యతంత్రజ్ఞులుజెప్పుదురు. ఎందుకు?

8 మతావలంబనము, మతారాధన, మతవివక్షణలు, లౌకిక, (Civil) రాజకవ్యవహారములందు ప్రజలకుందు హక్కులకును, విధులకును, నిర్ణయించుప్రమాణముగ నుండకూడదు. రాజకహక్కులకు మతవివక్షణలేక యందరు యోగ్యులే. చరిత్రపరిణామములో దీనిపై నేదేశము లెట్లు యభిప్రాయపడిన వో జెప్పుము? (ముఖ్యముగ ఇండియాప్రాచీనప్రస్తుతచరిత్రలనుపరిక్షించుము)

9 జ్యూరిహక్కు ప్రజల లౌకికస్వాతంత్ర్యమునకు పునాదియని నొక్కి జెప్పవచ్చును. ఎందుకు?

10 వాగ్వృత్తికాస్వాతంత్ర్యము ప్రాతిపదికహక్కులలో ప్రధానము. దీని పరీక్షించుము?

11 హెబియస్ కార్పస్ హక్కువలని లాభమేది? దానియర్థమేమి?

12 యునైటెడ్డుస్టేట్సులో ప్రాతినిధ్యతకు నేర్పఱుపబడిన యోగ్యత ప్రమాణము లెవ్వి?

13 ప్రతినిధులయొక్కయు, సెనెటర్లయొక్కయు, యెన్నిక లెట్లు జరుగవలయును?

14 సెనెటునిర్మాణమును వివరింపుడు?

15 శాసననిర్మాణాంగమున (కాంగ్రెసున)నున్న సభ్యుడెవడును యుద్యోగిగా నుండదగడు ఎందుకు?

16 శాసననిర్మాణవిధానమును వివరింపుము?

17 కాంగ్రెసుకుగల యధికారములను జెప్పుము? (సూత్రము 8- నిబంధన 1)

18 కాంగ్రెసుయొక్క హక్కులనుండి శాసనాంగపు విధికార్యముల నిర్ణయింపవచ్చును ఇదెంతవరకు నిజము?

19 యునైటెడ్డుస్టేట్సుయధ్యక్షునియెన్నుకొనువిధానమునువర్ణింపుడు?

20 ప్రసిడెంటుయధికారములను, విధులను వివరింపుము?

21 సంయుక్తన్యాయస్థానములవలని ప్రయోజనమేమి? (నిబంధన 3)

22 రాజ్యప్రకృతిని సవరణజేయుట కెట్లువీలగును? (నిబంధన 5)

23 కాంగ్రెసునకేని మరియితరశాసనాంగములకేనిలేనటువంటిహక్కుల వివరింపుడు? (సవరణనిబంధన I)

24 సంయుక్తరాష్ట్రముయొక్క విధులజేర్కొనుము?

25 ప్రసిడెంటువలని యుపయోగములేవి?

26 ప్రెసిడెంటులేకుండ శాసనకార్యములందువలెనే యొక చిన్నసభ ప్రయోగకార్యములయందునుంటె చాలదా?

27 ప్రసిడెంటుయధికారములు జెప్పుము?

28 యునైటెడ్డుస్టేట్సులోని ప్రసిడెంటుయుద్యోగమునకుగల లోపములఁ జెప్పుడు?

29 క్యాబినెటుమంత్రులఁ జెప్పుము?

30 (1) సెనెటువలన యునైటెడ్డుస్టేట్సుసంస్థానమున ఫలితమేమి?

(2) దాని విధికార్యములఁ బేర్కొనుము.

31 సంయుక్తరాష్ట్రమునకును, వ్యక్తిరాష్ట్రమునకును గల పరస్పర సంబంధములను బేర్కొనుడు.

32 సంయుక్తరాష్ట్రముయొక్క యోగ్యతాగుణము లేవి.

---

## నాల్గవ యధ్యాయము.

33 ఇంగ్లీషురాజ్యప్రకృతి యెట్లునిర్మాణము నొందినదో వివరింపుము.

34 రాజ్యప్రకృతులు రెండువిధములు :—కేవలము వ్రాతపూర్వకముగ నుండునది; వ్రాతపూర్వకముగ లేకుండ, దేశపువాడుకలు, చట్టములు మొదలగువానిపై నాధారపడునవి. అమెరిక, ఇంగ్లాండు దేశముల రాజకవ్యవస్థననుసరించి పైవాక్యమును విమర్శింపుము.

35 ఆంగ్లరాజ్యప్రకృతియందు ప్రధానప్రభుశక్తి యెక్కడుండును.

36 పాలిమెంటు ప్రధానరాజక యధికారియనువాక్య మెంతవరకు సత్యము.

37 ఇంగ్లండు శాసననిర్మాణకార్యమెట్లు జరుగునో వివరింపుము.

**38** ఆంగ్లరాజ్యప్రకృతిని కొన్ని శాశ్వతపు నియమములు గలవు; కొన్నిటి మార్పుటకు వీలుగలదు. అవియేవి.

**39** ఆంగ్లరాజ్య ప్రకృతిని క్లుప్తముగ వర్ణింపుము.

**40** రాజుయొక్కయు, పార్లిమెంటుయొక్కయు పరస్పర సంబంధమును వివరింపుడు.

**41** ప్రజాశాఖకుగల యెన్నికకూటములు, ఎన్నికదారుల యోగ్యతలు, వివరింపుడు.

**42** ఇంగ్లండు ప్రజలు పార్లిమెంటు సభకు తమప్రతినిధులనెట్లు యెన్నుకొందురు.

**43** ప్రజాశాఖకుగల యధికారములను జెప్పుడు.

**44** పార్లిమెంటు కార్యములు జరుగురీతి వర్ణింపుడు.

**45** బిల్లులయొక్క రూపమును వర్ణింపుడు.

**46** కాబినెటు మంత్రులను జెప్పుడు. అమెరికను, ఇంగ్లీషుకాబినెటులకుగల భేదమేమి.

**47** రాజ్యఋణము, వర్తకపుబోర్డు, కోశాగారము, పరదేశపు ఆఫీసు (Foreign Office) ఈప్రతిష్ఠాపనములలో జరుగుపనుల వివరింపుడు?

**48** ఇంగ్లీషు, అమెరికను పార్లిమెంటు పద్ధతుల వివరించి, వానిభేదములను జెప్పుడు- వాని లోపాలోపములను జెప్పుడు-

**49** అమెరికను కాంగ్రెసు యాధారముజెందు రాజక ధర్మముల నాల్గిటిని జెప్పుడు-

**50** ప్రజాప్రభుశాఖలకుగల తారతమ్యమేమి-

## ఆరవ యధ్యాయము.

51 ఇండియాను పాలించుప్రభుత్వమును రెండుభాగములు జేయవచ్చును- అవియేవి-

52 ఇండియా కౌన్సిలునకును, ఇండియాకార్యదర్శికినిగల పరస్పర హక్కుల వివరింపుడు-

53 కార్యనిర్వాహక సభలెన్ని యిండియాలోగలవు. వాని నిర్మాణ మెట్లుండును-

54 ఇండియా శాసననిర్మాణసభలప్రకృతి వర్ణింపుడు-

55 ఇండియశాసననిర్మాణసభ్యతకు ప్రత్యేకపు ప్రాత నిధిక హక్కు యెవ రెవరికి గలదు-

56 ఇండియాలోని యెన్నికవిధానమును వర్ణింపుడు.

57 ఇండియాశాసనసభ్యులు విచారించకూడని హంశములేవి.

58 శాసననిర్మాణచర్యావిధానమును వర్ణింపుడు.

59 ఇండియాసామ్రాజ్యసభలయొక్కయు, రాజధానుల సభలయొక్కయు ప్రకృతినిదెల్పుడు.

60 మద్రాసులోని యెన్నికకూటములేవి.

61 బిల్లులు చట్టములగు మార్గముల వివరింపుడు.

62 స్వేచ్ఛ, స్వాతంత్ర్యమనుపదములకు రాజకశాస్త్రమునగల యర్థ మేమి.

63 వ్యక్తిస్వేచ్ఛను భద్రపరపుసాధనముల నాల్గింటిని జెప్పుము.

64 శాసనము, చట్టమనగ నేమియర్థము గలదు?

65 శాసననిర్మాణసాధనముల గొన్నిటి నుదహరింపుడు.

66 శాసనమనుపదము యంతర్గర్భితములగు యభిప్రాయములు గొన్ని గలవు అవియేవి.

67 హక్కు అనుపదమున యధ్యాహారములగు నభిప్రాయములేవి.

68 ప్రభుత్వము అనుపదము దేనినిసూచించును.

69 హేబియసు కార్పసు అనగ నేమి.

70 శాసనమునకును, స్వతంత్రమునకును పరస్పరవిరోధభావముగలదు. ఈవాక్య మెంతవరకుసత్యము?

---

## నానావిధములగు ప్రశ్నలు.

1 ఇతర ప్రతిష్ఠాపనములవలెనె, రాజప్రతిష్ఠాపనములయొక్కయు యథార్థభావమును నిశ్చయపరచుటకు కాలమును, వాడుకయు నవసరములై యున్నవి.

2 రాజ్యప్రకృతులయొక్క ప్రధానోద్దేశము చాలవరకు, తులాభారమును ఆటంకముల సమకూర్చుటయైయున్నది.

3 పాలనాంగము లొకదానినొకటి మితపరిచి, మొత్తముమీదపాలనయందు తులాభారముకలుగజేయవలెను.

4 రాజకప్రతిష్ఠాపనములు సేంద్రియపదార్థములవలె పరిణామకజీవితకలహమునకులోనై, స్వరక్షణ, స్వస్థాపనలకొరకు యొండొంటితో పోరాడుచు, తుదకు వృద్ధినొందుచుండును. దీనిని యమెరికా, ఇంగ్లండుచరిత్రల సహాయమున పరిశీలింపుము.

(ఇంగ్లండు-క్యాబినెటు, కామన్సుసభ ఇవి కాలక్రమమున ప్రభుసభను రాజునుతలదన్నెను. అమెరికా-ప్రెసిడెంటు యుద్ధకాలముల నిరంకుశప్రభుత్వముచేయుటకు వీలుండును. సెనెటు, ప్రతినిధిసంఘము, దాని యధ్యక్షుడు, వైసుప్రసిడెంటు, కమిటీలు, న్యాయాధిపతులు. వీరిలోకొంతమంది యుచ్ఛస్థితికిని, మరికొందరు నీచస్థితికిని వచ్చిరి. రాష్ట్రముల యధికారము క్రమముగ తగ్గెను)

5 రాజ్యప్రకృతికి మార్పులెట్లుకలుగును.

(1) రాజ్యప్రకృతిపై న్యాయస్థానము లప్పుడప్పుడు జేయు వ్యాఖ్యానములవలన;

(2) కాంగ్రెసు దానిలోజేయుసవరణలవలన ప్రయోగాంగపుకార్యములు ప్రజాంగీకారము జెంది, న్యాయస్థానములచే రద్దుజేయబడనప్పుడు వాడుకవలన వీనికికారణము లొకప్పుడు ఆర్థిక, నీతి, పరిశ్రామికవిషయములై యుండును.

6 శాశ్వతరాజ్యప్రకృతులు (అనగా వ్రాతచేత నిశ్చితములై చలనములేనివి) యనుమాట యదార్థముగ నొకపెద్దబూటకము. ఈవాక్యమును పరిశీలింపుడు.

7 రాజ్యపకృతులవలని లాభమేమి?

(మార్పును యతిశీఘ్రముగ కలుగజేయదు. ఆలోచన, శాంతము, క్రమక్రమముగ మార్పుగలుగుట, ప్రజలలో శాసనికబుద్ధి, శిష్టాచారము, స్థిరత్వము, వీనిని బలపరచును;)

8 యునైటెడ్డుస్టేట్సు రాజ్య ప్రకృతియందు సవరణలనుజేయువిధానమును వర్ణింపుడు.

(ఎ) కాంగ్రెసు తనశాఖలోని $\frac{2}{3}$ సభ్యుల యంగీకారముపైన మార్పవచ్చును; లేక

(బి) రాష్ట్రశాసనాంగములలో $\frac{2}{3}$ మంది కాంగ్రెసును యొకసంస్థానిక సంవిదమును సమావేశము జేయమని గోరవచ్చును.

(సి) రాష్ట్రములలో $\frac{3}{4}$ ముప్పాతిక శాసనాంగములు తమయెదుట దాఖలుజేసిన సవరణలను ఖాయపరుపవచ్చును.

(డి) వేఱువేఱురాష్ట్రములసంపిదములు సమావేశమునొంది, ఆసవరణల ఖాయము జేయవచ్చును.

9 సంయుక్తరాష్ట్రముల ప్రధానోద్దేశము సామర్థ్యముగల మధ్యప్రభుత్వమును సంపాదించుటయు, జాతీయైక్యత కాపాడుటయు, వ్యక్తిభేదములకు చోటిచ్చి, యుద్యోగులకు స్వేచ్ఛసంపాదించుటయునై యున్నది.

10 ప్రభుత్వము రాష్ట్రములోని కేంద్రోన్ముఖ పరాంగ్ముఖబలములకు సంధిజేయవలయును.

11 మాండలికప్రభుత్వమున జాతీయవ్యక్తిబలములకు సంయోగ్యతకలుగజేయు ప్రతిష్ఠాపనములు న్యాయస్థానములై యున్నవి. సంస్థానికప్రభుత్వములుకూడ నిటులేజరుగును.

12 సమానములగు యితరస్థితులందు ప్రభుత్వపద్ధతియలదు వ్యక్తులకు యధికారము పెరిగి, మధ్యప్రభుత్వమునకు తగ్గుకొలదిని, వ్యక్తులసమర్థత, స్వేచ్ఛ హెచ్చును

13 ఒకప్రతిష్ఠాపనము, నొకకార్యముయొక్క చెడుగులను విమర్శించుటయందు, వానిలోని స్వభావజనితకారణములను, వానికిసంబంధములేని యితరబలములు కలుగజేసిన ఫలితములను గమనింపవలెను.

14 ఒకప్రభుత్వముయొక్క భావము, గుణము, వర్ణము దాని నడుపు పాలకుల రాజకభావముపై యాధారపడియున్నవి.

15 యునైటెడ్డుస్టేట్సు రాజ్యప్రకృతిలోపములను జెప్పెము.

ఉ॥ (1) కాంగ్రెసుయొక్క పాలనాతంత్రము నిరాటంకములేకుండ జరుగదు.

(2) ఉద్యోగులపై తగినంతయధికారముండదు.

(3) శాసనాంగమును ప్రయోగాంగముచక్కబెట్టుటకవకాశములులేవు.

(4) దేశమునకువలయు శాసననిర్మాణముగావించుటకు జవాబుదారిగల యధికారులులేరు.

(5) ప్రెసిడెంటు, సెనెటు, ప్రతినిధిసంఘములకును కలహములుబుట్టుటకు వీలుగలదు.

పాలనతంత్రము నిరాటంకముగ నుండకపోవుటకు కారణములు.

(1) ప్రెసిడెంటు, అతనిమంత్రులు నాల్గుసంవత్సరములకొకసారి మారుచుందురు.

(2) ప్రతినిధిసంఘము రెండుసంవత్సరములకొకపర్యాయము మారును.

(3) కాంగ్రెసునకు శాశ్వతపు నాయకులు లేరు.

(4) కాంగ్రెసునకును, ప్రయోగాంగమునకును సంయోగ్యతయుండుటయవసరములేదు.

16 ప్రాతినిధికప్రభుత్వమునకు ప్రధానలక్షణములు నాల్గింటిని జెప్పవచ్చును. అవియేవి?

(ఎ) (1 ప్రజల సహజనాయకులనుండిగాని, లేక దేశములోని శ్రేష్ఠపురుషులనుండిగాని ప్రతినిధులేర్పడుట. 2 వారు తమయెన్నికదారులకు తమ యుపన్యాస సమ్మతులవిషయమై సంపూర్ణ జవాబుదారి కలిగియుండవలెను. 3 తమయెన్నికదారులకు కేవలము దాస్యభావముజూపక ఆలోచనకార్య స్వాతంత్ర్యముల యవసరమగుచో జూపుటకు శక్తియు యిచ్ఛయు కలిగియుండవలెను. 4 ప్రతినిధులు వ్యక్తిసమిష్టులద్వార తమయెన్నికదారులపై ప్రతిబింబ ప్రభావము కలిగియుండవలెను. అనగా ప్రజలవలన తమయధికారమును వారు

పొందినప్పటికిని తమ పాలనానుభవమువలన కలుగు లాభములను ప్రజలుపొం దునట్లును, తమ యధికయోగ్యతవలన యెన్నికదారులవిజ్ఞానము హెచ్చునట్లు ను ప్రవర్తింపవలయును. అనగ యొండొరులకు వారు కార్యకారణభావము జూపవలయును).

(బి) అమెరికారాజ్యప్రకృతియందు యీలక్షణములు కనుపడుచున్న వా లేనియెడల యెందుకు?

లేవు. కాంగ్రెసుసభ్యులు అమెరికాలోని శ్రేష్ఠులగువారు కారు. వారు కేవలము ప్రజల యనుచరులుగనుందురు. ప్రజాభావమే కేవలము సభ్యుల మార్గదర్శి. జవాబుదారియునుండదు.

దీనికికారణములు:— ప్రతినిధిసంఘము కమిటీలుగావిభజననొందుట; నా యకులనువారు లేకపోవుట. ఎన్నికదారులకు యభిలాషగలిగించుహంశములు చ ర్చింపబడవు.

17 ప్రాతినిధికపద్ధతి రెండుతత్వములనుండి ననుమానమునొందును.

అవి:— (1) ప్రజలే ప్రభులై యున్నారు. అనగా ప్రజాబుద్ధిస్వరూప మన దగు రాజ్యప్రకృతియే ప్రధానశాసనమైయుండవలెను. వారు దానిని మార్చ వలయును. పాలకులకు యధికారమివ్వవలయును. (2) పాలనాంగములు నిరం కుశములుగాకుండునట్లును, ప్రజలకు లోబడియుండునట్లు చూడవలయును. అ నగా ఒకదానినొకటి జాగ్రతగ తనిఖీజేయుచుండవలెను.

దీనిని సమర్థింపుము.

18 ప్రభుత్వము ఆత్మపరిశుద్ధత, శాసనికబుద్ధి యీ రెండుసాధనముల వలన యవిచ్ఛిన్నముగ జరుగును, విమర్శింపుము.

19 (1) ప్రభుత్వము పైతరగతులనుండి క్రిందకుబోవలయు.

(2) ప్రభుత్వముయావత్తు సంఘముయొక్క విధికార్యమైయున్నది అది సురాజ్యవిద్య నేర్చి ప్రయోగింపవలెను. పాలితపాలక విచక్షణలేక, అందరును పాలకులును, పాలితులును గావలయును.

ఈవాక్యముల చరిత్రద్వార విమర్శింపుము.

20 రాష్ట్రముయొక్క ప్రయోగాంగపువ్యవహారముల యధికారము కలిగియుండుటకుగాని, నడపుటకుగాని ప్రజలనుశక్తిమంతులుగజేయుట స్వాతంత్ర్యము ననుభవించుజనుల ప్రధానకర్తవ్యమైయున్నది.

21 ఈకార్యమునుగావించుటకు రెండుసాధనములుగలవు; (1)ప్రాతినిథికపద్ధతి (2) ప్రయోగాంగముపై ప్రతినిధిసంఘమునకు మంచి యధికారమునిచ్చుట-

22 మంత్రివర్గము పార్లిమెంటులోని విశేషాంశముపై సంపూర్ణముగ నాధారపడియుందురు. రాజుయొక్కసలహాలు రెండవపక్షముగనుండును.

23 (ఎ) స్వతంత్రరాజ్యము (స్వరాజ్యము) యొక్కప్రధానలక్షణము శాసననిర్మాణప్రయోగాంగములు వేఱువేఱుయధికారులస్వాధీనములోనుంచుట.

(బి) ప్రయోగాంగముయొక్కయధికారము స్వేచ్ఛకు నష్టముజేయును- కనుక దానికి స్పష్టముగు హద్దులేర్పఱవలయును-

(సి) రాష్ట్రాధికారిని హద్దులోనుంచుటకు, వానియధికారముల నిర్ణయించుటయు, నియామకకాలమునకే యుద్యోగమిచ్చుటయు, శాసనాంగముపై ప్రాభములేకుండ జేయుటయునైయున్నది-

(డి) ప్రయోగాంగపుయుద్యోగులు శాసనాంగములో సభ్యులుగనుండకూడదు- ఇవి స్వరాజ్య ముఖ్యభావములైయున్నవి- వీనినివిమర్శింపుడు-

24 అమెరికనులు శాసనాంగమును, నిర్మలముగను, స్వతంత్రముగను, ప్రజాసేవకులుగను, నిరంకుశాధికారపు శత్రువుగనుండుటకు కొన్నిమార్గములు గనిపెట్టిరి- వానిని వివరింపుడు-

25 ప్రధానన్యాయస్థానము రాజ్యప్రకృతియొక్క అంతస్సాక్షి యనవచ్చును- అది ప్రజాభావముయొక్క మనస్సాక్షియని జెప్పవచ్చును- విశేషాంశము కౄరత్వమునుండి గాపాడు స్వల్పాంశము రక్షణమార్గమైయున్నది-

26 యునైటెడ్డుస్టేట్సులోని న్యాయస్థానములు రాజ్యప్రకృతిపై యధికారులుగాక, దానివ్యాఖ్యానకర్తలైయున్నారు- వారు చట్టముల క్రమపరచరుగాని చట్టములయర్థమిదియని జెప్పి దానిప్రకారము వివాదనిర్ణయము గావింతురు- ప్రజాభావమిదియని స్థాపించి, దానిని ప్రయోగమునకు దీసికొనివత్తురు-

27 స్వరాజ్యములశాసనాంగము ప్రజాప్రతినిధిసంఘముగనుండునుగాన ప్రజలచే నడ్డులేనియెడల సర్వస్వాతంత్ర్యతను వహింపజూచును- ప్రయోగాంగమును కేవలము తమయేజంట్లుగనెంచి ప్రత్యక్షములగునాజ్ఞల రూపమునగాని లేక చిరకాల మనేకవిషయము పనికివచ్చుశాసనములద్వారాగాని ప్రయోగాంగమును స్వాధీనము జేసికొనును-

28 శాసనాంగము నిరంకుశాధికారము గాకుండు నుపాయము లెవ్వి-

[ప్రయోగాంగము శాసనాంగముతోడి వివాదనిర్ణయమునకుగాని, దానిని రద్దుజేసి, నూతనయెన్నికలకు ప్రజలను వేడవచ్చును- (ఇంగ్లండు); ప్రజలు పూరతనగౌరవముచేత శాసనాంగమునకు ప్రతికూలము, ప్రయోగాంగమువైపున పక్షపాతము జూపవచ్చును- (ప్రషియా;) లేక పరదేశవ్యవహారప్రాముఖ్యతచే, ప్రయోగాంగము శాసనాంగముపై మంచియధికారము కలిగియుండవచ్చును- (ప్రషియా, ఇంగ్లండు, ఫ్రాన్సు)]

29 యునైటెడ్డుస్టేట్సురాజ్యప్రకృతియం దొకటవనిబంధన, యెనిమిదవసూత్రము పరీక్షించ ప్రభుత్వములో శాసనాంగము జేయవలసిన కార్యములన్ని స్పష్టముగ దెలియును-

30 ఇంగ్లీషుపద్ధతిలోని క్యాబినెటుప్రభుత్వమును, యిండియాలోని కౌన్సిలుపాలనను వివరింపుము- వాని తారతమ్యములను దెల్పుము-

# GLOSSARY.



—* అ *—

(1) అర్థశాస్త్రము=(Political Economy) దేశములోని సంపత్తు యొక్క యుత్పాదన, పంట, వితరణము, (విభజన) యీవిషయములనుగూర్చి ప్రశంసించుశాస్త్రము.

(2) అభిజనాధిపత్యము (Aristocracy)=మహాపురుషపాలనజూడుడు.

(3) అధినివేశనము=వలసభూమి.

(4) అధికారవిచలనము=అధికారవిభజన (Decentralisation)

(5) అధికారసీమ=(Jurisdiction) అధికారముగల ప్రాంతము.

(6) అర్థము=రాజధనము (Finance)

(7) అంగసంపాదనము=(Organisation) వ్యూహనము,అంగీకరణము.

(8) అంగీకరణము=(Organisation) అంగాంగిసంబంధ ముండునట్లు జేయుట.

—* ఆ *—

(9) ఆర్థిక=(Economic) అర్థసంబంధమయిన.

—* ఉ *—

(10) ఉపనివేశము=వలసభూమి.

(11) ఉద్వేజనము=(Agitation) వుద్వేగము, ఆందోళనము.

—* ఏ *—

(12) ఏకత్రితసమాజము=(Body Corporate)

—* క *—

(13) కోడ్డు=విన్యస్తసంగ్రహము=శాసనములసంగ్రహము (Code)

(14) కామన్ వెల్తు (Common wealth)=మహానాడు, పంచాయితీ రాజ్యము.

(15) కాలని=వలసభూమి (Colony)

(16) కన్సర్వేటివ్ (Conservative)=శిష్టాచారుడు.

(17) కాపీరైటు (Copy Right)=ముద్రణాధికారము.

(18) కోరం=సభలో వ్యవహారము జరుగుటకు కావలసిన సభ్యుల సంఖ్య. (Quorum)

(19) కన్వెన్షన్=(Convention) సమాగమము, ఒకవిధముగు సభ, (అనగా యొకరిచేతను లేక పదుగురిచేతను పిలువబడినసభ)

(20) కార్పొరేషన్=(Corporation) సంఘము, శ్రేణి, సాధారణముగ మున్సిపల్ శ్రేణులపేరుగ వాడబడును.

—* గ *—

(21) గవర్నమెంటు=రాజ్యప్రబంధము, శాసనప్రణాళి.

—* చ *—

(22) ఛాన్సిలర్ (Chancellor)=అధ్యక్షాధికారి.

(23) ఛార్టర్ (Charter) మహాసన్నదు=అధికారపత్రము.

(24) చక్కు (Cheque)=దర్శనహుండి.

—* జ *—

(25) జనాభ=మనుష్యగణనము.

(26) జప్తు=సర్కారులో కల్పుకొనుట.

(27) జ్యూరి=(Jury)

(28) జమీందారు=భూస్వామి. (Land lord)

(29) జాతి=(Nation)

(30) జాతీయత=జాతీయభావము.

—* డ *—

(31) డైరెక్టర్=నిర్వాహకుడు.

(32) డిపార్టుమెంటు=పాలనాంగపువిభాగము.

—* న *—

(33) నిర్వాహకపరిషదము=డైరెక్టరులబోర్డు(Board of Directors)

(34) నిర్వాహకుడు=అధ్యక్షుడు, డైరెక్టరు (Director)

(35) నిర్వాచకుడు=ఎన్నికదారుడు.

(36) నగరము=(City)

(37) నిరంకుశప్రభువు=(Despot) హద్దులేనిరాజు.

(38) నిర్వచనము=ఎన్నిక.

(39) నిర్వచనాధికారము=ఎన్నికయధికారము.

(40) నవగ్రాహ్యత (Radicalism)=నవపసంది, నూతనవిషయముల త్వరితముగ గ్రహించి క్రియించునట్టిస్వభావము. సమూలముగ మార్పునొందవలయుననుభావము.

—* ప *—

(41) పంచాయతి=మధ్యస్థత.

(42) పాలన- శాసనము- రాజ్యప్రబంధము, (Administration)

(43) పాలకుడు=శాసనకర్త, కార్యనిర్వాహకుడు(Administrator)

(44) ప్రజాధిపత్యము=(Democracy) ప్రజలచే పాలన.

(45) పార్లమెంటు=(Parliament) ప్రాతినిధికపాలనసభ.

(46) ప్రజాస్వామికము=(Democracy) జనతాధీనశాసనము, ప్రజలచేనగు ప్రభుత్వము.

(47) ప్రతిదానము (Exchange)=మారకము.

(48) ప్రయోగిక (Executive)=అమలుజేయునట్టి.

(49) ప్రాతినిధిక=స్మరణాత్మకప్రతిరూపక, ప్రధర్మక, ప్రతినిధిభావ మునొందిన (Represantative)

(50) ప్రతినిధి=బదిలీగా యుద్యోగముజేయువాడు

—* బ *—

(51) బాలట్ (Ballot)=చీటీద్వారా ఓటిచ్చుట.

(52) బోర్డు (Board)= ఉ॥ జిల్లాబోర్డు, లోకల్ బోర్డుసభ, సమాజము, సమితి, పరిషదము.

(53) బ్యాంకు (Bank)

(54) బడ్జెటు=(సాంవత్సరిక) ఆదాయవ్రయపట్టి, జమా ఖర్చు లెఖ్ఖ. (Budget)

(55) బేరన్ (Baron)= ఒకవిధమగు యింగ్లీషుప్రభువు.

(56) బందోబస్తు=వ్యవస్థ, విధానము (Establishment)

(57) బిల్లు (Bill)=శాసననిర్మాణాంగముయొక్క యంగీకారమునొందక పూర్వము శాసనసూచనకుగల పేరు.

—* మ *—

(58) మధ్యస్థత=మధ్యవర్తికార్యము, పంచాయితికార్యము.

(59) మహాపురుషపాలన=అభిజనాధిపత్యము, శ్రేష్టరాజ్యము, దేశములో జన్మధనము, విద్య, వయస్సు, వీనిలో నేదయినను, లేక యెన్నియయినను కలిగినటువంటివారిపాలన.

(60) మహాజనుడు=విస్తారముమూలధనముగలవాడు, పెట్టుబడి పెట్టువాడు (Capitalist)

(61) మహాసన్నదు=అధికారపత్రము, రాజాజ్ఞపత్రము (Charter)

(62) మహానాడు=పంచాయితీరాజ్యము (Commonwealth)

(63) మనసబ్దారి=కట్టుబడిసాంప్రదాయము (Feudal system) భూస్వామిక పాలనవిధానము.

(64) మ్యునిసిపాలిటి=పట్టణపారిశుద్ధసంఘము.

(65) మండలము=సంవర్గము, సంయుక్తరాష్ట్రము.

—* ర *—

(66) రాజ్యప్రబంధము=(Administration) శాసనము, పాలన.

(67) రాజ్యప్రకృతి=రాజ్యవ్యవస్థ (Constitution)

(68) రాజధనము=అర్థము (Finance)

(69) రాజకరప్రణాళి=(Fiscal System) పన్నులపద్ధతి.

(70) రాజనీతివిశారదుడు=(Politician)

(71) రాజనీతివిద్య=(Politics)

—* ల *—

(72) లౌకిక=సివిల్ చూడుము.

(73) వలసభూమి=(Colony) అధినివేశము, వుపనివేశము, నూతనబస్తి ఒక దేశమునుండి నూతన దేశమునకు బోయి స్థాపింపబడిన నివేశస్థానము

(74) వ్యవస్థ=విధానము, నియోజనము, రాజ్యప్రకృతి (Constitution)

(75) వ్యక్తి=(Individual) సమిష్టివ్యతిరేకమయినది. ఏకతత్వసంబంధమయిన (అనగా సముదాయముమీదగాక) పదార్థములను వేఱువేఱుగ విచారించుట.

(76) వరణము=ఎన్నిక.

(77) వినిమయము=మారకము.

(78) వ్యూహానము=అంగీకరణము.

—* శ *—

(79) శ్రేణి=సంఘము (Corporation)

(80) శ్రేష్ఠరాజ్యము=మహాపురుషపాలనజూడుము.

(81) శాసనకర్త=(Executive) కార్యనిర్వాహకుడు.

(82) శిష్టాచారుడు=నవద్వేషి.

(83) శిల్పశిక్ష=Techinical education)

—* స *—

(84) సివిల్=(Civil) దివాణపుసంబంధమయిన.

(85) సభ్యత=నాగరికత, కూడికకలిగి రాజకార్యమువ్యవహరించుట.

(86) సహోద్యోగి=సహకారి.

(87) సమ్యావస్థ (Balance) తుల్యావస్థ=సమత, సామ్యం.

(88) సమావాసకరణము (Domiciting)=స్వదేశస్థునిగజేయుట.

(89) సంయుక్తము=సంఘుతము (Federation)

(90) సంఘుతము=సంయుక్తము, కూడికజెందినది.

(91) సమిష్టి=(Collective) సమాజము, మీదవిచారించిన వ్యక్తికి వ్యతిరేకమయినది.

(92) సంరక్షణ=సంస్థన, పరిపోషణ.

(93) సమిష్టివాదము=(Socialism)

(94) సంస్థానిక (Constitutionel)=రాష్ట్రముయొక్క వ్యవస్థ (అనగా నిర్మాణముయొక్క కట్టుబాటు) ననుసరించినటువంటి సంస్థానము (రాష్ట్రముయొక్క నిర్మాణము రాజప్రకృతి.

(95) సర్టిఫికెట్ (Certificate)=ప్రశంసాపత్రము.

(96) సంవర్గము=మండలము, కూడికజెందినది.

(97) స్వయమాధిపత్యము=(Autocracy) అని యంత్రస్వామ్యము.

(98) సిటిజన్‌షిప్=(Citizenship) నాగరికహక్కు, శహరహక్కు

(99) సమాగమము=(Convention)

—* హ *—

(100) హక్కు=స్వత్వము, అధికారము (Right)

# భాషాసేవకసమాజము గుంటూరు.

ఎడిటర్:—జె. గురునాథంగారు బి. యె.

మానవకోటియొక్క అభివృద్ధికి కారణములయినవానిలో నొకటి వాంఙ్మయమని జెప్పవచ్చును. ప్రజలయొక్క తలంపులు, వాంఛలు, ఆదర్శనములు, మరియు సుఖదుఃఖభావములు వీనినన్నిటిని ప్రతిబింబ మొనర్చునది వారి వాంఙ్మయమైయున్నది.

ఆంధ్రభాష వలయునంత వృద్ధిచెందినదని జెప్పుటకు వీలులేదు. స్వేచ్ఛాచింతనమున ప్రజలకు దారిజూపుటకు గ్రంథములనేకములు కావలసియున్నవి. అట్టి గ్రంథములను ప్రచురించుటయే యీ సమాజమువారి ముఖ్యోద్దేశమైయున్నది.

ఇందు ముఖ్యముగా ప్రజల స్వకల్పనాశక్తిని సంపాదించునటుల సాంఘిక, ఆర్థికరాజకీయ విషయముల గ్రంథములు ప్రచురింపబడును. మఱియు, దేశచరిత్రలు, నూతననవలలు, కళావిద్యలు, మొదలగువానిపై గ్రంథములనెవరైన వ్రాయునెడల వారికి తగుప్రోత్సాహమివ్వబడును.

1 సంస్థానికత్రయము.

2 మాలిని—ఇదియొక స్త్రీరత్నముచే వ్రాయబడిన సాంఘికనవల.

3 మహాపురుషులు:—వారిపూజా సేవావిధానము:—ఇది ఆంగ్లేయ వాంఙ్మయమున ప్రసిద్ధివహించిన కార్లైల్ (Carlyle) యొక్క "హీరోజ్ అండ్ హీరోవర్షిప్" (Heroes and Hero-Worship) ననుసరించియు ఇమర్సన్ (Emerson) యొక్క రిప్రజెంటేటివు మెన్ (Representative men) ననుసరించియు వ్రాయబడినది.

4 రాజకదర్శనము:—ప్రభుత్వము, దానియుద్దేశములు, లక్షణములు, నియమములు, రాజ్యప్రకృతులు, ప్రాతినిధికప్రభుత్వము, తల్లక్షణములు, నియమములు, రాజకీయతత్వసిద్ధాంతము, రాష్ట్రీయభావము మొదలగు విషయములను విపులముగ ప్రశంసించును.

అర్థశాస్త్రము, తర్కశాస్త్రము, నీతిశాస్త్రము మొదలగు గ్రంథములు మాసమాజమువారిచే వ్రాయబడును-

జనసామాన్యముకొరకు మా గ్రంథములన్నియు సులభశైలిని వ్రాయబడి కొద్దివెలలకు విక్రయించబడును- సంవత్సరమునకు నాల్గుగ్రంథములు ప్రకటింపబడును-

శాశ్వతపు చందాదారులకు నీగ్రంథమాలలోని గ్రంథములన్నియు అంచెకూలి మేమేభరించి ప్రవేశరుసుము రు 0-2-0 తో, ప్రతినూరుపేజీలకు నాలుగు అణాలవంతున బంపువారము- ప్రతిపుస్తకము అచ్చుపడినతోడనే వ్యాల్యూపేయబిలుద్వారా చందాదారులకు పంపబడును-శాశ్వతపుచందాదారులు కాగోరువారు ఈ క్రింది నమూనాచించి దస్కతుచేసి బంపవలెను- నమూనాలేనియెడల విడికాగితముమీద నాయర్థమిచ్చుమాటలు వ్రాసిబంపపచ్చును.

మనయాంధ్రదేశమున వాఙ్మయవృద్ధికొఱకు పాటుపడి మహోపకారముజేయుచున్న రెండుసమాజములుగలవు- కాని సంపూర్ణఫలితము సమకూడుటకు యనేకములగు సమాజము లేర్పడవలయునని మాతాత్పర్యము- ఏబదరువది సంవత్సరములు ప్రయత్నము జేసినను యాంధ్రభాష కొఱతతీరదు-

మేనేజరు,

భాషాసేవక సమాజము, గుంటూరు

# దరఖాస్తు ఫారం.

భాషాసేవకసమాజము మేనేజరు గారికి, గుంటూరు.

అయ్యా,

భాషాసేవక సమాజగ్రంథములలో నిదివరకు ప్రచురింపబడినట్టి బుస్తకముల నేను కొనగోరుచున్నాను- కావున తమశాశ్వతపు చందాదారులలో నన్ను నొకనిగ జేర్చుకొని ప్రస్తుతము సిద్ధముగానున్న పుస్తకముల వెంటనే వ్యాల్యూపేబిలుద్వారా పంపవలసినది- ఇకముందు బ్రచురింపబడు గ్రంథము లెప్పటివప్పుడు వ్యాల్యూపేబిలుద్వారా యీ దిగువ దస్కతు జేసిన నాకు పంపుచుండవలసినది-

పేరు

చిరునామా

పోస్టు

జిల్లా


# దరఖాస్తు ఫారం.

భాషాసేవకసమాజము మేనేజరు గారికి, గుంటూరు.

అయ్యా,

భాషాసేవక సమాజగ్రంథములలో నిదివరకు ప్రచురింపబడినట్టి బుస్తకముల నేను కొనగోరుచున్నాను. కావున తమశాశ్వతపు చందాదారులలో నన్ను నొకనిగ జేర్చుకొని ప్రస్తుతము సిద్ధముగానున్న పుస్తకముల వెంటనే వ్యాల్యూపేబిలుద్వారా పంపవలసినది. ఇకముందు బ్రచురింపబడు గ్రంథము లెప్పటివప్పుడు వ్యాల్యూపేబిలుద్వారా యీ దిగువ దస్కతు జేసిన నాకు పంపుచుండవలసినది.

పేరు

చిరునామా

పోస్టు

జిల్లా

# భాషాసేవక సమాజము వారివద్దదొరుకు గ్రంథములవివరం.

---

## —: సంస్థానిక త్రయము :—

ఇది జె. గురునాథం, బి. యే. గారిచే వ్రాయబడినది. భాషాసేవక సమాజము వారిచే ప్రచురింపబడిన ప్రథమగ్రంథము

విషయసూచిక :—



☞ దీనివెల రు. 0-10-0 మా చందాదారులకు రు. 0-6-0 కు యివ్వబడును.

## II మానవహక్కులు (Rights of man.)

గ్రంథకర్త జె. గురునాథం బి. యే. గారు షుమారు 125 పేజీలుగల చిన్న పుస్తకము.

విషయసూచిక :—

క్కులు:—కార్యనిర్వాహకత్వము (4) ప్రాతిపదిక హక్కులవివరం (5) వ్యవహారికహక్కులు (6) సంఘము మనుజులపై న్యాయముగ జెల్లించదగిన యధికారమునకు హద్దులు (7) స్వాతంత్ర్య చరిత్రము.

ర్ 0—8—0

## II రాజ్య తంత్రము.

ఇది ఉన్నవ జె. నాథం గార్లచే రచింపబడినది.

దినికె 0..

☞ పైగ్రంథములు వలయువారలు,
మేనేజరు భాషాసేవక సమాజము,
గుంటూరు అని వ్రాయవలెను.